# దివోదాసు

(నవల)



రచన:



రాహుల్ సాంకృత్యాయన్

అనువాదం:

ఆలూరి భుజంగరావు

విశాలాంధ్ర ప్రచురణాలయం
విజయవాడ-4

# 1. సప్తపురాల విధ్వంసం

"సప్తయత్పురః శర్మ శారదీర్దర్దత్ దాసీః"

(క్రీస్తు పూర్వం 1220 సం.)

సప్తసింధు (పంజాబ్) లో వేసవిలో ఎండయూ భరించలేము ; చలి కాలంలో చలినీ భరించలేము. అయినా, గ్రీష్మంతో పోల్చిచూస్తే శరత్తు ఎంతో నయం అనిపిస్తుంది. అసలు సప్తసింధులోని ఆర్యులు శరదృతువును చాలా ఆహ్లాదకరమైన ఋతువుగా భావిస్తుంటారు : జీవితానందాన్ని సంపూర్ణంగా, సంతృప్తికరంగా అనుభవించడం అక్కడి ఆర్యుల ఆశయం. అందు కవసరమైన సాధనయూ, అవకాశాలు కూడా వున్నాయి వారికి : ఆర్యుల ముఖ్యవృత్తి పసుపాలన. పసువులే వాళ్ళకు ప్రధానమైన ధనం : చెదురుగా, అక్కడక్కడా వ్యవసాయం కూడా చేస్తూ వుంటారు. ఆర్యులు ఎక్కువగా తమ ఆహారానికి పసువుల మీద ఆధారపడుతూంటారు. కాక పోతే, వ్యవసాయం వలన ఏ కొద్దిగానో యవ ధాన్యం[1] పండిస్తూంటారు.

---

1. యవలు : ఇవి గోధుమజాతికి చెందినవి. గోధుమ కంటె కొంచెం ముదుకగా వుంటాయి. ఉత్తర హిందూస్థానంలో ఈ పంట పండుతుంది. మన ఆంధ్రదేశంలోనూ కర్నూల్ జిల్లాలోని కొన్ని భాగాల్లో యవల్ని పండిస్తుంటారు.

ఈ యవలతో పేలపిండి[2] అపూపా[3]లనూ చేసుకుంటూ వుంటారు.

ఆర్యులు తమ పశుధనాభివృద్ధినీ, రక్షణనూ సదా కోరుతూ వుంటారు. తమ వాంఛితాన్ని ఇలా వ్యక్తపరిచేవారు (1/45/6 ఋగ్వేదం) "మా స్త్రీ-పురుషులకు, గుర్రాలకు, గొర్రెలకూ, మేకలకు, ఆవులకు – శుభ సమృద్ధులు చేకూరు గాక!" ఈ పశువుల్నే ఆర్యులు ప్రాణప్రదంగా మేపుకునేవారు. ప్రతి గృహస్థూ విధిగా కొన్నివందల పశువుల్ని కలిగివుంటాడు. మహారాజుకూ, సాధారణ గృహస్థుకూ వ్యత్యాసం అట్టే వుండదు. పశుధనం అపరిమితంగా వుంటుంది మహారాజువద్ద! ఒక్కొక్క రాజుకు వేల సంఖ్యలో వుంటాయి పశువులు.

అప్పటికి మూడు శతాబ్దాలక్రితం ఆర్యులు పణిజాతి[4] ప్రజల

---

2. మన ఆంధ్రదేశంలోనూ మొన్న మొన్నటి వరకూ జొన్నా, రాగులలో 'పిండి'ని చేసుకుని నిలవ పెట్టుకునేవారు. ప్రయాణాల్లో బ్రాహ్మణులూ ఆదిగాగల అగ్రవర్ణాలవారుకూడా ఈ 'పిండి'ని వెంట తీసుకువెళ్ళడం కద్దు. ఈ 'పిండి'లో బెల్లం కలుపుకుని, ఉప్పు, మజ్జిగా కలుపుకొని తింటుంటారు.

3. అపూపాలు = రొట్టెలు. అపూపాలకు అపభ్రంశంగా తెలుగువారు బియ్యపు పిండిలోచేసిన చిన్నిచిన్ని బూరెలను అప్పాలంటారు.

4. ఈ పణిజాతినే, నాగజాతి అని, ఫణిజాతి అని కూడా అంటూ వుంటారు. వీరు ద్రావిడులకు పూర్వులు. వీరికి సముద్రయానంలో గొప్ప నేర్పు ఉంది. ఆ రోజుల్లో వీరు సముద్రుడి మీద దాదాపుగా ఏకాధిపత్యాన్ని కలిగివుండే వారని చెప్పవచ్చు. అందువల్లనే అనుకుంటాను, మన పూర్వ కవులు పాతాళలోకాన్నొకదాన్ని 'సృష్టించి,' వీళ్ళను పాముల్నీ, జెర్రుల్నీ చేసేశారు. భారత రచనా కాలానికి, ఈ జాతికి, ఆర్యజాతికి రక్తసంబంధం కూడా ఏర్పడ్డది. అర్జునుడు భూప్రదక్షిణం చేయడానికి వెళ్ళిన సందర్భంలో, అతడిని మోహించి, సముద్ర మధ్యంలో వున్న తన అంతఃపురానికి తీసుకు వెళ్ళిన భుజంగమ రాజకన్య ఉలూచి ఈ పణిజాతి స్త్రీయే! అన్యజాతి కారణంగా అర్జునుడు అభ్యంతరం చెప్పే పద్యాన్ని, చేమకూర వేంకటకవి 'విజయ విలాసం'లో నుండి ఇక్కడ వుదహరిస్తున్నాను.

"అనిన ఫణిజాతినీ, నేను మనుజజాతి। అన్యజాతి ప్రవర్తించు టర్హమగునె।
ఏల ఈకోర్కి యనిన, రాచూలికనియె। జిలుపచెలువంపు పల్కుల జిలుపచెలువ"

ఈ ఉలూచే అర్జునుడికి ఇలావంతుణ్ణి కంటుంది.

సమృద్ధమైన నగరాల నెన్నింటినో జయించారు. అయినా, వాళ్ళకు నగర వాసంమీద అంతగా ఆసక్తిలేదు. ఆర్యులకు అరణ్యాల్లోనూ, వ్యవసాయ క్షేత్రాల్లోనూ స్వచ్ఛందంగా జీవితాన్ని గడపడం యిష్టం. కనుక వారు శతాబ్దాలక్రితమే అనేక నగరాలను జయించినప్పటికీ నగరవాసులు కాలేక పోయారు. గ్రామవాసమూ వారికి అంతగా నచ్చదు. (కథాకాలం నాటికి 'గ్రామ' శబ్దం కొన్ని కుటుంబాల సమూహానికి మాత్రమే వర్తించేది). పంటభూముల సమీపంలో చిన్ని చిన్ని యిండ్లు నిర్మించుకునేవారు. కానీ, ఏ ఒక్క ఇంటిలోనో స్థిరంగా నివసిస్తూ, వందల సంఖ్యలో వున్న తమ పశువుల్ని మేపుకోవడం సంభవంకాదు. కనుకనే ఆర్యులు నిరభ్ర ఆకాశం క్రింది సువిశాలమయిన భూమే తమ నివాసంగా భావించేవారు!

వర్ష ఋతువు ఇతర ఋతువు లన్నిటికంటె కష్ట మయిందిగానూ, భయోత్పాతాన్ని కలిగించేదిగానూ వుండేది. వర్షాకాలంలో సప్తసింధువులే (నదులు), కాక ఇతర అనేక నదులూ, కాలువలూ జలాధిక్యత వలన పొంగి భయంకరమైన వరదలకు కారణ మయ్యేవి. ఈ వరదల్లో ఆర్యుల ఇండ్లూ, పశువులూ కొట్టుకుపోయేవి. ఇండ్లు పోయినందుకు వారేమీ బాధ పడెవారు కాదు; కాని పశువులు పోతేమాత్రం ఆర్యులు బహు చింత పడేవారు. ఏ ఉత్పాతాలూ సంభవించకుండా వుండడానికి ఆర్య పురోహితుడు సదా ఇంద్రుణ్ణి, పర్జన్యుణ్ణి(వరుణుణ్ణి, స్తుతిస్తూంటాడు; వాళ్ళకొరకు సోమ(భంగు) హోమాలను సిద్ధపరుస్తూంటాడు. ఎంత సోమ-హోమాల నర్పించినా, దేవతలు మానవులకు వశ్యులై . మనోగతాన్ని నెరవేరుస్తారనే విశ్వాసం కల్గేది కాదు! ఒకవైపు వర్షాలు భూమాతకు మనోజ్ఞమైన హరిత వసనాన్ని కట్టబెట్టేవి, ఎటు చూసినా పశువుల మేతకు నిల్లువెత్తున పెరిగిన పసిరిక కళకళ్ళాడుతూ కనుపించేది. మరోవైపున వరుణదేవుడి క్రుద్ధనేత్రాలు భయంకరమైన దృశ్యాన్ని కండ్లక్కడుతూ వుండేవి. ఏ క్షణాన వరుణదేవుడికి కోపం వస్తుందో, నదీనదాలన్నీ ఏకమై ప్రళయాన్ని సృష్టిస్తాయో, ఎవరికి తెలుసు ?

గ్రీష్మ ఋతువులో ఇక వరుణదేవుడి భయం లేదు. కానీ. వైశాఖ, జ్యేష్ఠ మాసాల్లో ఎండలు మహోగ్రరూపాన్ని దాల్చేవి. ఉన్నివస్త్రాలూ, చర్మకంచుకాలూ చెమటతో తడిసి పోయేవి. శరీరాలమీది ఉన్నివస్త్రాలనూ,

చర్మవసనాలనూ తీసి అవతల పడేసేవారు. అప్పటి ఆర్యసమాజానికి పూర్తి నగ్నత అంతగా నచ్చేది కాదు. కాని, మరీ ఎండ లెక్కువైనప్పుడు నగ్నంగా ఉంటే బాగుండని అనుకునేవాళ్లు. ఏ అవాంతరాలకూ ఆస్కారా న్నీయ తుంటా, కేవలమూ ఆనందాన్ని మాత్రమే ప్రసాదించేది శరదృతువు. చాలా రోజుల ముందే శరదృతువును గడపటానికి, తమకూ, తమ పశువులకూ అనుకూలమైన ప్రదేశాన్ని ఎన్నుకునేవారు!

ఆర్యుల ముఖ్య శాఖలు (గణాలు) ఐదు. ఈ ఐదు గణాలూ కథాకాలంనాటికి అనేక గణాలుగా విస్తృతి పొందాయి. అయినప్పటికీ ముఖ్యగణాలైన - పురు, యదు, ద్రుహ్యు, అను (మను) - మొదలైన గణాల గౌరవం అక్షుణ్ణంగానే వుంది. మొత్తం ఆర్యగణాల్లో పైశాఖలు గొప్ప శక్తివంతమైనవికూడాను. పురుగణం సప్తసింధు (పంజాబ్) యొక్క తూర్పు ప్రదేశాల్లో పరుష్ణి (రావీ) నదినుండి సరస్వతీ నదివరకూ వ్యాపించి వుంది. ఈ పురుగణంలో అనేకమైన ఉపశాఖలుకూడా వున్నాయి. కృషిక, భరత, త్రృత్సు - ఇవన్నీ పురుగణపు ఉపశాఖలు. ఈ ఉపశాఖల మీద కూడా మూలపురుగణానిదే ఆధిక్యత ఎక్కువగా వుంటుంది. పురుగణపు పెద్దను (రాజును) అందరూ గౌరవిస్తూ వుంటారు. ఇతర ఆర్య రాజుల్లో పురుగణపు రాజుకూ, ఆ రాజ వంశానికీ ప్రముఖ స్థానం లభిస్తూ వుంటుంది. శౌర్య, పరాక్రమాల్లో పురురాజ వంశాన్ని చెప్పే, మరో వంశాన్ని చెప్పాలి. ప్రతి పురురాజూ తన జీవితకాలంలో గొప్పగా పరాక్రమాన్ని ప్రదర్శించి తన వంశపు పూర్వౌన్నత్యాన్ని ఉద్దీపింప చేయా లనే చూస్తుంటాడు. పరాక్రమాన్ని ప్రదర్శించడానికి అవకాశాలు కూడా బహుళంగా వున్నాయి పురువంశానికి! సప్త సింధుయొక్క తూర్పు భాగంలో పురుగణం వుంది. ఈ పురుగణానికి ఉత్తరపు సరిహద్దులో, యమునానదికి ఆవలి భూమంతా అసురులది. * వీరు కిరాతజాతికి చెందిన వారు. ఈ కిరాతకులను జయించడం, ఆర్యులకు, పణిజాతిని జయించినంత సులభం కాదు. ఆర్యులకూ ఈ కిరాతకులకు సదా సంఘర్షణలు జరుగుతూ వుంటాయి. ఆర్యుల రాగి ఖడ్గాలకు సంఘర్షణలు లేకపోతే ఎలా?

---

* వీరు ప్రస్తుతపు నేపాల్ వాసులైన గూర్ఖాలకు అత్యంత ప్రాచీనులు.

దృషద్వతి నదికి రెండువైపులా చాలా దూరంవరకు పచ్చిక మైదానాలు వ్యాపించి వున్నాయి. ఆ మైదానాల్లో అసంఖ్యాకంగా ఆవులూ, ఎద్దులూ, గుర్రాలూ ఇతర పశువులూ మేస్తున్నాయి. కొన్నిగుర్రాలు ఎర్రగా వున్నాయి. మరికొన్ని తెల్లగా వున్నాయి, ఇతర రంగుల్లోనూ కొన్ని వున్నాయి, పుష్టికరంగా అందంగా అనేక రంగుల్లోవున్న ఈ గుర్రాలు ఆర్యులకు ప్రాణ సమానం. ఆర్యులకు గుర్రాల కంటె ప్రియమైన జంతువులు మరి లేవనే చెప్పవచ్చు. ఉత్తమజాతి అశ్వాలను కలిగివున్నందుకు వారు ఎంతో గర్విస్తారు కూడాను.

వర్షఋతువులో దృషద్వతి కూడా తప్పకుండా భయంకర రూపాన్ని దాలుస్తుంది. కానీ, అది శరదృతువు. నది తన ఆశ్రితులకు ఏ విధమైన చెరుపూ చేయకుండా సౌమ్యంగా పారుతోంది. ప్రవాహానికి దగ్గరలోనే క్రొత్తగా నిర్మించుకున్న యిండ్లు కొన్ని వున్నాయి. అక్కడే అడవిలో లభించిన ఆకుల్తో, కర్రలతోనిర్మించుకున్నారా గృహాలను. గృహాలకు చుట్టూ కట్టెల్తో ఎత్తైన గోడల్ని కట్టుకున్నారు. రాత్రిపూట సింహాలూ పులులూ పశువుల్ని ఎత్తుకుపోతూవుంటాయి. అందువలన బయటి చెక్కగోడల్ని కొంత బలంగానే నిర్మించుకున్నారు. అక్కడ మాత్రం దృషద్వతి నిజంగానే దృషద్వతి! (రాళ్ళతో నిండినది) ఇంకొంచెం ముందుకుపోతే రాళ్ల తగ్గి ప్రవాహం సాఫీగా వుంటుంది అక్కడికి బృహత్ పర్వతం (హిమాలయం కథాకాలంనాటికి హిమాలయానికా పేరు రూఢికాలేదు. కనుకనే బృహత్ పర్వత'మని వాడడం జరిగింది) ఏమంతదూరంకాదు. కాని ఆర్యులకా పర్వతంతో సంబంధమేముంది?

వేలసంఖ్యలో వున్న పశువుల్నీ, దృషద్వతి తీరంలో బహుదూరం వరకూ వ్యాపించివున్న గృహాలనూ చూస్తూనే అది సాధారణ ఆర్యగణపు గ్రామం కాదని తెల్సుకోనవచ్చును. పురుగణ నాయకుడు పురుకుత్సుడు అక్కడికి తన సపరివారంగా వేంచేశాడు. పురుకుత్సుడివెంట పశువులు, పురుషులు అధికసంఖ్యలో ఉండడం సహజమైన విషయమే! ఆ గ్రామంలో యువకులు అధికంగా వున్నారు, స్త్రీలూ వున్నారుగానీ చాలా తక్కువ! ఆర్యయువకులు బంగారురంగు మీసాల్ని బహుశ్రద్ధగా పెంచుతూ వుంటారు; గడ్డాలు పెంచాలన్న ఆసక్తిని కనబరచరు. కానీ, యువ

కత్వాన్ని దాటి ప్రౌఢత్వంలో కాలుపెట్టగానే బంగారు రంగు గడ్డాల్ని పెంచడంలో మహా మోజు కనపరుస్తారు. ఆర్యపగణంలో గడ్డాలకు కొంచెం అధికంగానే గౌరవం లభిస్తుంది. గడ్డాన్ని పెంచుకున్న ఒక ప్రౌఢ ఆర్య నాయకుడు తన గడ్డాన్నిగురించి ఇలా అభిప్రాయాన్నిచ్చాడు. "నా శరీరం కొద్దిది. ముఖంకూడా శరీరానికి తగినట్టుగా చిన్నది. రంగు వ్యత్యాసం వున్నదిగనకగానీ, లేకపోతే నాకూ, కిరాతకులకూ ఆటే వ్యత్యాసం వుండదు. ఈ గడ్డంవల్లనైనా ముఖం కొంత గంభీరంగా వుండి, ఆర్యత్వాన్ని ద్యోతకంచేస్తూ వుంటుంది!" నిజంగానే ఆర్యులు గడ్డాలు పెంచడానికి ఇదే ఒక్కకారణం కావచ్చు. ఏమైనాగానీ, గడ్డాలు పెంచినందువల్ల ఒక బాధమాత్రం నిస్సందేహంగా తీరిపోతుంది. ప్రతి పది, పదిహేను రోజులకూ క్షురకుడి ప్రాణాలు కొరకనవసరం లేకుండాపోతుంది! కాక పోయినా. గడ్డాలుండడంవల్లవచ్చే మహా నష్టంమాత్రం ఏముంది? ఈ గడ్డాలు పెంచేవారు నవయువకులైతే ఏ తరుణీమణీ దగ్గరకు రాదేమో! గడ్డాన్నిచూసి భయపడుతుందేమో ననుకోవచ్చు! కానీ వీళ్ళుటూ యువ కత్వాన్ని దాటినవారే! మరుణీమణుల హృదయాలను ఆకర్షించేశక్తి తమ కెటూ లేదని రూఢిగా తెల్సినవారే!

ఆ పురుగణపు గ్రామం తాత్కాలికమైందే అయినా. మనుష్యులకూ, పశువులకూ సర్వావసరాలూ తీరేట్టు క్రమబద్ధంగా కట్టుకున్నారు ఇండ్లు! (వాటిని ఇండ్లు అనడంకంటె పర్ణశాలలనడం సమంజసంగా వుంటుంది!) గుర్రాలకూ, ఆవులకూ, మేకలకూ, గొర్రెలకూ - ప్రత్యేకం దొడ్లు వున్నాయి. ప్రొద్దుక్కుంకకముందే పశువులన్నిటినీ వాటివాటి దొడ్లల్లోకి తోలేస్తారు. సూర్యోదయంతోపాటు పాడి పశువుల్ని మినహాయించి, మిగిలిన వాటన్నింటిని అడవిలోకి తోల్తారు. పితుక్కున్న తరువాత పాడి పశువులుకూడా అడవివైపు వెళ్ళిపోతాయి మేతకు! గ్రామంలోనివారు ఉషా గమనంకొరకు చాలా ఆసక్తిగా ఎదురు చూస్తూంటారు. ఈ ఒక్క గ్రామమే కాదు; ప్రతి గ్రామమూ ఉషాగమనంకొరకు తత్పరతతో ఎదురుచూస్తూ ఉంటుంది. రాత్రిపూట్ల అంధకారం, అనేకమయిన అజ్ఞాత, అస్పష్ట భయాలకు కారణ భూతం! పులులూ, సింహాలలాటి క్రూర జంతువుల భయమే కాకుండా, మానవ - శత్రువు

ఎక్కడ వచ్చిపడతారోనన్న భయమూ పోయిందీ; ఇక, భూత ప్రేతాల భయం ఉండనేఉండి. ఇన్ని రకాల భయాలకూ ఆస్పదమైన అంధకారాన్ని పారద్రోలి తమకు కాంతినీ, వెలుగునూ ప్రసాదించే ఉషస్సుకోసం ఆర్య గ్రామాలు ఎదురుచూడ్డంలో ఆశ్చర్యమేముంది? రాత్రిపూట ఏ ఆర్య వీరుడూ ఒంటరిగా తమ గ్రామ ప్రాకారాన్ని దాటి బయటికి పోవాలను కోడు.

కాష్ఠ ప్రాకారంతో వలయించుకొని ఉన్న పురుగ్రామంలో అన్ని చోట్లా మానవసంచలనం దృగ్గోచరమవుతూన్నది. కొంతమంది పశువుల దొడ్లను శుభ్రపరుస్తున్నారు. స్త్రీలు ఇంటి పనుల్లో నిమగ్నులయ్యారు. యువకులు వ్యాయామశాలల్లో గుమిగూడారు. ఆర్యులకు వ్యాయామంమీద ఆసక్తి మెండు. అక్కడ దుర్బలుడు మృత్యువుతో సమానంగా చూడబడతాడు. బలమయిన గళం. ఎగు భుజాలు, విశాల వక్షం దీర్ఘ ముష్టి శక్తివంతము లయిన హస్తాలూ - కల యువకులు ప్రత్యేక మయిన గౌరవదృష్టితో చూడబడతారు: సాధారణంగానే ఆర్యులు దీర్ఘకాయులు, గొప్ప శరీర పాటవం కలవారు. పణిజాతివారుగానీ, కిరాతకులుగానీ, ఆర్యులముందు పసిపిల్లల్లా గుంటారు. తమ సహజ శారీరకౌన్నత్యాన్ని ఇంకా అభివృద్ధి పరచుకోవడం వారి ఆశయం. కనుకనే ప్రతి యువకుడూ ఉదయాన్నే వ్యాయామశాలకు విధిగా వెళ్తుంటాడు. నీనా అనే వ్యత్యాసం లేకుండా ప్రతివారూ వ్యాయామం చేస్తారు. మల్లయుద్ధంలో పాల్గొంటారు. ఇందువల్ల శరీరం పుష్టివంత మవడమే కాకుండా, ద్వంద్వయుద్ధమూ బాగా అభ్యస్తమౌతుంది! ప్రౌఢులూ, యుద్ధమల్లులూ, యువకులకు వ్యాయామం లోని మెళకువల్ని నేర్పుతూ వుంటారు. పురు గ్రామంలో అనేకంగా వ్యాయామశాల లున్నాయి. పురుజనపు మహారాజు, పురుకుత్సుడు స్వయంగా గొప్ప మల్లుడు! అతడికి 25 లేక 26 సంవత్సరా లుంటాయి. వెన్నపూస లాంటి తెల్లని ముఖంలో అరుణఛాయలు, ఉషాలాలిత్యాన్ని స్ఫురణకు తెస్తుంటాయి. ప్రథమ దర్శనంలోనే అసాధారణ పురుషుడన్న భావనను కలిగిస్తుంది అతడి వర్చస్సు!

పురుకుత్సుడు నిజంగానే అసాధారణ పురుషుడు. అలవాటు ప్రకారం, ఉదయాన్నే కాలకృత్యాల్ని తీర్చుకొని, వ్యాయామ శాలలన్నిం

టినీ పర్యవేక్షణ చేస్తున్నాడు. మోకాళ్ళకు క్రిందవరకూ అధోవస్త్రాన్ని పైవంటికి కుడిచేయి బయటకు వుండేట్టుగా కట్టిన - చర్మకంచుకాన్ని ధరించాడు. ఆర్యులకు వున్ని కంచుకాల మీదకూడా మక్కువ ఎక్కువ. పురుకుత్సుడికి మాత్రం కుడిచేయి బయటకు వుండేట్టుగా కట్టిన ఎర్రని చర్మకంచుకాన్ని ధరించడం అలవాటు. సాధారణంగా, ఆర్యరాజులు తమ హోదాననుసరించి చర్మ ఉన్ని కంచుకాలను బంగారు పోగుల్తో అలంకరించుకుంటూ వుంటారు. కానీ పురుకుత్సుడికి నిరాడంబరత మీద ఆసక్తి మెండు. అతడితోపాటు వున్న ఇతర ఆర్య రాజకుమారులు కూడా అందంగా బలంగా. ఆకర్షణీయంగా వున్నారు. అయినా అందరి లోకీ పురుకుత్సుడే వద్దూ పొడుగూ కలిగి, ఆజానుబాహుడుగా కను పిస్తున్నాడు. ఇలాంటి ఆకర్షణీయుడైన, ప్రభావోత్పాదకుడైన రాజును చూసే ప్రజలు 'ఇంద్ర' శబ్దంతోభూషించి వుండవచ్చును. దేవతల్లో ఇంద్రుడి కేస్థానముందో, ఆర్యుల్లో పురుకుత్సుడికక్కడ సరీగా అదే స్థానం వుంది. ఇంకా చెప్పాలంటే, ఈ నరేంద్రుడి ముందు దేవేంద్రుడు ఎందుకూ పనికి రాడనవచ్చు. దేవేంద్రుడు బొజ్జకలవాడు. మానవులకు ఇంద్రుడయిన పురుకుత్సుడికి పొట్ట వెన్నుకు అంటుకొని వుంటుంది. నడుము ఎంత సన్నం ? వక్షం ఎంత విశాలం ? బుజాలు వృషభసంఘాల్ని స్మరణకు తెస్తూవుంటాయి.

పురుకుత్సుడు సౌమ్యంగా గంభీరంగా నడుస్తూవెళ్ళి ఒక్కొక్క వ్యాయామ శాలనూ పరీక్షిస్తున్నాడు. అతడి నడకలో యవ్వన సహజమైన చంచలత స్థానంలో, గాంభీర్యం సౌందర్యం పోటీపడుతున్నాయి .

ఒక వ్యాయామ శాలలోకి వెళ్ళాక పురుకుత్సుడు తన శరీరం మీది చర్మకంచుకాన్ని తీసేశాడు. అధోవస్త్ర స్థానంలో చిన్ని అంగవస్త్రాన్ని ధరించాడు. తోటియువకుల్తోపాటు తనూ వ్యాయామం చేశాడు. మల్లయుద్ధం గంటలతరబడి జరిగింది. పురుకుత్సుడి శరీరం చెమటతో తడిసిపోయింది. అయినా, అతడు అలిసిపోలేదు. విశ్రాంతి తీసుకోవాల్సిన అవసరం కలగ లేదు. పురు ప్రజలు తమ నాయకుడి శారీరకపాటవాన్ని చూసి మహోత్సాహు లయ్యారు.

వ్యాయామం సమాప్తమయ్యాక, కొన్ని క్షణాలు విశ్రాంతి తీసుకుని,

పురుకుత్సుడు విశాలమైన యజ్ఞశాలలోకి వెళ్ళాడు. అక్కడ అనేక మంది ఋత్విజులు* అగ్నిని స్తుతిస్తున్నారు. వారిలో, మీసాలూ, గడ్డాలూ తెల్లగా నెరసిపోయిన వృద్ధఋషులు కూడా చాలామంది వున్నారు. అగ్నిలో ఘృతాన్నిపోస్తున్నారు. మధ్యమధ్యాయవల్ని వేస్తున్నారు. పురుకుత్సుడు తనూ ఒక దర్భాసనంమీద కూర్చున్నాడు. అగ్నికి అభిముఖుడై : పెద్ద పెద్ద మట్టి పాత్రల్లోనూ, ధాగికలశాల్లోనూ సోమరసం నింపివుంది. ఆ పాత్రల్లోని సోమరసాన్ని కూడా కొంచెంగా అగ్నికి అర్పించారు. దేవతలకు సమర్పించకుండా ఏ పదార్థాన్నీ ఆర్యుడు భుజించడు. అలా కినడం మహాపాపంగా భావిస్తాడు. తరువాత ఇంద్రుణ్ణికూడా ఆవాహనం చేశారు. ఇంద్రుడి పరాక్రమానికి సంబంధించిన గీతాలను (సామవేదం) పాడారు. ఈ విధంగా ప్రాతః వందనం ముగిసింది. అనంతరం అక్కడున్న స్త్రీ - పురుషు లందరూ. యవపిండిని తిన్నారు. సోమపానం చేశారు. అది ప్రత్యేకరోజు కాదు గనుక సోమపానం 'అతి' కాలేదు. ఎవరి పనుల్లోకి వాళ్ళు వెళ్ళిపోయారు.

*       *       *

సంధ్యావందనం అయింది. ఆర్య యువకులూ, పెద్దలూ కూడా అత్యధికంగా సోమరసాన్ని సేవించారు. అందరి కండ్లూ, ఎర్రగా చింత నిప్పుల్లాగా వున్నాయి. సోమపానంలో 'అతి' పనికిరాదని పురుపురిలో అందరికీ తెల్సు. అయినా ఆర్యులు సోమపానానికి తలబడితే 'అతి' అతిసహజంగా జరుగుతుంది. పురుకుత్సుడూ సోమపానంలో ఎవరికీ తీసిపోడు. అయినా, మంచి మానసిక దృఢత్వం కలవాడు. సోమపానంలో వళ్ళు మరచిన స్థితి ఇంతవరకూ సంభవించలేదు.

అర్ధరాత్రి గడిచిపోయింది. పురుకుత్సుడు తన ఏడుగురు మంత్రుల తోటి ఏదో గంభీరమైన విషయాన్ని చర్చిస్తున్నాడు.

---

* ఋత్విజులు=యజ్ఞకర్తలు చేసే యజ్ఞాన్ననుసరించి ఋత్విజుల సంఖ్య మారుతూంటుంది. సాధారణంగా పదముగ్గురు ఋత్విజులు వుంటారు ప్రతి యజ్ఞానికీను : వారిలో ముఖ్యులు నలుగురు.

1 హోతృ. 2 ఉద్గాతృ. 3 అధ్వర్యు. 4 బ్రహ్మన్.

వాళ్ళలో ఒక మంత్రి కిరాతకులు ఇక్కడికి యోజనం దూరంలో వున్నారు. వాళ్ళదగ్గిర వేలసంఖ్యలో పశువులున్నాయి. మృదువైన, శ్రేష్ఠమైన ఉన్నినిచ్చే బలిష్ఠమైన వాళ్ళగొర్రెల్తో, ఏడుఅడవులు నిండివున్నాయి!" అన్నాడు.

"కాని కిరాతకులు పర్వతాల మీదనుంచి క్రిందికి దిగివచ్చే తరుణం ఇంకా రాలేదుగా ?" అన్నాడు పురుకుత్సుడు.

"తరుణం రాకపోయినా, శరదృతువు ప్రారంభమైంది. కొండలపైన హిమం ధారాపాతంగా కురుస్తున్నది. హిమవర్షానికి భయపడి కిరాతకులు పర్వతాగ్రాల్ని విడిచి పర్వత పాదభూములకు వచ్చేశారు ;" అన్నాడు మరో మంత్రి.

మూడవ మంత్రి అందుకున్నాడు "ఈ సంవత్సరం శరత్తు చాలా ముందే వచ్చేసింది. వర్షాలుకూడా చాలా అధికంగానూ కురిశాయి. ఎక్కువ రోజులూ కురిశాయి. క్రింది ప్రదేశాలలో వర్షాలు అధికంగాపడితే, కొండలపైన శరత్తు చాలా త్వరగా ప్రారంభమౌతుందని పెద్దలంటారు. అప్పుడే కొండలపైన మంచు పేరుకుంది. కనుక కిరాతకులు ఈ ఏడు చాలాముందే క్రిందికి దిగేశారు" అన్నాడు.

మొదటి మంత్రి మరికొన్ని వివరాల్నిచ్చాడు "కిరాతకులు యిప్పుడిప్పుడే క్రిందికి దిగడం పూర్తయింది. ఇంకా వారు తమ గృహాలనూ ప్రాకారాల్ని (గుడిసెలచుట్టూ వాసాలకోటి, చెక్కలకోటి నిర్మించుకున్న ఎత్తయిన ఇళ్లు) సువ్యవస్థితం చేసుకోలేదు. ఆక్రమణకు తగిన సమయం !" అన్నాడు.

"అయితే, కిరాతకులందరూ క్రిందికి వచ్చేసివుంటారేమో ? ఊ ! అయినా ఫరవాలేదు : వాళ్లు దేవద్వేషులు.... వాళ్ళ ఆవులూ, గొర్రెలూ మనకు కావాలి.... అంతే ! దేవద్వేషులవద్ద ధనం (పశువులు) ఉండరాదని ఇంద్రుడు ఏనాడోచెప్పాడు. ఇంద్రుడి ఆజ్ఞను పాలించడం మన కర్తవ్యం : ఈ కర్తవ్యాన్ని నిర్వహించాలని ఎన్నాళ్ళనించో అనుకొంటున్నా.... కానీ, నిర్వహించలేకపోయాం...." అన్నాడు పురుకుత్సుడు.

మూడవ మంత్రి తన అభిప్రాయాన్ని వెలిబుచ్చాడు, "ఇంతవరకూ

మనం పణిజాతితోటి, నిషాదుల్తోటి మాత్రమే యుద్ధం చేశాము. ఇప్పటి వరకూ పై రెండుజాతులే మనకు శత్రువులు. పర్వతాగ్రాలపై నివసించే ఈ కిరాతకులు, పణీ లేక నిషాదుల్లాంటివారు కాదు. వీళ్ళు అజాత శత్రువులు, యుద్ధ విద్యలో గొప్ప నేర్పరులు. వీళ్ళ శరీరాలు మనకంటె చిన్న వయినా యుద్ధంలో మాత్రం మనకు తీసిపోరు. మన పూర్వులు కూడా ఒకటి రెండు మార్లు కిరాతకుల జోలికి పోయారు. కానీ, వెంటనే "కిరాతకులు పణిజాతి ప్రజల్లా పిరికివారు గానీ, నిషాదుల్లా సాధన సంపత్తిలేని వన్యప్రజలు గానీ కాదని గ్రహించారు. అందువల్లే ఆర్యులు ఇంత వరకూ కిరాతకుల్తో యుద్ధాన్ని తలపెట్టలేదు!"

రెండవ మంత్రి కూడా తన అభిప్రాయాన్ని వెలిబుచ్చాడు. "పణిజాతి ప్రజల్ని, నిషాదుల్ని బానిసల్ని చేసుకుని మన ఇండ్లల్లో వుంచుకో గలిగాము. కానీ, ఇంతవరకూ కిరాతకు లెవర్నీ దాసుల్ని చేసుకోలేక పోయాము. జంతువుల్లో 'దుప్పి' కూడా ఇంతేను. ఈ 'దుప్పి' కూడా 'మృగ' జాతికి (మృగం లేడి) చెందిందే! దుప్పి మాంసం మృగం మాంసంకంటె రుచి గానూ వుంటుంది. అధికంగానూ వుంటుంది. పాలుకూడా చాలా ఎక్కువగా ఇస్తుంది. ఇలాటి జంతువును మచ్చిక చేసుకోగలిగితే, ఎంతో ఉపయోగంగా వుంటుంది. కానీ. ఇంతవరకూ దుప్పిని మచ్చికచేసుకున్న వాళ్ళెవరూ లేరు. దుప్పి పిల్లల్ని తెచ్చి, మచ్చిక చేసుకోవడానికి ప్రయత్నించి కూడా ఎంతో మంది విఫలులయ్యారు!"

"మనం కిరాతుకుల్ని బానిసలుగా చేసుకోలేక పోవచ్చును; కానీ, వారి పశువుల్ని లాక్కోవచ్చుగదా?" అన్నాడు పురుకుత్సుడు.

మొదటి మంత్రి "మరి మనకు వాళ్ళ గోచరభూములుకూడా కావాలి. మన పురజనం నిత్యం అభివృద్ధి చెందుతోంది. మన పశువుల సంఖ్య దిన దినం పెరుగుతోంది. మనకు ఇంకా గోచరభూములు కావాలి!" అన్నాడు.

పురుకుత్సుడు "ఇంద్రుడి మీద విశ్వాస ముంచండి; ఇంద్రుడు అజేయుడు! ఇంద్రుడి ఆజ్ఞను పాలించడం మన ప్రథమ కర్తవ్యం!"అన్నాడు.

అంతవరకూ ఈ సంభాషణలో కలవకుండా మౌనంగా ఉన్న ఆర్య పురోహితుడు పెదిమ కదిపాడు. పురుకుత్సుణ్ణి సమర్థించాడు. అతడి

మీసాలూ గడ్డమూ నెరిసి తెల్లగా దీప్తివంతంగా ఉన్నాయి. ఇలా అన్నాడు: "పురుకుత్సుడు సత్యాన్నే పలికాడు. ఇంద్రుడెన్నోసార్లు 'ఈ సువిశాల భూమిని ఆర్యుల కిచ్చానని' చెప్పాడు. కనుకనే అతడు ప్రతి సంగ్రామం లోనూ మనకు బాసటగా నిలుస్తున్నాడు. పైగా ఇంద్రుడు యెన్నోమార్లు 'పురుజన ఇంద్ర - శత్రువుల్నుండి ఈ పృధ్విని విముక్తం చేయకపోతే. నా సహాయ సంపత్తులు వారికి అలభ్యమవుతాయి!" అని హెచ్చరించాడు కూడాను!"

ఇక నప్పుడు ఆలోచనకుగానీ, ఆలస్యానికిగానీ, వ్యవధి అనవసరం. ఇంద్రుడు "అసురుల (వీరే కిరాతకులనీ, దాసులనీ, దస్యులనికూడా పిలువ బడతారు) సప్తపురాలనూ విధ్వంసం చేస్తా" నని ఇదివరకే మాట ఇచ్చాడు.

ప్రకృతి అంధకారంలో మునిగి వుంది. ఉషాగమనం చాలా సేపటికి గానీ జరగదు. ఉన్నట్లుండి పురు గ్రామంలో నగారా పెద్దపెట్టున మ్రోగింది. క్షణంలో అందరూ మేల్కొన్నారు. యువకులూ ప్రౌఢులూ బలిష్ఠము లైన అరుణాశ్వాల నధిరోహించారు. అందరికంటె ముందు పురుకుత్సుడు తన రోహితాశ్వాన్ని (ఎర్రని గుర్రం) ఎక్కాడు అతడి తలకు రాగి శిర స్త్రాణం ఉంది. బంగారు పోగుల్తో అలంకరించిన చర్మకంచుకాన్ని ధరిం చాడు. ఎడమభుజాన ధనుస్సు వ్రేలాడుతోంది. వీపున తూణీరం, చర్మం (రెండు బారల పొడుపు, ఒక బారెడు వెడల్పూ గల చర్మపు డాలు) వ్రేలాడు తున్నాయి. పురుకుత్సుడు తన కోరమీసాలను దువ్వుకుంటూ, మేఘగంభీర స్వరంతో "వీరవరులారా! ఉషాగమనానికి ముందే మనం అసురపురిని చేరాలి. దాసపురిలోనే ఉషాస్తుతి జరగాలి; త్వరపడండి!" అన్నాడు.

పురు సైన్యమంతా ఉత్తరాభి ముఖంగా పయనమైంది. మొత్తం ఐదువందలమంది వుంటారు. అందరూ దృఢశరీరులైన యోధులు. వాళ్ళ గుర్రాలు కూడా చేయి ఎత్తితే అందనంత ఎత్తుగా, బాగా పొడవూ బలమూ కలిగి వున్నాయి. అన్నీ రోహితాశ్వాలే. ఆర్యుల శరీరా ల్నలంక రించిన చర్మవసనాలూ ఎర్రనివే. గాఢమైన అంధకారం. గుర్రాల కాలిగిట్టల శబ్దం తప్ప మరేమీ వినిపించని ఘోరమైన నిస్తబ్ధత! ఆర్య సైనికుల ఆకృతులు అంధకారంలో కలిసిపోయాయి. సైన్యం అరణ్యానికి కొద్ది దూరంగా, దృషద్వతీ తీరా న్ననుసరించి వెళుతోంది. దృషద్వతి తీరాన రాళ్ల

అధికం. సవ్వడి కాకుండా వెళ్ళడం ముఖ్యం. ఇంద్రుడి మీద ఘనమైన విశ్వాసం హృదయాల్లో తొణుకుతోంది. ఆత్మ విశ్వాసమూ సమృద్ధిగా వుంది. అయినా కిరాతుకులు అసాధారణులు, అపరాజేయులు : దాసపురికి చేరువకు వెళ్తున్న కొద్దీ మరీ జాగ్రత్తగా నిశ్శబ్దంగా వెళ్ళాలి.

కిరాతపురి దట్టమైన అడవిలో. పర్వతపాద భూమిలో వుంది. ఏ మాత్రమూ సవ్వడి కాకుండా వెళ్ళి, కిరాతుకుల పశులదొడ్ల మీద పడాలని ఆర్యుల సంకల్పం. సైనికులు కిరాతపురికి చుట్టూ వున్న చెక్క ప్రాకారం దగ్గరకు వెళ్ళే సరికి తూర్పున ఉషఃకాంతులు ప్రస్ఫుటించాయి. ఆర్య సైనికులు క్షణంలో, నిశ్శబ్దంగా, కిరాతకుల గోశాలల్లో జొరబడేవారే కానీ, కిరాతకుల కుక్కలు అరచి గలభాచేసి. మొత్తం పురిని మేల్కొలిపాయి, కిరాతకు లందరూ మేల్కొన్నారు. నగారాలు, కొమ్ములూ - కర్ణపుటాల్ని భేదించుకుంటూ దిగంతాల్లో మారుమ్రోగాయి. కొద్ది క్షణాల్లోనే కిరాతకులు తమ కుక్కల్తోసహా గోశాలల్ని సమీపించారు. ఉభయపక్షాలూ, చాలా దగ్గరగా వుండడంవల్ల బాణాల్ని ఉపయోగించలేక పోయారు. కరవాలాల్ని అంతగా వుపయోగించలేదు. బల్లెల్తో యుద్ధం ప్రారంభమైంది. ఇంతలో కిరాత స్త్రీలుకూడా వచ్చి చేరారు. కేకలూ బొబ్బలూ పెడుతూ రాళ్ళ వర్షం కురిపించ సాగారు. కొద్ది క్షణాల అనంతరం తూర్పు దిశన సూర్యోదయమైంది. ఎర్రని సూర్యబింబం నిప్పులు క్రక్కుతూ మానవ సంహారాన్ని తిలకిస్తోంది. యుద్ధం మహా ప్రచండంగా సాగుతోంది. అసుర వీరులు ప్రాణాలకు తెగించి పోరాడుతున్నారు. ఒకమాటయితే పురవీరులు ఆశల్నికూడా వదులు కున్నారు. కానీ, వారి చేతుల్లోని పొడుగాటి బల్లేలు, వారిని యుద్ధక్షేత్రంలో నిలబెట్టాయి. కిరాతకుల బలం తగ్గసాగింది. వివశులై వెనక్కి తగ్గారు. ఆర్య వీరులు కొంతమంది గుర్రాల్ని దిగి చెక్క ప్రాకారంలోని కొంతభాగాన్ని పడనెట్టారు. మిగిలిన ఆశ్విక వీరులందరూ ప్రాకారంలోకి దూసుకు పోయారు. కిరాతకులు దిగ్భ్రాంతిచెంది స్తబ్ధులై నిలబడిపోయా రొకక్షణం. వారిలోని 'అజేయుల' మన్న విశ్వాసం ఇంకా పనిచేస్తూనే వుంది. వేల సంవత్సరాలుగా వారు శరదృతువును గడపడానికి, తమ పశుపక్ష్యాదుల్తో అక్కడికి వస్తూన్నారు. పర్వతాల్ని విడిచి క్రిందికి రావడం వారికి ఇష్టముండదు. అయినప్పటికీ

వారు శరదృతువులో పర్వతాల్ని దిగి క్రిందికి రాక తప్పదు. చలికాలంలో పర్వతాలపైన మంచు దట్టంగా కురుస్తుంది. ఆ మంచులో, ఎముకల్ని కొరికే చలిలో, మానవులేకాక పశువులుకూడా అక్కడ వుండడం సంభవం కాదు. పైగా పశువులకు మేతకూడా దొరకదు! అలాటి సమయాల్లో కిరాతకులు బృహత్పర్వతపు పాదపద్మాల్లో చిన్న చిన్న పురాలను నిర్మించుకునేవారు. అనాదినుండి వారు తమ చలికాలపు తాత్కాలిక నివాసాల్ని (పురాల్ని) బృహత్పర్వత చరణసాన్నిధ్యంలోనే నిర్మించుకుంటూన్నారు. అది వారి జన్మహక్కు! ఇంతకు క్రితంకూడా ఒకటి రెండుసార్లు ఆర్యులు కిరాతకుల తాత్కాలిక నివాసాలమీదకు వచ్చిపడ్డారు. కానీ, కిరాతకులు ఆర్యుల్ని తరిమికొట్టారు. శతాబ్దాలక్రితంనుండి కిరాతకుల్లో పై విషయం ప్రచారంలోవుంది. "పీతకేశుల్ని (పసుపురంగు తలవెంట్రుకలు కలవారు) ఆర్యులు - తిరిగిచూడకుండా కొట్టాము. ఇక ఎన్నటికీ మనవైపు కన్నెత్తయినా చూడడానికి వారికి ధైర్యముచాలదు" ఈ భావన కిరాతకుల హృదయాల్లో సదా మెదలుతూ వుంటుంది.

పై భావన బలంగా హృదయాల్లో నాటుకుని వుండడంవల్లనేగావును, ప్రాకారం ధ్వంసమయినా, కిరాతకులు ధైర్యాన్ని కోల్పోకుండా, నిలబడి యుద్ధంచేస్తూనే వున్నారు!

ప్రాంగణమంతా యుద్ధ వీరుల్తోనిండివుంది. ఉభయపక్షాలకూ అపారమైన నష్టం వాటిల్లింది. ఆర్యుల గుర్రాలు ఎన్నో కూలిపోయాయి. కితరాకుల్లోనూ అనేకులు నేలకొరిగారు. దీంతో ఇరుపక్షాలవారికీ క్రోధం హెచ్చింది. రెండుదళాలూ ఒకదానిలోకి ఒకటి జొచ్చుకుపోయాయి. తెగబడి నరుక్కోసాగారు. ఇకనిప్పుడు బల్లెంతో యుద్ధం చేయడానికికూడా వీలులేని స్థితి ఏర్పడ్డది. ఆర్యులు తమ ఖడ్గాలను, చర్మాలను (డాలు) తీసుకుని గుర్రాలమీదనుండి క్రిందకు దూకారు. కిరాతకులు ఖడ్గాలతోనూ, రాతి గదలతోనూ యుద్ధంచేస్తున్నారు. కిరాత స్త్రీలుకూడా, అతి నేర్పుగా, వేగంగా రాళ్లు విసురుతున్నారు. కానీ, ఆర్యులందరూ శిరస్త్రాణాలను ధరించివుండడం వలన ఎవరికీ అంతగా దెబ్బలు తగలడంలేదు. రాళ్లు వాళ్ళ శరీరాలకు తగిలినా, ఆ దెబ్బల్ని ఆర్యసైనికులు ఏమాత్రం లెఖ్ఖచేయడం లేదు. ఆ క్షణాన పురుకుత్సుడి యుద్ధనైపుణ్యం చూచితీరవలసిందే! కిరాతకులు

ప్రబలంగా వున్న ప్రతిచోటికీ, తత్కాలంలోవెళ్ళి తన తీవ్ర ఖడ్గఘాతాలతో కిరాతకుల్ని నేల కూలుస్తున్నాడు. మెరుపుతీగెలా ఈ క్షణాన యిక్కడా, మరుక్షణాన వేరొకచోటా కనుపిస్తున్నాడు. "సాక్షాత్తూ మృత్యువే పురుకుత్సుడి రూపంలో కిరాతకుల ఎదుట ప్రత్యక్షం అయిందా" అనిపిస్తోంది. ఇలాటి ఆర్య వీరుణ్ణిచూసే ఇంద్రుణ్ణి కల్పించుకొని వుంటారు! కిరాతకులు సంఖ్యలో అత్యధికంగావున్నారు. ఒకడు నేలకొరిగితే, అతడి స్థానంలోకి పదిమందివచ్చి నిలబడుతున్నారు. ఎంతకూ పోరు ముగియడం లేదు. ఇదివరకూ ఆర్యులెన్నడూ ఇంత తీవ్రంగా యుద్ధం చేయలేదు. సమయం గడుస్తున్నకొలదీ ఆర్య సైనికుల్లో నిరాశ, నిస్పృహలు వ్యాపిస్తున్నాయి. ఆర్య సైనికులుకూడా అత్యధికంగా క్షతగాత్రు లయ్యారు. ఇంద్రుడు తమని మరచి, మరేదోపనిలో నిమగ్నుడై యుంటాడని ఆర్యులు భావించసాగారు!

ప్రాంగణం రక్తసిక్తమైంది. దీర్ఘకాయులూ, గౌరవర్ణులూ అయిన ఆర్యులూ, పీతాంగులు (పసుపుపచ్చని అంగములు కలవారు), అల్పకాయులూ అయిన కిరాతకులూ, రాగి ఖడ్గాలతోటి, రాతి గద (వజ్రం) లతోటి ఘోరంగా పోరు సలుపుతున్నారు. ఒక ప్రక్కన క్షతగాత్రులయిన ఆర్య, కిరాతవీరులు – ఎక్కుతూ, తుదిశ్వాసల్ని పీలుస్తూ, ఆర్య అనార్య రక్తప్రవాహల్ని సమ్మిశ్రితం చేస్తున్నారు.

పురుకుత్సుడు తన పొడవైన ఖడ్గాన్ని అత్యంత సాహసంతో ప్రయోగిస్తున్నాడు. అయితే, కిరాత నాయకుడుకూడా పురుకుత్సుడికి ఏ మాత్రమూ తీసిపోడు. అతడూ, అతి ప్రశంసాపాత్రంగా యుద్ధం చేస్తున్నాడు. కిరాత నాయకుడు బాగా పొట్టివాడు. పురుకుత్సుడికి భుజాలవరకూ వస్తాడు. అయితే అతడి శరీరం మాత్రం మహా బలిష్టంగా వుంది. విశాలమైన వక్షస్థలం, బలిష్ఠములైన భుజదండాలు, సన్నని నడుమూ కలిగి సింహసదృశుడై ఆర్యసైనికులను స్వర్లోకానికి పంపుతున్నాడు!

కిరాత నాయకుడు ప్రాణంతో వున్నవరకూ వాళ్ళను జయించడం అసంభవమని పురుకుత్సుడు తెలుసుకున్నాడు. అతణ్ణి సంహరించడంగానీ లేక ఓడించడంగానీ అంత తేలికైనపని కాదు. తనకు తగిలే దెబ్బల్నుండి

అతి చాకచక్యంతో తప్పించుకుంటూ, పురుకుత్సుడిమీదకు తన ఆయుధాన్ని అత్యంత లాఘవంతో ప్రయోగిస్తున్నాడు. అతడు చూస్తూ వుండగానే కిరాత నాయకుడు పురుకుత్సుడి దగ్గిరకువచ్చి, అతని తొడలకు తగిలేట్టు ఖడ్గాన్ని విసిరాడు. పురుకుత్సుడికి బలమైన దెబ్బ తగిలింది. తూలి పోయాడు. క్రింద పడబోతూన్న పురుకుత్సుడు తన సమస్త చైతన్యాన్నీ, శక్తినీ కూడకట్టుకుని చేతిలోనిఖడ్గాన్ని పూర్తిగాచాపి, కిరాతనాయకుడి తలకు గురిచూసి ఒక్కవ్రేటు వేశాడు; ఆ దెబ్బతో కిరాతనాయకుడి తల తెగి ఎగిరి అవతల పడ్డది! మొండెం మాత్రం కొద్ది క్షణాలు కొట్టుకున్నది. కిరాతనాయకుడు నేల కొరిగా డనగానే, మిగిలిన కిరాతకు లందరూ యుద్ధ క్షేత్రాన్ని విడిచి కొండమీదకు పరుగెత్తారు. కొంతదూరం వరకూ ఆర్యులు కిరాతకుల్ని తరిమికొట్టారు. కానీ, కిరాతకుల్లాగ పర్వతాల్ని యెక్కడం ఆర్యులకు చేతకాదు; కొద్ది దూరం వెంబడిన తరువాత వెనక్కి తిరిగి వచ్చారు ఆర్యులు. పైనుండే కిరాతకులు ఆర్యులమీద రాళ్ళనూ, బాణా లనూ విసిరారు కొంతసేపు. అదే సమయంలో జఘన్యమైన ఈ మానవ హత్యను చూడలేకనో ఏమో సూర్యభగవానుడు తల్లిగర్భంలో తల దాచు కున్నాడు.

ఆర్య సైనికులు కిరాతపురికి తిరిగివచ్చారు. పురుకుత్సుడు వళ్లు తెలియని స్థితిలో నేలమీద పడివున్నాడు. అతడిచుట్టూ కొంతమంది ఆరు లు కూర్చునివున్నారు. తొడకు తగిలిన దెబ్బ చాలా బలమైంది. కట్టు కట్టినా, రక్తం ఆగడంలేదు. ఆర్యులు కిరాతపురాన్ని జయించారు. కానీ, గొప్పగా నష్టపోయారు కూడాను! మొదట పురుకుత్సుడు బ్రతుకుతాడన్న నమ్మకమే ఎవ్వరికీ లేదు. కాని, కొన్నిఘడియలు గడిచాక మెల్లగా కనులు తెరచాడు పురుకుత్సుడు. నీరు కావాలని సంజ్ఞ చేశాడు. త్రాగడానికి నీరు ఇచ్చారు. దాహమార్పుకున్న తరువాత పూర్తిగా స్పృహలోకి వచ్చాడు. ఆర్యు లందరూ ఏకకంఠంతో ఇంద్రుణ్ణి స్తుతించారు. స్పృహలోకి వచ్చిన పురు కుత్సుడికి తమ విజయాన్ని తెలియపరచారు. "కిరాతకుల్ని పూర్తిగా జయిం చేశాము. యుద్ధంలో గాయపడిన కిరాతుకు లందర్నీ వధించాము. చేతికందిన ఎవణ్ణీ ప్రాణంతో విడువలేదు. మా చేతుల్లో పడకుండా తప్పించుకున్న కొంత మంది మాత్రం కొండలమీదికి పారిపోయారు! ఇక నిప్పుడు, వాళ్ళ

అవులూ, గొర్రెలూ, మేకలూ అన్నీ మన పరమయాయి. ఇదంతా ఆ యింద్రుడి మహిమ!"

*        *        *

కిరాతకులు పారిపోగానే పురుగ్రామానికీ విజయవార్త పంపించారు. ప్రొద్దు క్రుంకే సరికి అక్కడినుండి వందలకొలది స్త్రీ. పురుషులు అశ్వారూఢులై, కిరాతపురికి వచ్చిపడ్డారు. పురుకుత్సుడు ఒకమాటు స్పృహలోకి వచ్చాడు. కానీ. వెంటనే మళ్ళీ స్పృహ తప్పింది. పురుకుత్సుడి భార్య భర్త తలను ఒడిలోపెట్టుకు కూర్చుని వుంది. దుఃఖం కట్టలు తెంపుకు వచ్చేస్తోందామెకు. కానీ, ఎంతో కష్టంమీద శోకాన్నాపుకొంటోంది. కండ్లు మాత్రం ధారాపాతంగా, కన్నీటిని వర్షిస్తున్నాయి. ఆమె కన్నీటితో పురుకుత్సుడి వదనం ప్రక్షాళితమౌతూన్నది. వృద్ధులు ఓదారుస్తూ, ధైర్య వచనాల్ని చెబుతున్నారు. "వీరపత్నీ! దుఃఖించకు! ఇంద్రుడు తన భక్తులకు సదా రక్షకుడై వుంటాడు! ఇంద్రుడి కటాక్షంవల్లనే మనకీ విజయం లభించింది. "నా భక్తులు దాసపురాల్ని ఏడింటినీ విధ్వంసం చేస్తార"ని ఏనాడో భవిష్యత్తును సూచించాడు ఇంద్రుడు. ఇది ప్రథమపురమే! ఇంకా ఆరు పురాలను ధ్వంసం చేయాల్సివుంది!"

పురుకుత్సుడి భార్య (తుర్వశస్త్రీ) చాలా గంభీరమైన ప్రకృతికలది. మహా వీరుడైన భర్తకుతగినట్టుగానే గొప్ప మనోదారుఢ్యతకల మహిళ. గులాబీరంగు శరీరం. బంగారురంగు కండ్లు, నిండుముఖం, పసుపుపచ్చని తలవెంట్రుకలు – గొప్ప అందగత్తె! మొత్తం ఆర్యగణాల్లోనే ఆమె సౌందర్య దేవతగా ప్రసిద్ధిగాంచింది. ఆ రోజుల్లో తుర్వసులకూ, పురుగణానికీ అంతగా మిత్రత్వం లేదు. అయినా ఈమె పురుకుత్సుణ్ణి వరించింది. ఆర్య వీరుడి కర్తవ్యం ఏమిటో. వీరపత్ని కర్తవ్యం ఏమిటో ఆమెకు బాగా తెలుసును. ఆర్యవీరుని కర్తవ్యం, శత్రువుతో పోరాడడం, శత్రువును హతమార్చడం, లేదా. తాను స్వయంగా మృత్యువు నాలింగనం చేసుకోవడం. వీరపత్ని కర్తవ్యం, భర్తను ఉత్సాహితుణ్ణిచేస్తూ యుద్ధానికి ప్రోత్సహించడం! పితరులు స్వర్గలోకంలో నుండి. రణరంగంలో తమ సంతానంచూపే పరాక్రమాన్ని ఉత్సుకతతో చూస్తుంటారని కూడా ఆమెకు

తెల్సును. ఆర్యవీరులకు, యుద్ధంలో విజయాన్నిపొంది, శత్రువుయొక్క పశుధనాన్ని – గోవుల్ని గుర్రాల్ని, గొర్రెల్ని, మేకల్ని – స్వాధీనపరచు కోవడమో. లేక చచ్చి స్వర్గంలోని తమ పితరుల్ని చేరడమో ! రెండే రెండు మార్గాలు.

ఇంత తెల్సివుండీ, ధీరమనస్కురాలయి వుండికూడా పురుకుత్సుని భార్య లోలోన కుమిలిపోతూన్నది. ఆమె హృదయం పగిలిపోతూన్నది. ఇద్దరూ అపూర్వంగా ప్రేమించుకున్నారు. వారిద్దరికీ శరీరాలే వేరుగాని హృదయం ఒకటే : భర్తయొక్క ఆ మర్మరస్థితిని ఆమె చూడలేకుండా వుంది.

అర్ధరాత్రి అనంతరం చలి మిక్కుటమైంది. ఆర్యులందరూ చర్మ వసనాలను శరీరంఅంతటికీ కప్పేసుకున్నారు. పురుకుత్సుని భార్యకు చలిని గురించిన ధ్యాసేలేదు! ఆమెయొక్క సర్వేంద్రియాలు భర్తమీదే కేంద్రీకృత మయ్యాయి. కొవ్వొత్తిదీపపు మలినకాంతిలో పురుకుత్సుని వెల్లకిలా పడుకొన బెట్టారు. భార్యతదేకంగా భర్తవదనంలోకి చూస్తోంది. పురుకుత్సుడు ఒకే క్రమంలో శ్వాసనుపీలుస్తున్నాడు, వదులుతున్నాడు! విశాలమైనవక్షం, సముద్రపు ఆటూపోటులా క్రమబద్ధంగా లేస్తున్నది, పడుతోంది ! కొన్నిఘడియలక్రితమే రక్తం కారడం కట్టింది. పురుకుత్సుడు కండ్లు తెరిచాడు. అతడి ముఖం మీదకు వంగిన భార్యా కండ్లనుండి రెండు కన్నీటి బిందువులు రాలాయి. భార్య కండ్లలో కదులాసాగుచుండే ప్రత్యక్షమయ్యా దతడికి. అలసిన అతని కండ్లకు దృశ్యం స్పష్టంగా కనిపించడంలేదు. అయినా, భార్యకండ్లలోని సంచలత. సంక్షుభిత మహాసాగరాన్ని అతడూ ఊహించ గలిగాడు : కుడిచేతిని పైకెత్తి భార్యయొక్క మృదు కపోలాలను నెమ్మదిగా స్పృశించాడు. అంతవరకూ ప్రయత్న పూర్వకంగా ఆపుకున్న దుఃఖం, పొంగి పొర్లింది. 'ప్రియా' అంటూ భర్త హృదయం మీదకు వాలిపోయింది భార్య. కొద్ది క్షణాల వరకూ ఇద్దరూ మహదా నందదాయకమైన ఆ అపూర్వ స్పర్శసుఖంలో మైమరచారు. ఇంతలో పురుకుత్సుడి కుడికాలు కొంచెం కదిలింది. 'అబ్బ' అని చీత్కరించాడు. అప్పటివరకూ తనకు తగిలిన దెబ్బవిషయం తెలియదు అతడికి ! చీత్కరిం చాడెగానీ, తనకు తగిలిన దెబ్బలతాలూకు బాధకు విలవిల్లాడడం ఆర్య

వీరుడికి శోభస్కరంకాదని ఆతడికీ తెలుసును ; క్షణంలో గంభీరముద్రను వహించి "నా తొడకు బలమైన దెబ్బతగిలినట్టుగా వుంది ?" అన్నాడు. తరువాత కిరాత వీరుల్నిగురించి తన అభిప్రాయాన్ని వెలిబుచ్చాడు. "శౌర్య పరాక్రమాల్లో కిరాతకులు మనకు ఏవిధంగానూ తీసిపోరు. ఆ కిరాత నాయకుడు నిజంగా అద్వితీయ పరాక్రమవంతుడు !" అనంతరం అతడి శవాన్ని గురించి ప్రశ్నించాడు.

భార్య ఇలా చెప్పింది : "మనవాళ్ళ శవాలన్నింటినీ తగలేస్తున్నారు, ఆర్య శవాలన్నీ అయిపోయాయి. ఇప్పుడిక కిరాతకుల శవాలను తగలేస్తున్నారు !"

కిరాత పురి ఆర్యుల దయినది. ఆ పురిచుట్టూ అత్యధికంగా శవాలుండడంవలన, ఒకటి రెండు రోజుల్లో దుర్గంధం పురినంతటినీ వ్యాపిస్తుంది. స్వాస్థ్యభంగానికి కారణమౌతుంది. ఈ శవాలకు సద్గతిని కలిగించడానికి, అడవిలో తోడేళ్ళూ నక్కలూ ఎటూ వున్నాయి. కానీ, అసంఖ్యాకంగా వున్న శవాలనన్నింటినీ, ఒకటి రెండు రోజుల్లో ఖాళీచేయడం వాటివల్లనూ కాదు. అలాంటప్పుడు శవాలను కాల్చేసేయడమే సులువైన పద్ధతి. తనకు ప్రతికక్షి అయిన కిరాత నాయకుడి శవానికి ప్రత్యేకమైన గౌరవ మర్యాదలతో తుది సంస్కారం జరపాలని అనుకున్నాడు పురుకుత్సుడు. కానీ. అప్పటికే అతడి శవాన్ని తగుల బెట్టేశారు.

ఈ విజయాన్ని పురస్కరించుకుని, వృద్ధఋషి పులకాంకితుడై ఇంద్రుణ్ణి స్తుతించాడు. అగ్నిదేవుడికి ఘృతాన్ని ఆహుతిచ్చారు. ఇంద్రుడికి కిరాతకులనుండి సంపాదించిన వృషభాలను (ఆబోతులను) ముప్పైఐదింటిని నరికి వాటి మాంసంతో ఉడికించిన సోమరస కలశాలను సిద్ధపరిచారు. ఆ రాత్రి అందరూ యజ్ఞశేషాన్ని తిన్నారుకాని, ఎవరూ అంతగా వుత్సాహాన్ని కనబరచలేదు. తమ కానాడు లభించిన విజయంకంటే, తమ నాయకుడు పురుకుత్సుడు ఎంతో విలువైన వాడని ఆర్యులకు తెలుసును. ఆర్యులందరూ ఏక కంఠంతో ఇంద్రుడితో ఇలా మొరపెట్టుకుంటున్నారు : "ఓ ఇంద్రభగవానుడా ! పురుకుత్సుడు లేని ఈ విజయం నిరర్థకం ?"

ఇంద్రుడు వృద్ధ ఋషి ద్వారా తన అభిప్రాయాన్నిలా వెల్లడించాడు :

"ఇంద్రుడి మీద విశ్వాసం వుంచండి. అతడి ఆజ్ఞను పాలించండి : పురుకుత్సుడు నాకు అత్యంత ప్రియతముడు ."

ఆ రాత్రే పురుకుత్సుడు కోలుకున్నాడు. మర్నాడు సూర్యోదయానికి పూర్వం ఆర్యులు మహోత్సాహంతో ఉషాస్తుతిని గావించారు. పురుకుత్సుని భార్య ప్రత్యేక హోమాన్ని ఏర్పరచింది.

*          *          *

ఇంద్రుడి మాట నిజమయింది. పురుకుత్సుడు కిరాతుల సప్తపురాలనూ విధ్వంసంచేశాడు. ఆర్యులకు అపార పశుధనం లభించింది. కిరాతకులకు పశువులే ధనం : పశుపాలన, వేట – ఇవి రెండే కిరాతకుల ముఖ్యవృత్తులు. అరణ్యాల్లో దొరికే పండ్లను ప్రోగుచేసి, ఎండబెట్టి నిలవబెట్టుకుంటారు. అయినా, వారికి ఎండుపండ్లు సంవత్సరానికి చాలవు. కిరాతకుల్లో వ్యవసాయం అసలు ప్రచారంలో లేదనేచెప్పాలి. పర్వతాల క్రింది వారిని చూసి అక్కడక్కడా వరిని నాటినా, దాన్ని మనుష్యుల ఆహారానికికాదు, పశువుల మేతకు వుపయోగించుకునేవారు.

కిరాతకులు తమ పురాలను సులభంగా వదిలివేయలేదు. తమ సమస్త శక్తి యుక్తులుపయోగించి ప్రతిఘటించారు. కానీ, ప్రథమ పురిని కోల్పోవడంతో వారి ఆత్మాభిమానానికి, రణోత్సాహానికి ఎదురులేని దెబ్బతగిలింది. పూర్తి నిరుత్సాహులయ్యారు. ప్రథమపురి విజయానంతరం, పురుకుత్సుడు తిరిగి మామూలు మనిషికావడానికి నెలరోజులు పట్టింది. ఇక నా శరదృతువును ఎలాటి సంఘర్షణయూలేకుండా గడుపుదామని పురుజనంలోని ఆర్యులు భావించారు. కానీ, పురుకుత్సుడలా వప్పుకోలేదు. ఆ శరదృతువులోనే ఇంద్రుడి సంకల్పాన్ని నెరవేర్చాలని పట్టుపట్టాడు. దృషద్వతికి తూర్పున, మాకండా, సరస్వతి, యమునా – నదుల సమీపాన కిరాతకులవి మూడు శరత్ నివాసాలు (పురాలు) వున్నాయి. దృషద్వతికి పశ్చిమాన సతలజ్ సమీపాన కూడా మూడు శరత్పురాలున్నాయి. పురాలంటే కాష్ఠప్రాకారంతో వలయించుకుని వున్న చిన్ని చిన్ని గుడిశయూ, పశువుల దొడ్లేను : ఆ పురాలను జయించడంవలన ఆర్యులకు పశుధనం సమృద్ధిగా లభిస్తుంది, ఆర్యులకూ గొర్రెలున్నాయి. కానీ, కిరాతకుల గొర్రెనుండి లభించే వున్ని అతి మృదు

వుగా వుంటుంది. ఆ ఉన్నినుంచి తయారయ్యే వస్త్రాలు అత్యంత కోమలంగా సుందరంగా వుంటాయి.

సతలజ్ నదినుంచి యమునానది వరకూ వ్యాపించివున్న, విస్తృతమైన పర్వతపాదభూమంతా కిరాతకులది. వాళ్ళనుండి దాన్ని పురుగణం గెల్చుకున్నది. కేవలం చలికాలాన్ని గడపడానికి మాత్రమే కిరాతకులు పర్వతాగ్రాల్ని వదలి ఇక్కడికి వచ్చేవారు. ఈ యుద్ధంలో కిరాతకులు వేలసంఖ్యలో నశించారు. అపారంగా పశుధనాన్ని కోల్పోయారు. తమ గోభూము లెన్నింటినో వదులుకున్నారు. ఇప్పుడు పురుగణం ఈ తాత్కాలిక గ్రామాల్ని పర్వతపాదాలపరకూ నిర్మించుకుంటున్నది. దూరంగా, పర్వతాగ్రాలమీదనుండి చూస్తే, తాము విడిచివచ్చిన పర్వతపాద భూముల్లో ఆర్యుల పశువులు మేస్తూ కనిపించేవి. ఆర్యుల గుర్రాలనూ, ఆవులనూ తమ భూముల్లో మేస్తూండడాన్ని చూచిన క్షణాన, కిరాతకుల హృదయాల్లో అనివార్యమైన వేదన పెల్లుబికేది. ఒకటి రెండు సార్లు కిరాతకులుకూడా ఆర్యుల గోశాలలమీద దాడి చేయడానికి ప్రయత్నించారు. కానీ, ఫలించలేదు. ఆర్యులు తమ గ్రామాల బహిర్ ప్రాకారాన్ని బాగా కట్టుదిట్టం చేసుకున్నారు. పర్వతపాదాలు ఉభయులకూ సరిహద్దులయ్యాయి.

ఇక నప్పటినుండి పురుకుత్సుడు మొత్తం సప్తసింధులోనే మహావీరుడిగా ప్రసిద్ధి చెందాడు. సప్తసింధులోని ఆర్యు లెవరూ గతంలో యీ విధంగా తమకు ఉత్తరపు సరిహద్దుల్లో ఉన్న కిరాతకులతో తలపడి, ఘన విజయాన్ని సాధించలేదు. వాళ్ళ గ్రామాలమీద దాడి చెయ్యడానికి కూడా ఎవరికీ ధైర్యం చాలిందికాదు. కాకపోతే, అడవుల్లో మేస్తున్న కిరాతకుల ఆవులమీదపడి, దొంగచాటుగా వాటిని తోలుకుపోయేవారు. అదీ ఒకటిరెండు సార్లు మాత్రమే చేయగలిగారు. అలా దొంగచాటుగా తోలుకుపోవడం వీరత్వం కాదు; చోరత్వ మనిపించుకుంటుంది: అలాంటి చోరత్వం శోభస్కరం కాదని ఆర్యులకూ తెలుసు!

సప్తపురాలను విధ్వంసం చేయడానికి మూడేళ్లు పట్టింది. ప్రథమ విజయాన్ని పొందిన మరుసటి సంవత్సరం పురుకుత్సుడి భార్యకు పుత్రుడు కలిగాడు. తండ్రి దస్యులను (త్రస్త) ఓడించడంలో నిమగ్నుడై వుండగా

పుట్టాడుగనుక, అతడికి 'త్రసదస్యు' అని పేరుపెట్టారు. మొత్తం ఆర్య గణాల్లోకే (శాఖల్లోకే) పురజనం ప్రధానమైంది. పురజనానికి ముఖ్యుడు పురుకుత్సుడు. అతని ప్రథమ పుత్రుడు త్రసదస్యుడు. తండ్రికి తగిన కొడుకు అనిపించుకోగలడో, లేదో భవిష్యత్తు నిర్ణయించవలసిందే :

త్రసదస్యుడి పుట్టుక సందర్భంలో మొత్తం పురుగణం గొప్పగా ఉత్సవం చేసుకుంది. ప్రతికుటుంబం తమ ఇంట్లోనే ప్రథమ సంతానం ఉత్పన్నమైనట్లు పొంగిపోయింది. పురుకుత్సుడి భార్య ఇంద్రుడికి కృతజ్ఞతల్ని తెలుపుకుంది. పుత్రుణ్ణి చూసినప్పుడల్లా ఆమెకు తేజోవంతమయిన భర్త శరీరం జ్ఞప్తికి వచ్చేది. కొడుకునుచూస్తూ, "వీడూ తండ్రిలాగానే దస్యులకు త్రాసను - బాధను, ఓటమిని - కలిగించేవాడు కావాలి :" అని కోరుకునేది.



# 2. సరస్వతీ తీరం

"ఇయ మదాద్ దివోదాసం బధ్ర్యశ్వాయ సరస్వతి"

(ఈ సరస్వతి వధ్ర్యశ్వునకు దివోదాసు నిచ్చింది)

(క్రీ. పూ. 1217)

సప్తసింధులోని ప్రసిద్ధనది సరస్వతి. ఇదికాక, ఇంకా ఆరు నదులున్నాయి. సతలజ్, విపాశ (వ్యాస) పరుష్ణి, అసిక్నీ (చినాబ్) వితస్తా (జీలం), సింధు! ఈ ఆరు జీవనదులే! బృహత్పర్వతంమీది మంచు ఎండలకు కరిగి ఈ నదుల్లోకి ప్రవహిస్తూ వుంటుంది. కాని, సరస్వతి మాత్రం తన సహచర అన్యనదుల్లా జీవనది కాదు. వేసవికాలంలోనూ, చలికాలంలోనూ సరస్వతీ నదియొక్క ప్రవాహం అత్యంతంగా క్షీణిస్తుంది. ఒక్కోమాటు లుప్తమౌతుంది కూడాను! ఈ నది ఆర్యులకు శతాబ్దాల తరబడి తనతీరంలో ఆశ్రయాన్నిచ్చింది! కనుకనే ఆర్యులు, సప్తసింధులోని అన్యనదులకంటే సరస్వతీ నదికే ఎక్కువ కృతజ్ఞులైవుంటారు; సరస్వతికి తూర్పున యమునా నది వుంది. అదీ గొప్పనదే! కాని, ఆర్యులు యమునను తమ నది అని చెప్పుకొనలేదు. యమునా తీరమంతా అపరాజేయులైన దస్యుల (కిరాతకుల)ఆధీనంలో వుంది. సరస్వతి గనక ఖాద్యపాన్యాదుల్నిచ్చి

కాపాడక పోయినట్లయితే ఆర్యులు ఏనాడో దస్యులకు తలవంచి వుండే వారు! పరుష్ణినుండె పురుగణం (సమూహం) ప్రారంభమౌతుంది. కానీ, పురుగణం ఇప్పుడు అనేకశాఖలుగా విభక్తమైంది. సరస్వతీ తీరపు మధ్య ప్రాంతంలో 'కుషిక' శాఖ నివశిస్తోంది. పశ్చిమోత్తరంగా పరుష్ణి (రావీ) వరకూ 'భరత'శాఖ ఆధీనంలో వుంది. పరుష్ణితీర ప్రదేశంలో 'త్సుత్సు' అనే మరోశాఖ వుంది. శాంతి సమయాల్లో ఒకశాఖ ఆధీనంలోని భూముల్లోకి మరో ఆర్యశాఖవెళ్ళి తమ పశువుల్ని మేపుకోవడం కద్దు. యుద్ధసమయాల్లో మాత్రం ఒక గణం మరొక గణాన్ని తమ సరిహద్దుల్ని అతిక్రమించ నీయదు. అప్పుల్లో గృహయుద్ధాలు తరచు వస్తూంటాయి. రెండు ఆర్య గణాలకు యుద్ధం సంఘటిల్లినప్పుడు, మిగిలిన ఆర్యగణాలన్నీ కూడా వారికో వీరికో అనుయాయులై యుద్ధక్షేత్రంలోకి దిగుతాయి. దస్యుల్తో గనక సంఘర్షణ వచ్చిందా, ఆర్యగణాలన్నీ ఏకమై యుద్ధానికి సిద్ధమౌతాయి!

సరస్వతీ తీరప్రదేశం - దీన్నే సారస్వత దేశమనికూడా అంటారు - చాలా సమృద్ధమైనది. ఇక్కడి ఆవులు, ఇతర ఆర్యగణాల్లోని ఆవులకంటే అధికంగా పాలిస్తాయి. వృషభాలుకూడా దీటులేనివేను! అలాటి బలిష్ట మైన వృషభాలు ఇతరత్రా దొరకడం దుర్లభం! గుర్రాల విషయంలోనూ ఏ ఆర్యగణానికీ సారస్వతదేశం తీసిపోదు. కానీ, ఇక్కడిలాటి మేలు జాతిగుర్రాలు ఇతర ఆర్యగణాల్లోనూ లభ్యమౌతాయి. గొర్రెల విష యంలో మొదటగా గాంధార ఆర్యగణాన్ని చెప్పుకోవాలి. సింధునదికి పశ్చిమాన గాంధార ఆర్యగణం వుంది మేలుజాతి గొర్రెల్ని పెంచడంలో గాంధారగణం ప్రసిద్ధమైంది. సారస్వత దేశం దట్టమైన అరణ్యాల్తో నిండివుంది. అక్కడి అరణ్యాల్లో అశ్వత్థ (రావిచెట్టు) ఖాదిర్, విభీదక్, హరిద్ర (కదంబ) కించుక (మోదుగ) మొదలైన వృక్షాలూ, మంజు, కాష్ట, కుశ, (దర్భ) దూర్వా, (గడ్డి) మొదలైన తృణజాతి మొక్కలూ సమృద్ధిగా వున్నాయి. సారస్వత దేశంలో జలాశయాలు కూడా అధికంగా వున్నాయి. గ్రీష్మ ఋతువులో అక్కడి జలాశయాల్లో తామరలు వికసించినప్పుడు, దిశలు సువాసనల్తో సురభిత మౌతాయి!

సారస్వత దేశవాసులైన భరత, కుశిక - ఆర్యశాఖలు సదా ఇంద్రుణ్ణీ. అగ్నిని పూజిస్తూ వుంటారు. ఇంటింటా నిత్యాగ్ని

హోత్రం అఖండంగా మండుతూ వుంటుంది. ప్రతి ఆర్యుడూ ఉదయాస్తమానాల్లో అగ్ని చర్యను విధిగా నిర్వర్తిస్తుంటారు. ఉభయ సంధ్యల్లో ఎవడయినా ఈ ఆర్యగ్రామాల్లోకి వచ్చినట్టయితే, ప్రతి యింటి నుండి గగనానికి ఎగిసే హోమగుండాల్లోని ధూమం సుళ్లు తిరుగుతూ కనుపిస్తుంది. హోమ గుండాల్లో నుండి వచ్చే కమ్మని వాసనలు మనస్సును తృప్తి పరుస్తుంటాయి. గాయత్రి, సామవేదపు గీతాలూ మధుర స్వరాల్లో వినిపిస్తూ వుంటాయి. అసురుల సరిహద్దుల్లో వుండడంవలన 'కుశిక' ఆర్యులూ, 'భరత' ఆర్యులూ సదా జాగరూకత కలవారై, ఆయుధపాణులై వుంటారు. ఇందుకు వారేమీ బాధపడరు సరికదా, గర్విస్తారు. ఇంద్రుడు తన ఆదర్శనిర్వహణకు తమను ఎన్నుకున్నాడని 'కుశిక' 'భరత' ఆర్యులు ఆనందిస్తూవుంటారు. అది తమ మహాభాగ్యంగా తలుస్తూవుంటారు. యమునా నదికి ఆవలవైపునున్న అసురుల్ని (కిరాత కుల్ని, నిశాచరులనికూడా వీరినే అంటారు) మట్టుపెట్టడానికి తాము చాలు నని 'భరత' 'కుశిక' ఆర్యుల అభిప్రాయం. కాని, అవుసరమైతే పురుగణపు ఉపశాఖలే కాకుండా, మొత్తం ఆర్యగణాలన్నీ సహాయానికి వస్తాయి. యమునా నదికి ఆవల అసురులు అధిక సంఖ్యలోవున్నారు. పైగా నిస్సహాయులూ కారు! ఎంత అయినా, పణిజాతి ప్రజలు తెచ్చి యిచ్చే ఆయుధాల మీదనే ఆర్యుల జయాపజయాలు ఆధారపడివున్నాయి. తామ్రం, సువర్ణం, మణులూ, ముత్యాలూ – వీటన్నింటినీ అధికంగా కలిగినవారు పణిజాతి ప్రజలు. అధిక లాభాలూ, భోగభాగ్యాలూ, నాగరిక జీవితమూ వీళ్ళను దుర్బలుల్ని చేసేశాయి. అయినా, వీళ్ళల్లోనూ, ఇంకా నివురుకప్పిన నిప్పులా శౌర్యం అక్కడక్కడా కనుపిస్తూంటుంది. యమునా నదికి తూర్పున బృహత్పర్వతం వరకూ కిరాతకులు వున్నారు. పణులూ, కిరాతకులూ కలసి ఆర్యుల్ని ఎదుర్కొన్నట్లయితే, ఆర్యులు సరస్వతీ తీరాన్ని విడిచి ఏనాడో వెళ్ళిపోయుండేరు. కాని, పణిజాతికీ, కిరాతకులకు కూడా సరిపడదు. వాళ్ళల్లోనూ సంఘర్షణలు జరుగుతుంటాయి.

పురుజనపు ప్రతి శాఖా మహా పరాక్రమవంతులైన వీరులను ఈ ప్రపంచానికి ఇచ్చింది. వశిష్ఠుడు ఈ పురుజనంలో ఉద్భవించిన వాడే! గాధి పుత్రుడైన విశ్వామిత్రుడు 'కుశిక' శాఖకు చెందినవాడు. 'భరత' శాఖ

లోనూ 'దేవశ్రవా' 'దేవవాత్' మొదలుగాగల మహావీరు లుద్భవించి సారస్వత భూమిని కిరాతకుల ఆక్రమణలనుండి కాపాడారు.

మిత్రులో, బంధువులో తమ ఇంటికి రావడం ప్రతివారికీ ఆనందాన్ని కలిగిస్తుంది. కాని ఆర్యుల్లో మిత్ర, లేక బంధు సమాగమపు ఆనందం అన్యమానవ సమూహాల్లోకంటే అత్యధికం. బంధుమిత్రుల కొరకు సదా ఎదురు చూస్తుంటారు. తమ పోషణవరకూ అయితే పురుగణానికి ప్రస్తుతం వున్న ఆవులూ, గుర్రాలూ, మేకలూ, గొర్రెలే చాలు. కాని వారి అభిప్రాయం 'కేవలా ఘో భవతి కేవలాది !' (తన వరకు తాను తినేవాడు, కేవలం పాపాన్ని తినే వాడిక్రింద లెఖ్ఖ) ఆర్యులకు వంటరి తిండి, వంటరి బ్రతుకు నచ్చదు. ఒక తండ్రి సంతానమే నాలుగయిదు తరాలు గడిచే సరికి ఎన్నో కుటుంబాలుగా అభివృద్ధి చెందుతుంది. గత పది పదిహేనుతరాలుగా పురుగణం ఎంతో అభివృద్ధి చెందుతూవచ్చింది. అనేక శాఖలుగా, కులాలుగా విభక్తమైంది. అయినప్పటికీ తమ రక్త సంబంధీకులంటే వారికి ప్రాణసమానం. రక్త సంబంధంలోని ఉత్కృష్టమైన స్నేహానుభూతిని ఆస్వాదించడం ఒక్క ఆర్యులకే చేతనవునేమో అనిపిస్తుంది. ఆర్యుల దృష్టిలో అతిథి నిజంగా దేవుడితో సమానం. అగ్నినీ, ఇంద్రుణ్ణీ అర్చించినట్టుగానే అతిథిని కూడా అర్చిస్తారు. ఈ అతిథిసేవ కారణంగానే, ప్రతి ఆర్య పరివారమూ, పాలూ, నేయీ, మాంసమూ మొదలైన ఆహార పదార్థాలను అధికాధికంగా ఖర్చు పెడుతూంటుంది. కనుకనే ఈ పదార్థాలనూ, ఈ పదార్థాలనిచ్చే పశువుల్నీ అన్యజాతి ప్రజల వద్దనుండి లాక్కోవడం తమ ప్రధాన కర్తవ్యంగా భావిస్తుంటారు. ఇవి అన్యత్రా లభించనప్పుడు, ఒక ఆర్యగణం మరో ఆర్యగణపు పశువుల్ని కాజేయడం కూడా కద్దు. పశువుల కొరకు అవసరమైతే ఆర్యగణాలన్నీ కలిసి సరిహద్దులలోగల అన్యజాతి ప్రజల గ్రామాలమీద దాడి చేస్తుంటాయి:

పురుకుత్సుడి భార్యకూ, ఆమె ఆడబిడ్డ (పురుకుత్సుడి చెల్లెలు, పురుజనపు ఆడుబిడ్డ కావడం వలన 'పౌరవి' అంటూ రీమెను) పౌరవికీ గొప్ప స్నేహం: ఒకరిని విడిచి ఒకరు క్షణం వుండలేరు. పౌరవి తృస్తుగణానికి నాయకుడైన (రాజైన) వర్ధ్యశ్వుణ్ణి వరించి, వివాహమాడింది. పదినెను విడచివుండడం దుర్భరమే అయినప్పటికీ, వివాహ

మన్యూక ఉండక తప్పదు మరి! భర్తను అనుసరించాలి గదా? కానీ, ఈ మధ్యనే వదినెతో కలసి ఒక సంవత్సరం గడపే సదవకాశం ఒకటి లభించింది. యమునకు ఆవలవైపున ఉన్న పణిజాతీయులు (వీరిలోని ఉప జాతులు అజ శిగ్రు, యక్షులు) పూర్తిగా ఆర్యులకు లొంగిపోలేదు! పీతకేశుల (బంగారురంగు వెంట్రుకలు కలవారు - ఆర్యులు) పరాక్రమం వాళ్ళకు తెలుసును. కనుకనే సాధ్యమైనవరకు, సంఘర్షణకు దిగకుండా తప్పుకుంటారు. కానీ, ఆర్యులు వారిని వొదిగివుండనిస్తేగా? ఎప్పుడూ రెచ్చగొడుతూంటారు. తప్పనిస రవడంవలన వారూ యుద్ధానికి సిద్ధమయ్యారు. అజ, శిగ్రు, యక్షులు - పణిజాతిలోని ఈ మూడు తెగలూ ఏకమై 'భరత' గణం మీద యుద్ధాన్ని ప్రకటించాయి. పణి జాతీయుల ఈ సమైక్యతముందు నిలువలేక భరతగణం అన్య పురుగణపు ఉపశాఖల్ని కూడా తన సహాయార్థం పిలిపించుకుంది.

ఇక నిప్పుడు సరస్వతీ నదియొక్క ఉభయతీరాల్లోనూ, యమునను అనుకొనియున్న అరణ్యాల్లోనూ చాలా దూరంవరకూ పురు, త్రుత్సుగణాల గోష్ఠలు (గోశాలలు) వెలిశాయి. పణిజాతీయులు సమైక్య ఆర్యసేనావాహిని ముందు నిలువలేక, యమునకు ఆవలిప్రక్కనున్న తీరప్రదేశాలలోని తమ గ్రామాలనుకూడా విడిచి పారిపోయారు. వారు విడిచిపోయిన గ్రామాలను ఆర్యులు దోచుకున్నారు. పణిజాతీయుల్ని తరిమేశారన్నమాటేగానీ. ఆర్యులకు యమునానదికి ఆవలితీరమంతా అంధకార సదృశ్యమే! యమునకు ఆవలి ప్రపంచం ఎంత విస్తృతమైందో అక్కడి ప్రజావాహుళ్యత తమను మించుతుందో, తగ్గుతుందో మొదలైన ప్రశ్నలు ఆర్యుల మస్తిష్కాల్లో అపరిష్కృతంగానే ఉన్నాయి. కనుకనే యమునానదిని దాటి ఆవలికి పోవడం తమకేమాత్రం శ్రేయస్కరం కాదని ఆర్యులు తెలుసుకున్నారు. పైగా, పణిజాతీయులు ఎక్కడ ఉగ్రులౌతారోనన్న భయంకూడా ఆర్యులకు లేకపోలేదు! తమ భూముల్ని విడిచి, యితర ప్రదేశాల్లో ఆరునెల్లో. సంవత్సరమో గడపడం ఆర్యులకు క్రొత్త విషయమేమీ కాదు. వారి ముఖ్య ఆహారపదార్థాలు పశువులనుండే లభిస్తుంటాయి. పశువులు సర్వ కాలాల్లోనూ విడవకుండా, ఆర్యులవెంటే ఉంటాయి; ఇకపోతే. ఆర్యుల ఆహారంలో 'పిండి', 'అపూపా' లు కూడా ఉన్నాయి.

ఆయినా వీటి పాలు అత్యల్పం! కనుక ఎక్కడ ఉన్నా వారి జీవిత క్రమంలో వ్యతిక్రమణ మేమీ ఉండదు!

పురుగణపు వివిధ శాఖలూ, వారి నాయకులూ సరస్వతీ నదియొక్క దూరతీరాలవరకూ నివాసాల్ని ఏర్పరచుకున్నారు. ఒక్కో ఉపశాఖకూ వేల సంఖ్యలో పశువులు ఉన్నాయి. కనుక. వారి గోష్ఠులుకూడా దూరదూరంగా పశువులు తిరగడానికి వీలుగా ఉన్నాయి. ఎంత దూరంలోఉన్నా, ఆర్యులవద్ద అతిశీఘ్రంగా ప్రయాణాన్ని సాగించగల అశ్వాలు ఉన్నాయి. ఐదారు యోజనాల (ఆమడ) దూరాన్ని కొన్ని ఘడియల్లో చేరుకోగలరు. ఆర్యస్త్రీలు కూడా పురుషుల్లాగానే గుర్రపు స్వారీ చేయగలరు. యుద్ధాల్లోనూ పురుషుల్తో సమానంగా సాహసాన్ని ప్రదర్శించగలరు. తరచు పౌరవీ, వర్ధ్యాశ్వలు పురుకుత్సునియొక్క * గోష్ఠిలోకి వస్తూంటారు. పురుకుత్సుడు కూడా అప్పుడప్పుడూ తన భార్యాపుత్రులతో వర్ధశ్వుడి గోష్ఠిలోకి వస్తుంటాడు. కశోజుడికి (త్రసదస్యుడు) ఐదారు సంవత్సరాల వయ సొచ్చింది.

త్రసదస్యుడికి కశోజుడనే పేరొచ్చిం దిప్పుడు. కశోజుడంటే కొరడాతీసుకు పరుగెత్తేవాడని అర్థం. ఈపేరుకువెనుక ఓ చిన్నకథ వుంది. త్రసదస్యుడికి కొరడాతో అదిలిస్తూ పశుల మందల వెనుక పరుగెత్తడం చాలా ఇష్టం. ఓనాటి సాయంసమయాన సరస్వతీ నదిఒడ్డున, సింహం ఒకటొచ్చి మరుగు ప్రదేశంలో ఒకచోట దాక్కున్నది. త్రసదస్యుడు సరదాలుగా కొరడా (కశ) తీసుకుని పశువులవెనుక పరుగెడుతున్నాడు. ఒడ్డున నక్కివున్న సింహం మానవస్వరాన్ని విని బయటికి వచ్చింది. త్రసదస్యుడు అదీ ఒక కొత్తరకం పశువనుకుని కొరడా తీసుకు దానివెంట పడ్డాడు. కుర్రవా డలా సింహంవెనక పరుగెత్తడాన్ని ప్రజలు చూశారు. భావి పురురాజు మృత్యువుపాల పడతాడెమోనని ప్రజలు భయపడ్డారు. చప్పున వెళ్ళి త్రసదస్యుణ్ణి పట్టుకున్నారు. చిన్న వయసులోనే అతడు ప్రదర్శించిన సాహసానికి పురు ప్రజలందరు గొప్పగా ఆనందించారు. అతడి సాహసానికి పారితోషికంగా ఆ నాటినుండే అతణ్ణి 'కశోజు'డని పిలవసాగారు. తల్లీ దండ్రీ పరమానంద భరితులయ్యారు.

---

* గోష్ఠి = గోశాల, గోత్రం, కూడాసు.

పౌరవి తన అల్లుకియొక్క పరాక్రమ గాథను ఎన్నోసార్లు చెప్పించుకు విన్నది. తన ముద్దుల అల్లుడి పరాక్రమాన్ని గురించి ఎన్నిసార్లు విన్నా ఆమెకు విన్నట్టే వుండేది కాదు. ఆమె కప్పటికి సంతానం కలుగలేదు. కనుక అన్నకొడుకే తనకు సర్వస్వం! వదినె, ఆడబిడ్డ లిద్దరూ కూర్చొని 'కశోజు'డి ముచ్చట్లు గంటలతరబడి చెప్పుకునేవారు. వారి కంతకన్న పని మాత్రం ఏముంది? కాని, సాధారణంగా ఆర్యగణాల్లోని రాజులూ, రాణీలు కూడా తమ అంతస్తును మరచి సామాన్యుల్లా అన్నిపనులనూ చేస్తూంటారు. ఈ వదినె ఆడబిడ్డలు కూడా వంటా - పెట్టూ, పాలు పితకడం, చివరకు గోశాలల్ని శుభ్రం కూడా చేస్తూంటారు. పనులు చేసిపెట్టడానికి ఎంతోమంది దాసులూ, దాసీలూ వున్నారు సామాన్య ఆర్య కుటుంబాల్లోనే పణి, నిషాద జాతులకు చెందిన దాసులు బహుళంగా వుంటారు. ఇక పురుకుత్సుడి వద్దా వర్ధ్యశ్వుడివద్దా వున్న ఈ దాసుల సంఖ్యను చెప్పనే అవుసరంలేదు. అయినప్పటికీ వదినె - ఆడబిడ్డలు తామూ ఏవో ఒక పనిని చేస్తూనేవుంటారు.

పురుకుత్సుడి గోష్ఠిలో పణి, నిషాదజాతి దాసులున్నారు. కిరాతజాతి దాసులు మాత్రం లేరు. అప్పటికి కిరాతజాతి దాసుల్ని ఆర్యుల యిండ్లలో చూడగలగడం చాలా అసంభవమైన విషయం. సప్తపురాల యుద్ధంలో మూడేండ్ల కిరాతబాలిక ఒకతె దొరికింది. ఆ బాలికను పెంచుతోంది పురుకుత్సుడిభార్య. అసలా కిరాత బాలికను, ఆ యుద్ధంలో ఆర్యసైనికులు చంపబోతూండగా, పురుకుత్సుడి భార్య గుర్రంమీద హుటాహుటీన అక్కడికి వెళ్ళి ఆ పిల్లను చంపనీయకుండా అడ్డుకున్నది. తెచ్చి పెంచుతున్నది. ఇప్పుడా కిరాత బాలిక తొమ్మిదేండ్ల దయింది. కశోజుడితో ఆడుకోవడమే ఆ అమ్మాయిపని. తనపట్ల ఆర్యులు ప్రవర్తించే ప్రవర్తనను అర్థంచేసుకునే వయసు కాదా అమ్మాయిది. అప్పుడప్పుడూ తనను తిరస్కారస్వరంలో "శావలా" * అని పిలుస్తుండేవారు. అలా పిలిచినప్పుడు మాత్రం తనకు పీతకేశుల్లో స్థానం లేదని, తన స్థానం కృష్ణవర్ణుల్లోనని తెల్సుకొంటోంది. పురుకుత్సుడి భార్యకు ఈ కిరాత బాలికమీద అమితమైన వాత్సల్యం:

---

* శావలా, శ్యామలా (నల్లనిదానా)

'కళోజుడు', కిరాత బాలిక ఏవో ఆటలో లీనమైఉన్నారు. వదినె ఆడబిడ్డలు ఒక అశ్వత్థ, (రావి) వృక్షం క్రింద కూర్చుని మాట్లాడుకుంటున్నారు.

వసంతాగమనపు రోజు లవి. కొన్ని చెట్లు ఆకులను రాలుస్తున్నాయి. కొన్ని రాల్చి మోడయ్యాయి. ఇంకొన్ని చెట్లు క్రొత్త ఆకుల్ని తొడుగుకున్నాయి. రావి ఆకులు సహజంగానే మృదువుగా వుంటాయి. అప్పుడే వచ్చిన లేతఆకులు పావురపు రెక్కల్లా మహాకోమలంగా వుంటాయి. ఆర్యులు ఆ కాలం, ఈ కాలం అనే వ్యత్యాసం లేకుండా, సదా చర్మ వసనాలను ధరిస్తుంటారు. వదినె అడబిడ్డలిద్దరూ రంగుల్తో అందంగా అలంకరించిన చర్మవసనాలను ధరించారు. అపరాహ్ణమైంది. ఎండకూడా ఏమంత ఎక్కువగా లేదు. 'పౌరవి' ఇప్పుడే యవ్వనపు ప్రథమ పాదంలో పాదమూన్తున్నది. ఆడబిడ్డను అలంకరించడం పురుకుత్సుడి భార్య కో గొప్ప సరదా! 'పౌరవి'యొక్క బంగారు పోగుల్లాంటి వెంట్రుకల్ని నాలుగు జడలల్లి, రెండు జడల్ని వెనక్కూ, రెండు జడల్ని చెంపలమీదకూ వచ్చేట్టు వేసింది. 'పౌరవి'యొక్క విశాలమైన నీలికండ్లు హర్షాతిరేకం వలన ప్రపుల్లితమయ్యాయి. వదినె వాత్సల్యప్రపూరితఅయి "నువ్వెంత సుందరాంగివో?" అన్నది ఆడబిడ్డను.

"నువ్వుమాత్రం తక్కువా, వదినే? నీ లావణ్యాన్నిగురించిన చర్చ మొత్తం సప్తసింధులోనే మారుమ్రోగుతోంది!" అన్నది పౌరవి.

"లావణ్యవతినే. కానీ, ఇప్పుడు పుత్రవతి నయ్యాను. స్త్రీ పుత్రవతి అయిందంటే, ఇక నామె లావణ్యం గణనకెక్కదు. నీ వింకా 'కిశోరి'వి."

"స్త్రీ పుత్రవతి కావడం చాలా సౌభాగ్యకరమైన విషయం గదా? పైగా నీకు 'కళోజు'లాటి కొడుకు పుట్టాడు. ఇంకేం కావాలి!"

"నువ్వూ కంటావులే, అలాంటి కొడుకునే!"

"ఐతే, నేనూ నీలాగానే 'పాత'బడిపోతానుగావును. ఇకప్పుడు నా సౌందర్యాన్ని గురించి, ఎవ్వరూ చెప్పుకోరుగావును!"

"అహహ, అలా అనకు! నీలాంటిదాని సౌందర్యం ఎన్నటికీ 'పాత' పడదు. వర్ధ్యశ్వుడు చాలా అదృష్టవంతుడు. ఊర్వశిలాంటి భార్యవు దొరికావు!"

"వదినే, నిజంగా ఊర్వశి ఎంత అందగత్తో ? లేకపోతే, పురూరవుడు అలా పిచ్చివాడై ఆమెవెంట తిరుగుతాడా ?"

"అవును ఊర్వశి చాలా అందగత్తె, నీ అంత అందగత్తె : నీ సౌందర్యాన్ని చూడడానికి, ప్రజలు ఎప్పుడూ మూగుతుంటారు. ప్రజల దృష్టులన్నీ నీ చుట్టూ కేంద్రీకరించుకునివుంటాయి. ఆర్య స్త్రీ యొక్క సౌందర్యం నీలోనే ప్రస్ఫుటించిందమ్మా ! బంగారు వెంట్రుకలు, ఉన్నతమైన నాసిక, నీలికండ్లు, అరుణ అధరాలూ, చంద్రఖండంలాంటి కపోలాలు, ఉన్నతమైన సుశ్వేత లలాటం, సశక్తమై సుందరంగావున్న బాహులతలు కోమలమైన సన్నని వ్రేళ్ళూ ఆరక్తకరతలం, వక్షస్థలం, కటిప్రదేశం, రంభాసదృశ్యమైన జానువులు మీగాళ్ళూ. పదతలాలూ ఓ....హో, అపూర్వమైన సౌందర్యవతివమ్మా నీవు : నీకు నీవే సాటి !" అన్నది పురుకుత్సుని భార్య.

"కనుక నేను రెండవ ఊర్వశినంటావు. ఔనా ?"

"అవునుమరి. కానీ, పురూరవుణ్ణి దుఃఖసాగరంలో ముంచి నిర్దాక్షిణ్యంగా వెళ్ళిపోయిన, ఆ కఠినురాలైన ఊర్వశివి మాత్రం కాదులే నీవు!"

"తన ప్రియుడిపట్ల అంత కఠినంగా ఎలా వ్యవహరించగలిగిందో, ఆ ఊర్వశి ?"

"ఆమె మానవ స్త్రీ కాదు :"

"దానవ స్త్రీకూడా కాదుగా !! అప్సరస దేవాంగనల్లో ముఖ్యురాలు ! అలాంటామె అలాగా ప్రవర్తించడం ?"

"పౌరవీ! ఊర్వశి. పురూరవుల గాథను నీవు పాడగా ఎన్నోసార్లు విన్నానమ్మా ! ఆ గాథను ఎన్నిసార్లు విన్నా తృప్తికలుగదు. ఏదీ మరో సారి పాడు ?" అనడిగింది పురుకుత్సుడి భార్య.

"కానీ, ఒక షరతు; నువ్వు వంతపాడేటట్టయితే పాడతాను : పురూరవుడి భాగాన్ని నే నాలాపిస్తాను; ఊర్వశిభాగాన్ని నీ వాలాపించు :"

"అలా కాదు పౌరవీ : నువ్వు తల్లకిందులు చేస్తున్నావు; ఊర్వశికి నీవే తగిపోతావు. నాలో స్త్రీ సహజమైన కోమలత్వం లేదు :"

"అలా ఎందుకంటావు, వదినే ? నీలో స్త్రీ సహజమైన కోమలత్వం

లేకపోవడం కాదు; సౌందర్యం, శౌర్యం ఈ రెండూ ఆశ్చర్యజనకంగా నీలో సమ్మిశ్రితమయ్యాయి !"

"అయితే, నాలో శౌర్యం, సౌందర్యం సమ్మిశ్రితమయ్యాయి అంటావు; సరే, నేనే పురూరవుడి భాగాన్ని ఆలాపిస్తాను !"

ఇద్దరూ పురూరవుడి గాథను ఆలపించ మొదలుపెట్టారు. ఊర్వశి మూడేండ్లు పురూరవుడి వద్దఉండి, భరతు డనే పుత్రుణ్ణి కని, తండ్రి - కొడుకుల్ని విడిచి వెళ్ళిపోవడానికి సిద్ధమౌతుంది; పురుకుత్సుడి భార్య కరుణభరితమైన స్వరంతో పురూరవుడిగా స్వరాన్ని విప్పింది. "ఓ ఊర్వశీ! ఓ ప్రేయశీ! హృదయాన్నిలా రాయిచేసుకోకు! వెళ్ళకు, వెనక్కు తిరిగిరా! నీవు లేని మన భవిష్యత్తు, అంధకార సదృశమవుతుంది !"

పౌరవి ఊర్వశిగా ఇలా ఆలాపించింది: "పురూరవా, వెనక్కి, వెనక్కి తి గి వెళ్ళిపో. ఇక నీవు నన్ను పొందడం దుర్లభం ! గాలిని పిడికిట్లోకి తీసుకో గలవా ? అంతే నేనూను !

పురూరవుడు (పురుకుత్సుని భార్య): "నీవు లేని ఈ లోకమే నాకు వ్యర్థం. నా తూణీరంలోని బాణాలు లక్ష్యాన్ని భేదించవు. యుద్ధంలో శత్రువుల (పశు) ధనాన్ని దోచలేను. గోవుల్ని గెల్చుకురాలేను. వీరులైన సైనికులు దిక్కులు పిక్కటిల్లేట్లు విజయధ్వానాలు చేయలేరు !"

ఊర్వశి : నేను అమర కన్యను. నీవు మర్త్యుడివి. నీకు నేను శాశ్వతంగా దక్కడం అసంభవం. క్రీడాశ్వంలా నేను నీ కనుచూపుకు దూరం కాక తప్పదు."

పురూరవుడు : ఊర్వశీ, ఇన్నాళ్ళూ నా కోర్కెల్ని సఫలం చేస్తూన్న ఓ ఊర్వశీ ! నాకో శిశువునిచ్చి వెళ్తున్నావు. వాడు నిన్ను చూడాలని అడిగితే నే నేం సమాధానం చెప్పను ? నీవు లేని నేను, శవంతో సమానం. నేను చాలా దూరం వెళ్ళిపోతాను. ఇక వెనక్కి రాను. ఆపదలు నన్నణిచేస్తాయి. తోడేళ్ళు నన్ను తినేస్తాయి !"

ఊర్వశి : ఓ పురూరవా నీవు చనిపోవద్దు ! తోడేళ్ళకు నీవు ఆహారం కాకూడదు. నన్ను మర్చిపో ! స్త్రీల మిత్రత్వం శాశ్వతం అనుకోకు ! మా హృదయాలు మానవహృదయాలు కావు ; తోడేళ్ళ హృదయాలు !"

ఇద్దరూ చాలా మధురమైన కంఠాల్తో గీతాన్నాలాపిస్తున్నారు. చాలా దూరాలవరకు ఆలాపన వినిపిస్తోంది. గీతం అతి కరుణాభరితమైనది. వదినె, ఆడబిడ్డల హృదయాలు విషాదంతో నిండాయి. పాడడం అయిపోయిన కొద్దిసేపటివరకూ ఇద్దరూ మౌనంగా వుండిపోయారు. మౌనాన్ని భగ్నపరుస్తూ పౌరవి ఇలా అంది: "ఇది చాలా అన్యాయం. స్త్రీల హృదయాలను తోడేళ్ళ హృదయాలతో పోల్చడం అనుచితం! ఒకసారి హృదయాన్ని అర్పించాక, ప్రియుడిపట్ల ఇంత క్రూరంగా ప్రవర్తించ గలగడం అసంభవం!"

"కానీ, ఊర్వశి మానవ స్త్రీ కాదు. దేవకన్య. అప్సరస. మరి తన దేవలోకాన్ని ఎలా విడిచిపెడుతుంది?" పురుకుత్సుడి భార్య అంది.

"ఏ స్త్రీ అయినా, సాధారణంగా తన లోకానికీ ప్రేమికుడికీ మధ్య పోటీ వచ్చినప్పుడు, లోకాన్ని విడుచుకొంటుంది. ప్రేమికుణ్ణే స్వీకరిస్తుంది" పౌరవి అంది.

"మనలాగా (మానవస్త్రీల్లా) ప్రియుడికి తన సర్వస్వాన్నీ సమర్పణ చేసే తత్వం దేవతాస్త్రీలకు వుండదు:"

"నేను సర్వస్వం సమర్పణచేసే విషయాన్ని గురించి కాదు మాట్లాడడం! 'సమర్పణ' అనేది స్త్రీ పురుషు లిద్దరి వైపునుండి జరగాలి. అప్పుడే అది సమర్పణ అనిపించుకుంటుంది. సరేకానీ, వదినె, మరా ఊర్వశికి పుట్టిన కొడుకు ఏమైనాడు?"

"ఊర్వశి కొడుకు భరతుడు. అతడిసంతానమే ఇప్పటి భరతగణం."

"పూత్రుస్తుగణం కూడా ఆ భరతుడి సంతానమే అవుతుందిగా మరి? అంటే మేమంతా సగం మానవులం సగం దేవతలమన్న మాట?"

"సగం దేవతలం సగంమానవులం అనడం సరికాదు. త్రసుగణం పూర్తి మానవులే: పురూరవుడుకూడా 'మనువు' సంతానమే: మానవుడే!"

కిరాత పుత్రితో ఆడుకుంటూ త్రసదస్యుడు చాలా దూరం వెళ్ళిపోయాడు. అత్తపాడే పాటను విన్నాడుగావును అంత దూరాన్నుండి పరుగెత్తుకుంటూ వచ్చాడు. తల్లికంటే ముందే. మేనత్త దగ్గరకు తీసుకుంది అతణ్ణి. అత్త పాడే పాటలంటే అతడికి చాలా యిష్టం "మరోసారి పాడు. అత్తా!" అన్నాడు.

అతడడిగితే అత్త కాదనలేదు. పాట ప్రారంభించే ముందు పౌరవి వదినెతో "వదినె. వీడిపేరు "సగం దేవుడ"ని పెట్టకపోయా?" అన్నది.

"ఎన్నిపేర్లు పెడతావమ్మా? త్రసదస్యుడు. కశోజుడు, రెండు చాలవా?"

"నాకు 'సగం దేవు'డన్న పేరు నచ్చింది. వీణ్ణి అదే పేరుతో పిలుస్తాను నేను!"

పౌరవి మరోమాటు పురూరవుడి గాథను పాడి వినిపించింది.

* * *

తృత్సుగణంలో ఆరోజు ఆనందోత్సాహాలకు మేరలేదు. వర్ధ్యశ్వుడికి కుమారుడు కలిగాడు. వృద్ధ ఋత్విజులు ఇంద్ర, అగ్ని, వరుణ దేవతల స్తుతిగీతాలను ఉచ్చైస్వరంలో ఆలాపిస్తున్నారు. స్త్రీలుకూడా మధుర. కోమల సుస్వనాల్లో గీతాల్నాలాపిస్తున్నారు. వర్ధ్యశ్వుడు పులకాంకితుడై సరస్వతి నదికి వందన మాచరిస్తున్నాడు. ఈ సరస్వతీ తీరం అతడికి పుత్రరత్నాన్ని ప్రసాదించింది.

పురుకుత్సుడి భార్య కశోజుణ్ణి తీసుకుని, ముందే వర్ధ్యశ్వుడి 'గోష్ఠా'ని కొచ్చింది. శిశువు జన్మించాక పురుకుత్సుడు వచ్చాడు. పరిసరంలోని పండడికి ప్రభావితుడైన 'కశోజు'డు విషయమేమిటో తెల్సుకోవడానికి ప్రయత్నించాడు. తల్లి నీకో బుల్లిబావ పుడుతాడివ్వాళ!" అని చెప్పింది.

ఈ మాత్రపు సమాధానంతో అతడికి సంతృప్తి కలగలేదు. "ఎట్లా పుడతాడు? ఇన్నాళ్ళూ ఎక్కడున్నాడు?" ఇలా ప్రశ్నల వర్షం కురిపించ సాగాడు.

బావను ఇంద్రుడు పంపిస్తున్నాడనీ, ఇన్నాళ్ళూ ఇంద్రుడివద్ద వుండి, ఇప్పుడు వస్తున్నాడనీ. తల్లి కొడుక్కు చెప్పింది.

త్రసదస్యుడు బాల్యంనుండి ఇంద్రుడి మహిమను గురించి వింటు న్నాడు. ఇంద్రుడి వద్దనుండి బావ వస్తున్నాడన్నది అతడి సంశయాలకు పరిష్కారాన్నిచ్చింది. ఇక నక్కడినుండి ఎంతో ఆదుర్దాగా రాబోయే బావ కోసరం ఎదురు చూడసాగాడు. శిశుదర్శనార్థం వేచివున్న సుదీర్ఘ పంక్తిలో మొట్టమొదటివాడు త్రసదస్యుడే! శిశువు పుట్టగానే మొదటగా వెళ్ళి

చూసింది త్రసదస్యుడే! తెల్లగా, పిండిముద్దలా కండ్లు మూసుకునివున్న బావను చూసిన క్షణాన అతడి ఉత్సాహమంతా నీరయిందనే చెప్పాలి. శిశువు కండ్లు మూసుకుని వుండటం వల్ల బావకసలు కండ్లు లేవనుకున్నాడు త్రసదస్యుడు. "ఇంద్రుడి వద్దనుంచి వచ్చినప్పుడు నీవూ ఇలాగే కండ్లు మూసుకుని వున్నావు" అని అత్తా అమ్మా చెప్పారు.

సరస్వతీ తీరంలో వుండగానే బుల్లిబావ కండ్లు తెరిచాడు. త్రసదస్యుడికి బుల్లిబావ కండ్లకూ, అత్త కండ్లకూ తేడా ఏమీ కనుపించలేదు. అత్త కండ్లలాగే బావ కండ్లుకూడా నీలంగా వున్నాయి. "కానీ, తన తల్లి కండ్లు ఇలా వుండవే! పసుపుపచ్చగా వుంటాయి!" అనుకున్నాడు త్రసదస్యుడి తల్లి సువర్ణాక్షి, అత్త నీలాక్షి. శిశువుకు మూడ్నెల్లొచ్చి, 'ఆఁ ఊఁ' అనే వరకూ పురుజనం సరస్వతీ తీరంలోనే ఉంది. త్రసదస్యుడు బుల్లిబావ "ఆఁ ఊఁ" అనడాన్ని కళ్ళారా చూశాడు; చెవులతో విన్నాడు. బావ బాగా పెరిగాడు; పుట్టినప్పటి కంటె ముఖం బాగా మారిపోయింది. 'దివోదాసు' అని పేరు పెట్టారు. దివోదాసును ఎత్తుకోవాలని త్రసదస్యుడికి మహా ఉబలాటం. కానీ అందరికీ ఎక్కడ పడేస్తాడోనని భయం; ఎవ్వరూ ఎత్తుకోవడానికి ఇచ్చేవాళ్లు కాదు. అయినా, అప్పుడప్పుడూ కిరాతపుత్రి చేతిలోనుంచి దివోదాసును లాక్కొని, తన ఉత్సాహాన్నీ, వాత్సల్యాన్నీ ప్రకటిస్తూండేవాడు త్రసదస్యుడు. పిల్లలకు అనుగుణమైన భాషలో ఇలా మాట్లాడేవాడు దివోదాసుతో – "దివో! నీవూ నా లాగానే పెద్దవాడివయిన తరువాత అప్పుడే ఇద్దరం కలిసి ఆడుకుందాం! ఊఁ, సరేనా? గుర్రాల్ని పట్టుకుందాం నోటికి కళ్ళాలు తగిలించి స్వారీ చేద్దాం. ఊఁ, సరేనా? స్వారీ అనగానే భయపడుతున్నావా! భయమేమీ లేదు: మా అమ్మను చూశా, ఎంత బాగా స్వారీచేస్తుందో? మా అమ్మ గుర్రం చాలా పెద్దది. నేను క్రింద నిలబడి చెయ్యి ఎత్తినా, దాని పొట్ట అందదు! అమ్మను చూశా, గుర్రంమీద ఎలా ఎగిరి కూర్చుంటుందో! అలానే కూర్చుందాము. ఊఁ,సరేనా? గుర్రం నన్నుగుర్తుపడుతుందికూడాను. మనసూ అమ్మ చూసినట్టుగానే నా నుదుటిని వాసనచూస్తుంది గుర్రం!"

దివోదాసు ఓ మాటు "ఆఁ ఊఁ" అన్నాడు. తను చెప్తున్నదంతా అతడికి అర్థమౌతూన్న దనుకున్నాడు త్రసదస్యుడు. మళ్ళీ చెప్పసాగాడు.

"మనిద్దరం పెద్దయ్యాక ఏం చేస్తామో తెల్సా? బాగా గుర్రాల్ని దౌడు తీయిద్దాం! నీకు ఎర్రని గుర్రం కావాల్నా? తెల్లని గుర్రం కావాల్నా? ఇద్దరం ఒకేరంగు గుర్రాల్ని తీసుకుందాం, ఊఁ సరేనా?" అన్నాడు.

దివోదాసు మళ్ళీ 'ఊఁ' కొట్టాడు, త్రసదస్యుడు తన వాక్యాల్ని పూర్తిచేశాడు. "ఇద్దరి గుర్రాలూ ఒకే రంగులో వుంటాయి. ఎర్రని రంగే బాగుంటుంది. వాటితోటే ఆడుకుందాం. బాగా స్నేహమౌతాయి. ఇహ పెద్దయ్యాక ఎక్కి స్వారీచేద్దాం! ఊఁ సరేనా?" అన్నాడు.

పసివాళ్ళ సంభాషణలకు అంతరాయాన్ని కలిగించడం తల్లులకు ఇష్టం వుండదు.

పురుగణం సరస్వతీ తీరాన్నివదలి ఉత్తరాభిముఖంగా పయనించింది. పురుగణం వెళ్ళాక తృస్తుగణంకూడా పశ్చిమదిశకు వెళ్ళిపోయింది. పురుగణపు వియోగం పౌరవికి మహాదుఃఖాన్ని కలిగించింది. ఇక సరస్వతీ తీరాన్ని వదలి వెళ్ళేరోజున ఆమెపడిన మానసికవేదన వర్ణనాతీతం! సరస్వతీ తీరం తనకు పుత్రుణ్ణి ప్రసాదించింది. సరస్వతీ ప్రీత్యర్థం ప్రత్యేకంగా యజ్ఞం చేసింది. హవనీయాన్ని సమర్పిస్తూ తన హృదయంలోని కృతజ్ఞతను తెల్పుతూ "అమ్మా, సరస్వతీ! నాపట్ల నీపుచూపిన దయను ఎన్నటికీ మర్చేపోను. దివోదాసు నా కొడుకుకాదు. నీ కొడుకు. వాణ్ణి రక్షించడం, తృస్తుగణ గౌరవాన్ని కాపాడగల సమర్థుణ్ణి చేయడం, నీ పని అమ్మా!" అని వేడుకుంది.

ఆనాడు భరతగణం విందు చేసింది, సాయం వందనం తరువాత విందు, నృత్యగానాది వినోదాలూ ప్రారంభమైనాయి. తెల్లవారేవరకూ సాగుతూనే వున్నాయి. 'దైవహిత్'డు వందల సంఖ్యలో వృషభాలను కోయించి వండించాడు. సోమరసం ప్రవాహంకట్టింది. తృస్తు, భరతగణాల స్త్రీ పురుషులందరూ ఈ విందులో, నృత్యగానాది విలాసాల్లో పాల్గొన్నారు. సూర్యోదయం కాగానే తృస్తుగణం సరస్వతీ తీరాన్ని విడిచి వెళ్ళిపోయింది. పురు, తృస్తుగణాలు విడిచివెళ్ళిన గోష్ఠుల నిర్మానుష్యత ఎన్నో రోజుల వరకూ భరతగణాన్ని విచార సాగరంలో ముంచింది. ఆర్యుల జీవితమే అంత. ఒకేచోట స్థిరంగా వుండడం వారి జీవితాల్లో సంభవం కాదు. వారి జీవితాల్లో సంయోగ - వియోగాలు జరుగుతూనే వుంటాయి. బంధు

ప్రేమ, అతిథి పరాయణత తరచుగా ఆర్యగణాల్ని ఒకచోటికి చేరుస్తూ టాయి. యుద్ధాలవల్లకూడా ఆర్యగణాలు ఒకచోట కూడుతూ వుంటాయి. పురు, తృస్తుగణాలు సరస్వతీ తీరంలో ఒక సంవత్సరంపాటు కలిసి వున్నాయి. పణిజాతి. భరతగణం మీద క్రొత్తఆక్రమణయిచేసే సూచనలు ఏమీ కనిపించలేదు. ఆగంతుక గణాలు సరస్వతీ తీరాన్ని విడిచి వెళ్ళిపోయాయి.

వర్ధ్యశ్వుడు పరుష్ణితటాన్ని చూసి అప్పటికి ఇరవై నెలలు గడిచాయి. సరస్వతిమీద వర్ధ్యశ్వుడి హృదయంలో భక్తి, శ్రద్ధ. స్నేహభావాలున్నాయి. కానీ పరుష్ణి అతనికి సొంతతల్లి లాటిది. సరస్వతికి దయాపయి అయిన పినతల్లి స్థానాన్నీయగలడు. పైకే అలాఅని సరస్వతికి కోపం తెప్పించడం అతడి అభిమతం కాదు. కానీ. యథార్థం చెప్పుకోవాలంటే, పరుష్ణి ఎక్కడ ? సరస్వతెక్కడ ? పరుష్ణిలో వేసవిలోనూ, చలికాలంలోకూడా నీరు సమృద్ధిగా వుంటుంది. స్వచ్ఛంగా నిర్మలంగా వున్న నీళ్ళల్లో నుండి ఇసుక తళతళ మెరుస్తూ కనుపిస్తూంటుంది. పరుష్ణిలో ఈదడం మహా ఆనందంగా వుంటుంది. సరస్వతి ప్రవాహం చాలా అల్పంగా ఉంటుంది. కొంచెం తేలికైన మనిషి దూకి దాటిపోవచ్చును. పరుష్ణి అలాంటిది కాదు. దాని ప్రవాహం చాలా విశాలమైంది. ఇటునుంచి అటుకు ఈదటమే కష్టం. అలా ఈదితే బాగా వ్యాయామం చేసినట్టుకూడా అవుతుంది. పరుష్ణిమీద ఇంద్రుడికి కూడా గొప్ప దయాభావం వుంది. ఓమాటు ఇంద్రుడు ఉషాకన్యతో సరాగాలాడుతూ ఆమె రథచక్రాన్ని పరుష్ణి ఒడ్డుకు విసిరిపారేశాడని అంటారు. సరస్వతి వద్దున వేలసంఖ్యలో పశువులు ప్రోగుపడినప్పుడు ఆ పశువులకే చాలవేమో నదిలోని నీళ్ళు అనిపిస్తుంది. కానీ, పరుష్ణి వద్దున అలాటివి ఎన్నివేల పశువులు ప్రోగుపడితే మటుకేం ? అగాధమైన జల రాశి ! ఇన్నాళ్ళ తరువాత పరుష్ణి జలస్పర్శ వర్ధ్యశ్వుడిలో విచిత్రమైన ఆనందానుభూతుల్ని కలిగించింది !

తృస్తుజనం సరస్వతి తీరాన్ని విడిచేనాటికి దివోదాసుడు అరొకటం వచ్చింది. కనుక అతడి మస్తిష్కంలో సరస్వతి తీరానికి సంబంధించిన జ్ఞాపకచిహ్నాలేవీ లేవు. కానీ. పౌరవి మాత్రం సరస్వతిపై అమితమైన భక్తిశ్రద్ధల్ని కనబరుస్తూండేది. అప్పుడప్పుడూ కొడుకుతో "సరస్వతే నీకు

తల్లి, ఆమె నిన్ను మాకు ఇచ్చింది!" అంటూ వుండేది. సరస్వతీ నదికి సంబంధించిన కొన్ని గీతాల్ని (ఋక్కుల్ని) మధురమైన స్వరంలో పాడి వినిపించేది. దివోదాసు యొక్క భావాల్లో సరస్వతి నదిగాకాక దేవతగా నిలిచిపోయింది. అయితే, అతడు పెరిగి పెద్దవాడయింది పరుష్ణీ తీరంలో.

త్రసదస్యుడు అప్పుడప్పుడూ తన తల్లివెంట తృత్సుజనపు గోష్ఠల్లోకి వస్తూండేవాడు. అలాటప్పుడు బాలకులిద్దరూ కలసి ఆడుకుంటుండేవారు. కశోజుడు దివోదాసుకంటె ఏడేళ్ళు పెద్ద. కనుక వారిద్దరి ఆటల్లోనూ సమవయస్కులైన బాలకులు ఆడుకునేప్పుడు పొందే తన్మయత కను పించేది కాదు.

త్రసదస్యుడు తన ఐదవ ఏట 'కశోజు'డనే బిరుదును పొందాడు. ఐతే, 'బల్లి·బావ' సాహసంలో అతడికంటె ఏవిధంగానూ తీసిపోడు. దివోదాసు బాగా బలంగావుండి. తన వయస్సుకంటె రెండు సంవత్సరాలు పెద్దవాడిగా కనుపిస్తుండేవాడు. అతడి బలిష్ఠమైన శరీరాన్నిచూసి పౌరవి ఆనందంతో పొంగిపోయూండేది. కొడుకు పెద్దవాడయిన కొలది పౌరవిలోని దేవతలమీది విశ్వాసమూ. శ్రద్ధాసక్తులూ పెరగసాగాయి. దివోధాసు పుట్టాక, మరి మూడు సంవత్సరాలకు, పౌరవికి మళ్ళీ పుత్రసంతానం కలిగింది. పేరు సుమిత్రుడని పెట్టారు. రెండవకొడుకు పుట్టిన తరువాతకూడా దివో దాసుమీద పౌరవియొక్క ప్రేమా, వాత్సల్యాలు ఏమాత్రము తగ్గలేదు. అందుకు కారణం, దివోదాసుయొక్క శరీరసౌష్టవము, సౌందర్యమూ, ప్రతిభావ్యుత్పత్తులే అయివుంటాయి.

అప్పటికింకా, దివోదాసు, త్రసదస్యుడు తమకొరకు గుర్రాలను ఎన్నుకోలేదు. కానీ, దివోదాసుకు గుర్రాలంటే మహా మోజు! నాలుగేండ్ల వయసప్పుడే అతడోమాటు గుర్రప్పిల్లమీద ఎక్కి హార్చుని సవారీని ప్రారంభించాడు. కానీ, గుర్రప్పిల్ల నాలుగడుగులు పరుగెత్తేలోపే ఎగిరి కిందపడ్డాడు. ముఖానికి, కాళ్ళకూ, చేతులకు బాగా దెబ్బలు తగిలాయి. అయినా ఏడవలేదు. తండ్రి బయటికి వెళ్ళేప్పుడు ఆయుధాల్ని ధరించి వెళ్ళడం చూసి తనకూ ఆయుధాల్ని ఇవ్వమని పట్టుపట్టా డోమాటు! దివోదాసు పట్టు పట్టాడంటే, తను అనుకున్న పని జరిగితేగాని విడువడు. అతడికి ఓ చిన్న రాగి శిరస్త్రాణాన్ని, చిన్ని విల్లు, - అంబుల్ని, ఓ చిన్ని

కరవాలాన్నీ చేయించి యిచ్చారు! ఈ ఆయుధాల్ని ధరించి ఆతడో చిన్న వర్ధ్యశ్వుడిలా తయారయ్యేవాడు.

వర్ధ్యశ్వుడు ముఖ్య పురుజనానికి రాజుకాడు. అయినప్పటికీ వ్యక్తిగతంగా గొప్ప పరాక్రమవంతుడు కావడంవలన, మొత్తం సప్తసింధులో ప్రసిద్ధి వహించాడు. వర్ధ్యశ్వుడు కేవలం పరాక్రమవంతుడే కాదు. గొప్ప నేర్పరియైన సేనానాయకుడు కూడాను. పైగా, సమస్త ఆర్యగణాల అభివృద్ధికి సతతం ప్రయత్నిస్తూ వుండేవాడు. ఆర్యజనాల్లోని అంతర్యుద్ధాల్ని నివారించడానికి, పరస్పర సహృద్భావాన్ని పెంపొందించడానికి అతడెంతగానో ప్రయత్నంచేశాడని చెప్పవచ్చు. వెనక తృత్సుగణపు రాజకులం అంతగా చెప్పుకోదగిన స్థితిలోలేదు. కానీ, వర్ధ్యశ్వుడికి నాయకత్వం వచ్చాక తృత్సుగణం గొప్ప అభివృద్ధిని సాధించింది. తృత్సుగణపు ఈ అభివృద్ధి అన్య ఆర్యగణాల్లోనూ, ఆర్యశాఖల్లోనూ ఈర్ష్యా, అసూయలకుకూడా కారణమైంది. తృత్సుగణం ఈవిధంగా అభివృద్ధి పొందడం, వర్ధ్యశ్వుడి కీర్తి దశదిశలా వ్యాపించడం మూల పురుగణానికే గిట్టదు. తనలోని ఒకశాఖ, తన స్థానాన్ని ఆక్రమించేస్థితికి రావడం పురుగణం ఎన్నటికీ సహించదు: కాగా, తుర్వసు, యదు, అను (మను), ద్రుహ్యు మొదలైన ఆర్యగణాలుకూడా తృత్సుగణాన్ని చిన్నచూపు చూడాలనీ, ప్రస్తుతం ఆ గణం పొందుతూన్న అభివృద్ధిని నిర్లక్ష్యంచేయాలనీ ఎంతగానో ప్రయత్నించేవి. కానీ, వర్ధ్యశ్వుడి ప్రవర్తనలోని గొప్పతనం వారి ఆశయాన్ని నెరవేర్చేదికాదు. వర్ధ్యశ్వుడు ఇతర ఆర్యగణాలతో గర్వంగా, తను ఓ గొప్ప వీరుడన్నట్లు ప్రవర్తించేవాడు కాదు. అందరిపట్లా సమభావాన్ని ప్రదర్శించేవాడు. అందరితో సోదరుడుగా, బంధువుగా, మిత్రుడిగా వ్యవహరించేవాడు. కనుకనే ప్రతి ఆర్యగణమూ తమలోని ఈర్ష్యాభావాన్ని అణచుకొని, హృదయ కవాటాల్ని తెరచి అతడికి ఘనంగా స్వాగతాన్ని చెప్పేది: రోజూ పందలకొలది అతిథులు అతడి ఆతిథ్యాన్ని పొందుతూ వుండేవారు. తన స్వభావంలోని సహజ సౌజన్యంవల్ల శత్రువునుకూడా క్షణంలో మిత్రుణ్ణి చేసుకునేవాడు. దివోదాసుకూడా తండ్రిలోని ఈ సమస్త సద్గుణాలనూ అలవరచుకుంటూ పెరుగుతున్నాడు!

చలికాలంలో వర్ధ్యశ్వుని గోత్రం (గోష్ఠి - గోశాల) ఇదే.

(కాలక్రమంలో మానవ సముదాయానికికూడా అర్థాన్నిచ్చే శబ్దంగా మారి పోయింది) ఉత్తరదిశగా ప్రయాణించి, బృహత్పర్వతానికి అనతిదూరంలో నివాసా న్నేర్పరుచుకుంది. దూరంగా కనుపించే, సుశ్వేత హిమవత్పర్వ తాల్ని గురించి, దివోదాసు తండ్రి నడుగుతూండేవాడు. అసలు అతడికి చాలా సంవత్సరాల వరకూ పర్వతాల్ని చూసే అవకాశమే దొరకలేదు. మాతృకులమైన భరతగణ నివాసభూమిలో పర్వతాలులేవు. ఉత్తరపు సరి హద్దున బృహత్పర్వల శ్రేణులున్నా, వాటినిచూసే సదవకాసం ఇంతక్రింతం అతడికి లభించలేదు. మొదటగా పర్వతాల్నిచూసి అవీ మేఘాలేనని భ్రమ పడ్డాడు. అప్పుడు పౌరవి కౌతుకుతో "అవి మేఘాలుకావు. పర్వతాలు. మేఘాలు నీళ్ళతో నిండివుంటాయి! పర్వతాలు రాళ్ళతో నిండివుంటాయి!" అని చెప్పింది. తరువాత ప్రతి చలికాలంలోనూ అతడు బృహత్పర్వత ప్రాంతానికి వస్తూండసాగాడు. అనేకసార్లు ఆ పర్వతాల్లోకి వెళ్ళాలని కూడా అతడు అనుకున్నాడు. కానీ, తల్లీ దండ్రీ వద్దని వారించారు. ఆ పర్వతాల్లోకి ఎందుకని వెళ్ళరాదు? ఆ పర్వతాల్లో వుండి, తమని భయపెడుతున్న వస్తువేమిటి? ఎంత ఆలోచించిన దివోదాసుబుర్రకు అంతు పట్టింది కాదు. ఇదే విషయాన్ని ఓమాటు తల్లి నడిగాడు. "ఆ బృహత్పర్వతాల్లో గంధర్వులు, అప్సరసలూ వున్నారు!" అని చెప్పింది. గంధర్వులూ, అప్సరసలూవుంటే ఇక భయపడాల్సిన పనేముంది? గంధర్వులూ, అప్సరసలూ భక్తులపై దయచూపుతారేగాని, కీడుచేయరుగా? మరోమాటు తల్లి "బృహత్పర్వతాల్లో పిశాచాలు కూడా వున్నాయని" చెప్పింది. పిశాచాలు మానవుల్ని చంపి తింటాయని కూడా చెప్పింది! చాలా రోజులవరకూ పిశాచాలంటే ఏమిటో అతడికి అర్థంకాలేదు. రూపు రేఖల్లోనూ, శరీరపు రంగులోనూ, ఆర్యులతో ఏమాత్రం కలవని అన్య జాతీయుల్ని అతడు చూచాడు. బూడిదవర్ణపు పణి జాతీయులు, నల్లని నిషాదులూ అతడి కుటుంబంలోనే వందల సంఖ్యలో దాసులుగా వున్నారు. తన తల్లి పుట్టింట్లో కిరాతబాలికను చూశాడు. ఇప్పుడామె జవ్వని అయింది. కానీ, ఆ పిశాచజాతి వీళ్ళలో ఎవరికీ చెందదు. అసలు పిశాచజాతి మానవజాతి కాదు. కనుక పిశాచాలు ఎలావుంటాయనేది దివోదాసుయొక్క ఊహలకు అందని విషయం. పిశాచుల ఆకారాల్ని తన మనో

పలకంపై చిత్రించుకోడానికి ప్రయత్నించి కూడా అత డెన్నోసార్లు విఫల మనోరథుడయ్యాడు. ఎలాగయినా పిశాచాల్ని చూడాలని అత డనుకున్నాడు. ఐతే, అవి తమ మధ్యకూడా తిరుగుతుంటాయని, తల్లీ, దండ్రి అతడికో చెప్పలేదు. ఇలాటి విషయాలు అతడికో చెప్పి, అతడి ధైర్యాన్ని చెదరగొట్టడం, ఆ విధంగా అతడిని పిరికివాణ్ణి చేయడం వారికి ఇష్టంలేదు :

ఆ చిన్న వయస్సులో దివోదాసుడు వేటకువెళ్లే అవకాశం వుండదు అయినా, ఎప్పుడూ ధనస్సూ, బాణాల్ని తగిలించుకుని తిరుగుతూండేవాడు. ఎక్కడయినా, ఎప్పుడయినా ఏ నక్కో కంటపడితే, బాణాన్ని వదుల్తూండే వాడు. అంత చిన్నతనంలోనే మంచి గురిగా బాణాల్ని వేస్తూండెవాడు! అతడి బాణాలకు అంతగా పదునుపెట్టబడి వుండేవికావు. కనుక ఆ దెబ్బ లక్ష్యానికి తగిలినా మృగం పడేదికాదు. మృగం పడకపోతే ఏం? బాణం లక్ష్యానికి తగిలింది! అదే అతడికి పరమానందం!



# అశ్వోత్సవం

"ధన్వనా గా ధన్వనాజిం జయేమ"

(1205 క్రీ॥పూ॥)

అది వసంత ఋతువు. పరుష్ణిలోని నీరు గాఢ నీలవర్ణానికి తిరిగింది. ప్రవాహం వర్షఋతువంత విస్తృతంగా లేకపోయినా మొత్తానికి విశాలంగా, ఉధృతంగా ప్రవహిస్తోంది. ఉభయ తీరాల్లోనూ దూరాలవరకూ బంగారు రజనులా మెరిసే ఇసుక పరచుకునివుంది. తరువాత ఏపుగాపెరిగిన పచ్చని పచ్చిగడ్డితో కనులకు హాయినిగొల్పుతోన్న సమతల భూమివుంది. అనంతరం దట్టమైన అడవి. అశ్వోత్సవం కొరకు అడవిని నరికి ఒక యోజనం పొడవు. ఒక క్రోసు వెడల్పాకల మైదానా న్నొకదాన్ని తయారు చేశారు. ఈ మైదానం కేవలమూ, ఆ సంవత్సరపు ఉత్సవంకొరకే కాదు. ప్రతి సంవత్సరమూ అక్కడే ఈ అశ్వోత్సవం జరుగుతూవుంటుంది; ఈ అశ్వోత్సవంలో ఒక్క పురుజనంలోని అంతర్‌శాఖలే కాకుండా, యదు, తుర్వశు, అను, ద్రుహ్యు మొదలుగాగల అన్య ఆర్యగణాలూ వాటి సమస్తశాఖలూ, ఉపశాఖలూ కూడా పాల్గొంటాయి. ఆర్యగణాలన్నీ తమ పశుధనాల్తోటివచ్చి అడవిలో చాలా దూరాలవరకూ తాత్కాలిక నివాసాల్ని ఏర్పరచుకుంటాయి. పశువులే వాళ్ళకు సర్వస్వం. పశువుల్ని ఇచ్చి తమకు

కావాల్సిన అన్నివస్తువుల్ని తీసుకుంటూ (కొనుక్కుంటూ) వుంటారు. ఉత్సవం జరిగే ముఖ్యస్థానం. శుభ్రం చేసిన మైదానమే అయినా ఆర్యుల నివాసాలు మాత్రం అరణ్యంలో చాలా దూరాల వరకూ వ్యాపించాయి. ఉత్సవం ఆ రోజు ఉదయం నుండే ప్రారంభమైంది. కానీ మల్లి యుద్ధాలూ, ముష్టియుద్ధాలూ, రథోత్సవం, స్త్రీ పురుషుల నృత్యగాన విశేషాలు - ఇవన్నీ మధ్యాహ్నానంతరమే జరుగుతాయి.

ప్రాతఃకాలంలో యువకులందరూ ఉషాస్తుతిలో పాల్గొంటారు. ఈ పరుష్ణియొక్క ఎడమ తీరంలోనే సూర్యుడు ఉషాకన్యయొక్క రథచక్రాన్ని విరిచి పారేశాడు. ఆ విరిగిన రథచక్రమంటే ఉషాకన్యకు ఎంతో మమకారం. ఆ రథచక్రం పతనమైన పరుష్ణియొక్క ఎడమ తీరమంటే ఆర్యులకు ఓ పుణ్యక్షేత్రంతో సమానం. సూర్యుని ఎర్రని గోళం సగం పైకి వచ్చేసరికి, వనస్థలి అంతా ఉషాస్తుతిలో ప్రతి ధ్వనించిపోతూ వుంటుంది. తరువాత తమతో తెచ్చుకున్న అగ్నిని ప్రజ్వలితంచేసి ప్రతి ఆర్యగణమూ, ప్రతి ఆర్యశాఖా అగ్నిహోత్రాన్ని, సంతృప్తి పరచడంలో లీనమైయుంటుంది. అగ్నికొరకు సిద్ధపరచిన, పురాడోస్* సోమరసం మొదలైన హవనీయాల్ని స్వీకరించేవారు. ఈ హవనకార్యం సమాప్త మయ్యాక ఎవరి పనుల్లో వారు నిమగ్నులయ్యే వారు. పశువులు విశాలమైన అరణ్యంలో, వేల సంఖ్యలో, మేత మేయడానికి వెళ్ళిపోతాయి. అశేషంగా వుండడం వల్ల ఒక గోత్రానికి సంబంధించిన పశువులు: మరో గోత్రపు పశువుల్లో కల్సిపోవడం కద్దు, అలాటిదేమీ జరక్కుండా వుండడానికి పశువుల పిరుదుల మీద రకరకాలైన గుర్తులూ వేసేవారు!

ఆర్యుల పశువులన్నీ ఆరోగ్యంగా, బలంగా, గొప్ప శరీరపాటవంతో విలసిల్లుతూ వుంటాయి. కానీ, గోవుల విషయంలో భరత, కుశిక, శాఖలు ఇతర ఆర్యగణా లన్నింటికంటే ముందున్నాయి. గుర్రాల విషయంలో, పక్తుగణం, (పఠాన్) భలానస్‌గణం, మంఘూరి, అలినీ మొదలైన గణాలు - చాలా అభివృద్ధిలోవున్నాయి. గణాల అశ్వసమూహాలు

* పురాడోస్ - తలకాయమాంసంలో యవలపిండి కలిపి తయారుచేసిన పదార్థం: ఇంద్రుడికి, అగ్నికి హవనీయంగా సమర్పిస్తారు.

చూడముచ్చటగా వుంటాయి. వీరి గుర్రాలు చేయిమెత్తితే అందని మహా కాయాల్ని కలిగివుంటాయి. వాటియొక్క శరీర పాటవాన్నీ, వడ్డూ పొడు గుల్నీ చెప్తే ఎన్నడూ చూడనివారు విశ్వసించడంకూడా కష్టమే! వాటిని చూడడానికి ప్రజలు సదా గుంపులుగూడుతూ వుండేవారు.

ఈ అశ్వోత్సవం సప్తసింధులోని ఆర్యులందరికీ సంబంధించినది. ఐతే సప్తసింధులో ఒక్క ఆర్యులేకాదు వుండడం, పణిజాతీయుల సమృద్ధ మైన నగరాలుగూడా వున్నాయి. గొప్ప ఆర్యుడైన (ధనికుడైన) పణి జాతీయుడుకూడా, అతి సాధారణుడైన ఆర్యుడిముందు తలవంచేస్తుంటాడు. పణులు అకారణంగానే హింసింపబడుతూ వుంటారు. ఎన్ని హింసలనైనా అనుభవిస్తూ 'కిం' అనకుండా వుండవల్సిందేగాని ఎదురు మాట్లాడ డానికి వీలులేదు. ఆర్యుల 'శాసనం' క్రింద వుంటున్నారాయె మరి! ఆర్యులు పణులకంటే ఎంతో వెనుకబడి వున్నారని చెప్ప వచ్చు! పణులు ఋతువుల్ని అనుసరించి వస్త్రధారణ చేస్తుంటారు. గ్రీష్మ ఋతువులో, నూలువస్త్రాల్ని ధరిస్తుంటారు. నూలువస్త్రాల్ని ఆర్యులు చాలా హీనదృష్టితో చూస్తుంటారు. చలికాలంలో గాంధారదేశపు గొర్రెల కోమలమైన ఉన్నితోవ స్త్రాలను నేసుకుని, కంచుకాలను తయారుచేసుకుని ధరిస్తూంటారు. పణుల్లో చాలామంది బీదలు. అమాయకులూను! ఎంతో మంది పణులు ఆర్యుల ఇండ్లల్లో బానిసలుగా వుంటూవుంటారు. ఈ బాని సల జీవితం పశు జీవితం కంటె అధమంగా ఉంటుంది. ధనికుడైన పణియొక్క సర్వసంపదలనూ దోచుకొనే హక్కు తమకు సహజంగా జన్మతః లభించినట్టు ఆర్యులు భావిస్తూంటారు. అయితే పణులను సర్వ నాశనం మాత్రం చేయరు ఆర్యులు. అలా పణుల్ని నాశనం చేస్తే ఇక వారు వ్యాపారాన్నీ, వ్యవసాయాన్నీ చేయలేరు. పణులు పణనం (వ్యాపారం) చేయడం వలన ఎక్కువగా లాభించేది ఆర్యులకే! ఈ విధంగా పణుల పణనానికి అభ్యంతరం కలిగించడమో, లేక వారిని నాశనం చేయడమో జరిగితే ఆర్యులే నష్టపోతారు! ఆర్యులు పశుపాలన, యుద్ధం - ఈ రెండే తమకు ఉచితమైన వృత్తిగా భావిస్తారు. అయినా వెండి బంగారాల్ని మణులనూ, ముత్యాలనూ, ధరించడం నేర్చుకున్నారు. ప్రత్యేకం రాజులూ, రాజకుమారులూ బహు మూల్యమైన కర్ణభూషణాలను ధరించడం

నేర్చారు. హిరణ్యవక్షు లయ్యేవారు. (బంగారు ఆభరణాలను గుండెలమీద ధరించేవారు) పణి శిల్పకారులు అద్భుతమైన నైపుణ్యంతో. బంగారు పోగులువేసి, ముత్యాలు వ్రేలాడదీసి చర్మ ఉన్ని కంచుకాలను తయారు చేసేవారు. వాటిని రాజకుమారులూ, ఆర్యవీరులూ చాలా ఇష్టంగా ధరించే వారు. ఆర్యస్త్రీలుకూడా మణులు, ముత్యాలు పొదిగిన పాపటసేరులను ఎంతో కష్టంగా వుందేవారు. అయితే, అలాటి పాపటి సేరులను ధరించే అదృష్టం అందరి ఆర్యస్త్రీలకు వుండదనేది వేరు విషయం: ఆ భూషణాలేకాకుండా ధాతు పాత్రలూ, అస్త్ర - శస్త్రాలూ, రంగు రంగుల ఉన్నివస్త్రాలూ, ఇంకా అనేక విలాస వస్తువులూ ఈ పణి జాతీయులనుండే ఆర్యులకు లభిస్తుంటాయి! అవుసరంవస్తే పణుల పశుల మందలుకూడా ఆర్యులవే! కనుక పణులు తమ వ్యాపార వ్యవసాయాల్ని చేసుకోవడానికి వీలులేని పరిస్థితుల్ని ఆర్యులు కల్పించరు. వారిని పూర్తిగానూ నాశనం చేయరు. అది ఆర్యుల స్వార్థానికే దెబ్బ!

ఆర్యులు సామాన్యంగా తమ భోజనాన్నే స్వీకరిస్తూ వుంటారు. కానీ, రుచిపరివర్తన కొరకు పణుపద్ధతిలోకూడా భోజనాన్ని తయారు చేసుకుంటూ వుంటారు. ఉత్సవం రోజునకూడా పణులు అనేకరకాలైన భోజ్య పదార్థాలను విక్రయిస్తూన్నారు. మంచి సురా అక్కడే అమ్ముతారు. ఆర్యులూ సురాపానం చేస్తారు. అది వారికి నిషిద్ధమేమీ కాదు. కానీ, ఆర్యులకు ఇష్టమైన పేయం సోమం (భంగు): సోమరసాన్ని తయారు చేయడంలో ఆర్యస్త్రీలకున్న నైపుణ్యం పణిస్త్రీలకు లేదనేచెప్పాలి! సోమరసం మీద ఇంత మమత, సురమీద ఇంత తిరస్కారం ఎందుకో ఆర్యులకు? సురా: సోమరసాలు రెండూ మత్తుపదార్థాలే! వీటిని సేవించడం 'మత్తు' కొరకే అయినప్పుడు, ఒకదానిమీదమమత మరోదానిమీద తిరస్కారమూఎందుకో? పైగా సుర కొద్ది మోతాదులలోనే గొప్ప నిషా నిస్తుంది. కాని, రుచిలో మాత్రం సుర, సోమరసంకంటే ఘాటుగా వుంటుంది. బహుశ సురలోని ఈ ఘాటువల్లనే ఆర్యులు సురను తిరస్కరించి, సోమపానానికి అలవాటు పడ్డారేమో! కొంత అభ్యాసంవల్ల సురాపానంలోని ఘాటుకు అలవాటు పడవచ్చు. కానీ, మధుర, మిశ్రితమైన సోమరసాన్ని సేవించడానికి

ఏ అభ్యాసంతోటీ పనిలేదు. సోమరసం సహజంగానే రుచిగానూ, మత్తుగానూ వుంటుంది.

ఆర్యులు అవసరమైతే తమ పశువుల్ని అమ్ముతూ వుంటారు. కాని అలా పశువుల్ని అమ్మడం సామాన్యంగా జరుగదు. ఒక్కసారి భారీ ఎత్తున ఆయుధాలనో, మరి ఇతర వస్తువులనో కొనవలసివచ్చినప్పుడు మాత్రమే పశువుల్ని అమ్ముతారు. సాధారణంగా వస్తువాహనాదికాల్ని కొనడమనేది అశ్వోత్సవంరోజునే జరుగుతుంది. ఏడీరోజుల్లో ఏవైనా వస్తువు అవుసరమైతే, తామ్రఖండాలను మారకపుద్రవ్యంగా వాడుతుంటారు. తామ్రఖండాల తూకమూ, విలువా మొదటే నిర్ధరింపబడి వుంటాయి. పణులే తామ్రఖండాల్ని మారకపు ద్రవ్యంగా ప్రవేశపెట్టారు. వాటి తూకాల్ని, విలువల్నీ నిర్ధారణచేశారు. వారినుండే ఆర్యులు తామ్రఖండాల వాడకాన్ని నేర్చుకున్నారు. ఆర్యులు 9 వరకూ లెక్కించి, తిరిగి ఒకటినివేసి '0' శూన్యబిందువు నుంచుతారు. లెక్కించడంలోకూడా వారికి పదులసంజ్ఞే ముఖ్యం. పది (దశం)ని లెక్కించాక, ఒక్కసారిగా 'ద్వాదశా'నికి వెళ్తారు (పదకొండును లెక్కించరు.) 'ద్వాదశం' 12 ను లెక్కిస్తారు). రెండవసారి పదిని చేర్చి ద్విదశం, మూడవసారిచేర్చి 'త్రిదశం' ఇలాగే పదులను చేర్చుకుంటూ, శత-సహస్రాల వరకూ లెక్కిస్తారు. పణులు రెండు రెట్లు నాలుగు రెట్లు, ఒక పదహారు, రెండు పదహార్లూ, నూట పదహార్లూ వేయిన్నూట పదహార్లూ - ఇలా లెక్కించుతారు. క్రయవిక్రయాల్లో వాడే 'అర్ధ' 'పావు' మొదలైన లెక్కింపును కూడా పణులే ఆర్యులకు నేర్పారు. అశ్వోత్సవం ముఖ్యంగా ఆర్యుల ఉత్సవమే అయినా, అక్కడి అంగళ్ళన్నీ పణులవే!

త్రసదస్యుడికి ఇప్పుడు 18 ఏళ్ళువెళ్ళి 19 వ ఏడు రాబోతూంది. మామగారి ఆధ్వర్యాన జరిగే ఈ ఉత్సవానికి అతడు వెళ్ళకుండా ఎలా వుండగలడు? తన తండ్రికి (పురుకుత్సుడికి) బావమరిది యొక్క ఈ అభివృద్ధీ, గౌరవమూ ఏమాత్రమూ గిట్టవు. పురుగణానికి రాజు అయిన కారణంవలన, మరి ఏఇతర ఆర్యవీరుడూ, తనంతవాడై పేరు ప్రతిష్ఠల్ని పొందడం పురుకుత్సుడికి ఇష్టం వుండదు. వర్ధశ్యుడు గొప్ప స్నేహభావమూ, కలుపుగోలుతనం గలవాడవడంవలన, బండిని ఎలాగో

లాక్కు వస్తూన్నాడు. లేకపోయినట్లయితే బావ బావమరదులకి ఏనాడో చెడిపోయేది! వర్ధ్యశ్వుడు తన జ్యేష్ఠపుత్రుడు దివోదాసుని ప్రేమించినట్టుగానే బావమరిది కొడుకయిన త్రసదస్యుణ్ణి ప్రేమించేవాడు. త్రసదస్యుడిప్పుడు పూర్తి యవ్వనుడయ్యాడు. ఆర్యరాజకుమారుడు నిర్వహించవల్సిన సమస్త విధుల్ని ఆచరించే సమర్థత వచ్చింది అతడికి! కానీ దివోదాసు అప్పటికింకా బాల్యదశలోనే వున్నాడు. శరీరపు వద్దూ పొడవూ అతడి వయస్సుకంటె పెద్దవాడని భావించేటట్టు చేసేవి.

త్రసదస్యుడు, దివోదాసు - ఎప్పుడూ కలిసి తిరుగుతుంటారు! గుర్రాలంటే ఇద్దరికీ మహాయిష్టం! పఖ్తగణపు (పఠాన్) గుర్రాలు సర్వశ్రేష్ఠమైనవని అంటారు. అంతవరకు వాళ్ళు పఖ్తగణపు ఉత్తమ జాతి గుర్రాలను చూడలేదు. ఆరోజు త్రసదస్యుడూ, దివోదాసు పఖ్తరాజకుమారు ణ్ణెవణ్ణయినా కలుసుకుని, వారి ఆవాసానికి వెళ్ళి, వాళ్ళ గుర్రాలను చూడాలనే ఉద్దేశంతో బయల్దేరారు.

పఖ్తగణపు నివాసాలు చాలా దూరాలవరకూ వ్యాపించివున్నాయి. పఖ్త రాజకుమారుడి నివాసాన్ని అంతగా వెతకవలసిన పని కలగలేదు. దివోదాసు, త్రసదస్యుడు అరుణాశ్వాల్ని అధిరోహించి, పఖ్తరాజకుమారుని వాసంవద్దకు వెళ్ళారు. ప్రక్కనేఉన్న ఒకచెట్టుకు తమ అశ్వాలనుకట్టి ఇద్దరూ ఆవాసంలోకి వెళ్ళారు. వాళ్ళ రూపురేఖలూ, వస్త్రాభరణాలూ, ఆర్యరాజ కుమారులని చెప్పేస్తున్నాయి. రాజకుమారులకు కానీ, లేక సామాన్య పురుషులకుగానీ ఆర్యులు ఒకేరకమైన ఆదరాభిమానాల్ని చూపుతారు. ఆర్య రాజకుమారులుకూడ తమకంటె పెద్దవారిపట్ల ఆదరాన్ని ప్రకటించ వలసినప్పుడు రాచరికపు హోదాలను మరచిపోతారు. వినమ్రులై తలవంచి నమస్కరిస్తారు! త్రసదస్యుడు ఆవాసం ఎవరిదో అడిగి తెలుసుకున్నాడు. అది పఖ్తరాజకుమారుడు రోహిదశ్వుడి నివాసం. కొంత జనసమూహంతో తన ఆవాసంవైపు వస్తూన్న ఆర్యరాజకుమారు లిద్దరికి, రోహిదశ్వుడు ఘన స్వాగతాన్నిచ్చాడు. త్రసదస్యుడు రెండడుగులు ముందుకు వేసి, తలవంచి, నమస్కరించి, తమ పరిచయాన్నిచ్చాడు. తాను పురుకుత్సుని కొడుకుననీ, దివోదాసు వర్ధ్యశ్వసూనుడని తెలియపరచాడు. రోహిదశ్వుడు మొదటగా త్రసదస్యుణ్ణి గాఢాలింగనం చేసుకుని, అతడి మూర్ధాన్ని ఆఘ్రాణించాడు.

తరువాత దివోదాసుని ఎత్తుకుని అతడి బుగ్గలను ఎన్నోమార్లు ముద్దుపెట్టుకున్నాడు. మూర్ధాన్ని ఆఘ్రాణించాడు.

అనంతరం త్రసదస్యుడు "ఆర్యా! మేము పఖ్తు ఆర్యుల దర్శనాన్ని కోరి ఇక్కడికి వచ్చాము!" అన్నాడు. తృస్తు రాజవంశపు అతిథులం మేము. భ్రాతృతుల్యుడైన వర్ధష్యుడు మా సుఖ-సంతోషాలకు అవసరమైన వివిధ ఏర్పాట్లనూ చేశాడు: మా గోవులూ, అశ్వాలూ మాతృభూమిలో ఎలా స్వేచ్ఛగా విహరించేవో ఇక్కడా అలాగే విహరిస్తున్నాయి! మా స్త్రీ పురుషులుకూడ తమ మాతృభూమిలోలాగే ఇక్కడా సుఖిస్తున్నారు!"

"అయితే, ఆర్యా! పఖ్తుభూమికూడ తృస్తుభూమిలాగే వుంటుందా?" త్రసదస్యుడడిగాడు.

నిలబడే మాట్లాడడం రోహిదష్వుడికి నచ్చలేదు. అతిథులిద్దరినీ చేతులుపుచ్చుకుని తన పర్ణశాలలోకి తీసుకునివెళ్ళాడు. అది క్రొత్తగా వేసుకున్న పర్ణశాల. పర్ణశాలకు ఉపయోగించిన ఆకులు ఇంకా పచ్చిగానే వున్నాయి. లోపల రోహిదష్వుడి భార్య, పెద్దకొడుకు, కూతురూ వున్నారు. నూతనుల్ని లోపలివారు సగౌరవంగా ఆహ్వానించారు. త్రసదస్యుడు తమ నామాన్ని, గోత్రాన్ని తెల్పుతూ రోహిదష్వుని భార్యకాళ్ళకు నమస్కరించాడు. దివోదాసుకూడా, త్రసదస్యుణ్ణి అనుకరించాడు. రోహిదష్వుని భార్య ఇద్దరి మూర్ధాలనూ ఆఘ్రాణించి ఆశీర్వదించింది. అతిథుల్ని కంబళి పరిచి కూర్చోబెట్టింది. పగణపు స్త్రీ పురుషులు చాలామంది అతిథుల్ని చూడడానికి పర్ణశాలలోకివచ్చికూర్చున్నారు. పఖ్తులుకూడా (పఠానులు) తమలాగానే ఆర్యులేనని త్రసదస్యుడికి, దివోదాసుకూ తెలుసును. పఖ్తు గణపు ప్రజలకేశాలుకూడా అన్య ఆర్యుల్లాగానే బంగారు రంగులో వున్నాయి. కాకపోతే, కొంతమంది వెంట్రుకలు మాత్రం తెల్లగా వెండిలా మెరుస్తున్నాయి. కండ్లుకూడా నీలిరంగులో వున్నాయి. పఖ్తు ఆర్యులు పురు ఆర్యులకంటె దీర్ఘకాయులూ, అధిక శరీరబల సంపన్నులు! పురుగణ ఆర్యుల్లాగానే పఖ్తు ఆర్యులుకూడా అధోవస్త్రాన్ని, చర్మ కంచుకాన్ని, ఉష్ణీషాన్నీ (తలగుడ్డ - శిరస్త్రాణం)ధరిస్తారు. ఐతే, పఖ్తు ఆర్యుల వస్త్రధారణ మొదలైనవాటిలో సహజత్వము నిరాడంబ

రత అధికంగా వున్నాయి. రోహిదశ్వుడి చర్మకంచుకంలో బంగారు బోగుల పనితనం ఏ మాత్రంలేదు. అతటి ఉష్ణీషానికి మృదువైన ఉన్నితో నేసిన పట్టీ ఒకటి చుట్టివుంది. అంతకుమించి ఆడంబరం ఏమీలేదు. రోహిదశ్వుడికి యాభై ఏళ్ళుంటాయి. పొడుగాటి గడ్డంలోని పచ్చని వెంట్రుకల్లో కొన్ని తెల్లబడడం తప్ప శరీర పాటవంలో వచ్చిన మార్పేమీలేదు. మంచి ఆరోగ్యంగా, బలంగావుంది శరీరం! పక్తుస్త్రీలు అతిథుల్ని ఇద్దరినీ తదేకంగా చూస్తున్నారు. నూతనులిద్దరూ అతి సుందరులు అన్నది సుస్పష్టం! పైగా ఇద్దరూ తూర్పు ప్రాంతపు (సప్తసింధు) ప్రభావశాలురైన రాజుల పుత్రులనికూడా వారికి తెలుసు. పురుగణాన్ని పక్తుగణంకూడా చాలా ఆదర భావంతో చూస్తుంది. పణులతోటీ, క్రూరులైన అధికసంఖ్యా బలం కలిగిన కిరాతకుల్తోటీ పురుగణం సదా సంఘర్షిస్తుంటుందనికూడా వాళ్ళకు తెల్సును.

రోహిదశ్వుడు సంభాషణను ప్రారంభించాడు.

"పక్తుగణం ఇక్కడికి చాలా దూరంలోవుంది!" అన్నాడు.

"కానీ, స్నేహం దూరాన్ని దూరం చేస్తుంది!" త్రసదస్యుడన్నాడు.

"అవును. మన నరాల్లో ఒకే రక్తంప్రవహిస్తోంది. ఏకరక్త సంబంధీ కులం, దూరం మన స్నేహాన్ని దూరంచేయలేదు!"

త్రసదస్యుడు ఇలా అన్నాడు: "మేము ఆర్య భూమికి తూర్పుకొసన వున్నాము. తమరు ఆర్యభూమికి పశ్చిమ కొసనవున్నారు....!" త్రసదస్యుడి మాటల్ని మధ్యలోనే ఆపి "అది సరికాదు నాయనా! తూర్పున పురుగణంతో ఆర్యభూమి అంతమయ్యేమాట నిజమేగాని, పశ్చిమాన పక్తుగణంతో సప్తసింధు అంతమౌతుందేమోగానీ, ఆర్యభూమి మాత్రం అంతంకాదు. మాకు పశ్చిమంలోకూడా ఇంకా గణాలున్నాయి!" అన్నాడు రోహిదశ్వుడు.

"ఐతే మీకు పశ్చిమంగాకూడా ఇంకా ఆర్యులున్నారా?"

"అవును. మాకు చాలా దూరంలో, ఉత్తరదిశన పురుగణం వుంది. పశ్చిమోత్తరంగా పృధుగణం వుంది. ఈ పృధుగణంలోని కొన్నిశాఖలు ఇప్పుడు సప్తసింధులోనే నివసిస్తున్నాయికూడాను. మాకు పశ్చిమోత్తరంగా వున్న పృధుగణపు భూమినిచూశాను. కానీ, కురు భూమిని చూసే అదృష్టం ఇంతవరకూ కలుగలేదు!"

"మరి పశ్చిమంలో, సుందూర ప్రాంతాల్లో నివసించే ఆర్యులుకూడా మనలాగానే వుంటారా ?"

"దేశగతమైన భేదాలు కొన్ని తప్పనిసరిగా వుంటాయి :"

త్రసదస్యుడు "అవునులే. మేమంతా పురుసంతానమే అయినా, తృత్సు. భరత, కుశిక – ఈ శాఖల్లో పరస్పరం కొన్ని భేదాలున్నట్లు, ఒక్కో శాఖ ప్రజలు ఒక్కో పద్ధతిలో, కేశాలంకరణ, కేశబంధనా చేసుకుంటూంటారు. కొంతమంది తమ కేశాల్ని కుడిప్రక్కకు ముడివేసుకుంటారు. కొంతమంది ఎడంప్రక్కకు, మరికొందరు జుట్టును పైకి ముడివేసుకుంటూ వుంటారు. ఈ జుట్టుముళ్ళను చూసే మేము ఎవరు ఏ శాఖకు చెందారో తెల్సుకుంటాము :" అన్నాడు.

"అవును, అంతే : పశ్చిమానికి పోయినకొలది ఆర్యులు నిరాడంబర దుస్తుల్ని ధరిస్తూంటారు. వాళ్ళ కేశబంధనాలు మా జుట్టుముళ్ళకంటె చాలా పెద్దవిగా వుంటాయి. అంటే అసహ్యంగా, అసభ్యంగా వుంటాయనుకునేరు ? వారూ మాలాగానే జుట్టుముడికి చుట్టూ ఉన్నిపట్టీ నొకదాన్ని చుడతారు. ఇక్కడ, అంటే తృత్సుభూమిలో, హిమపాతం జరగదు. ఒకవేళ ఎప్పుడైనా మంచుపడ్డా అత్యల్పంగా పడుతుంది. అక్కడ, కురుభూమిలో అలా కాదు. ప్రతి సంవత్సరమూ హిమపాతం జరుగుతుంది. అదీ ఎలా ? అతి భయంకరంగా ? భూమికి పైన రెండువారలఎత్తున మంచు గడ్డకట్టుకుని వుంటుంది : కురుభూమికి మరోపేరు తుషార (తోఖార్) భూమి : అక్కడ చలికాలపు నాలుగు నెల్లూ, చెట్లూ, చేమలూ అన్నీ ఆకుల్ని రాల్చేసి మోడులయిపోతాయి. భూమి పాలలాటి తెల్లని మంచుతో కప్పబడి, మహాశ్వేత అనిపించుకుంటుంది. చలి ఎక్కువగావున్న కారణంగానే, అక్కడి ఆర్యులు స్నానం చేయరు. కానీ, ఇక్కడి ఆర్యులు, మమ్మలను గురించి, మాకు పైనవున్న ఆర్యుల్నిగురించి ఏ మనుకుంటారో తెలుసుగా? పక్షులు స్నానం చేయరనీ, వారి శరీరం వాసన కొడుతూంటుందనీ అనుకుంటారు : "

"లేదు ఆర్యా అలా అనకండి, మిమ్మలను గురించి మేము అలా అనుకోము :"

రోహిదశ్వుడు నవ్వుతూ " తూర్పుఆర్యులు మధుర భాషులు :" అన్నాడు.

"మధుర భాషణను, అసత్యభాషణగా భావించరనుకుంటాను !"

తన మాటలవల్ల సూతనుల మనస్సులు బాధపడ్డాయని రోహిదశ్వుడు తెలుసుకున్నాడు. మరికొంత స్నేహవాత్సల్యాన్ని ప్రకటిస్తూ త్రసదస్యుడి భుజంమీద చేయివేసి ఎన్నటికీ అలా భావించను, పుత్రా ! ఆర్యులు సత్య వచనాల్నే పలుకుతారు. అసత్యవచనంకంటె పాపం మరొకటి లేదని ఆర్యుల అభిప్రాయం ! తూర్పు ఆర్యులు, సత్యవచనులేకాక, మధుర వచనలుకూడానని మాత్రమే అన్నాను ! పఖ్తులు శరదృతువులో స్నానం చేయకపోయినా, గ్రీష్మంలోమాత్రం తప్పకుండా స్నానం చేస్తారు. కాని మాకు పైనవున్న కురులు, ఇతర ఆర్యగణాలు వేసవిలోనూ స్నానం చేయరు !"

ఆర్యా ! పఖ్తుఆర్యుల గుర్రాల్ని గురించి ఎన్నో ప్రశంసల్ని విన్నాము. మరి కురు, వృదు ఆర్యుల గుర్రాలుకూడా మీ గుర్రాల్లాగానే ప్రశంసాత్మకంగా వుంటాయా ?"

రోహిదశ్వుడు త్రసదస్యుడి చేయిపుచ్చుకుని పైకి లేస్తూ, "చెవితో ప్రశంస వినడంకంటె, కంటితో చూడడం మంచిది. పదండి మీకు పురు అశ్వాలను చూపుతాను !" అన్నాడు.

త్రసదస్యుడికీ, దివోదాసుకూ మీకు అశ్వాలను చూడడంకంటె సంతోషదాయకమైన విషయం మరోటి వుండదు. ముగ్గురూ పర్ణశాలనుండి బయటికి వచ్చి, అడవివైపుకు బయల్దేరారు. కొద్ది దూరం వెళ్ళేసరికి, కొంతమంది ఆర్యులు పచ్చిమాంసాన్ని ముక్కలుగా కోస్తూ కనుపించారు. రోహిదశ్వుడు అతిధులవైపు తిరిగి ఇప్పుడిక "మాంస భిక్ష (గుర్రపు మాంసాన్ని భుజించడం) సమయమైంది. తూర్పు ప్రాంతాలకు వచ్చి నప్పుడు సాధారణంగా గుర్రపుమాంసాన్ని తినము. ఇక్కడ గుర్రాలను తినడంకంటే విక్రయించడమే లాభదాయకమైన విషయం. కాని ఒక గుర్రం కుంటిదయింది. కనుక యీరోజు "మాంసభిక్ష" జరుగుతుంది. ఈ రోజు మధ్యాహ్న భోజనం మీరూ ఇక్కడే చేయండి !"

"తమ ఆజ్ఞ శిరోధార్యం !"

రోహిదశ్వుడు వాళ్ళని అడవిలోకి, మరి కొంచెం దూరానికి తీసుకు

పోయాడు. అక్కడో పెద్దగుర్రపుమంద మేత మేస్తున్నది. రోహిదశ్వుడు పేరుపెట్టి ఒక గుర్రాన్ని పిలిచాడు. ఒక బలిష్ఠమైన, ఎర్రని, పెద్దగుర్రము పరుగెత్తుకు వచ్చింది. అతడు ఆ గుర్రపు తలనూ, వీపునూ నిమిరాడు. గుర్రం తన యజమాని తలను ఆఘ్రాణించి ఆగింది.

"ఇది కురు అశ్వమేనా?" త్రసదస్యు డడిగాడు.

"కాదు. ఇది మా పఖ్య అశ్వం! దీని తండ్రిమాత్రం కురు అశ్వమే!" అంటూ మరికొంచెం ముందుకునడిచి చెవుల దగ్గిర నల్లని మచ్చలుకల రెండు గుర్రాలనూ చూపుతూ "ఇవి పురు అశ్వాలు!" అన్నాడు రోహిదశ్వుడు.

వాటిలో ఒకటి చేయిఎత్తితే అందనంత ఎత్తూ, ఎత్తుకు తగిన లావూ కలిగివుంది. రెండవది పలచగా వుంది. త్రసదస్యుడు, దివోదాసూ ముగ్ధులై కొన్ని క్షణాలు ఆ గుర్రాలను చూస్తూ వుండిపోయారు. వారి కా గుర్రాలు చాలా నచ్చాయని రోహిదశ్వుడు తెలుసుకున్నాడు. ఈ గుర్రాలు రెండూ మీవి! ఆర్యపుత్రులకు ఇంతకంటె గొప్పకానుక ఏముంటుంది?" అన్నాడు.

త్రసదస్యుడు నమ్రంగా "ఆర్యా, తమ స్నేహమే మాకు చాలు!" అన్నాడు.

"అయితే, నా స్నేహానికి గుర్తుగా ఈ గుర్రాలను స్వీకరించండి! చూడండి అబ్బాయిలూ: మాటల్లో నేను మీతో గెలువలేను. ఈ రెండు గుర్రాల్లోనూ ఎవరికి ఏదికావాలో మీరే నిర్ణయించుకోండి!" అన్నాడు రోహిదశ్వుడు.

ఏ మాటల్తో కృతజ్ఞతని తెల్పాలో తోచలేదు త్రసదస్యుడికి. ఎక్కువసేపు మౌనంగా వుండడమూ ఉచితం కాదనిపించింది. దివోదాసునుద్దేశ్యించి, "దివో! నీవు నా కంటె చిన్నవాడివి. నీ కేది కావాలో ఎంచుకో!" అన్నాడు.

దివోదాసు అప్పటివరకూ రెండు గుర్రాలనూ పరిశీలనగా చూస్తున్నాడు. "నేను చిన్నవాణ్ణి కనుక చిన్నది నాది. నీవు పెద్దవాడివి కనుక పెద్దది నీది!" అన్నాడు.

పై మాటలు వినగానే రోహిదశ్వుడు దివోదాసును దగ్గిరకు తీసుకుని కేశాలను ఆఘ్రాణించాడు. ఇలా అన్నాడు; "వత్సా, నీ బుద్ధికుశలతను

మెచ్చుకోకుండా వుండలేను. ఈ చిన్న వయస్సులో, గుర్రాలను ఎన్నుకోవడంలో, నీవు చూపిన బుద్ధికుశలత, ఆశ్చర్యకరమైన విషయం !"

దివోదాసు కొంచెంగా సిగ్గుపడి తలవంచుకున్నాడు. "అయితే మొదట బావనే ఎంచుకోమనండి ! బావకు ఏది ఇష్టమైతే దాన్ని తీసుకుంటాను !" అన్నాడు.

త్రసదస్యుడు దివోదాసు తలను ప్రేమతో నిమురుతూ "అలాకాదు, దివో ! నీవు చేసిన నిర్ణయమే చాలా యుక్తంగా వుంది. నేనిప్పుడు యువకుణ్ణయ్యాను. నాకు తగినదీ పెద్ద గుర్రమే !" అన్నాడు.

ఇద్దరు అతిధులనూ వెంటపెట్టుకుని రోహిదశ్వుడు తిరిగి పర్ణశాలకు వచ్చాడు. మరి కొంతసేపు పశ్చిమ ప్రాంతాల్లోని ఆర్య జనాలను గురించి మాటలాడుకున్నారు. ఆ మాటలను వింటూన్నంతసేపూ దివోదాసుకు ఆ దేశాలను చూడాలన్న కాంక్ష పెరుగుతూనే వుంది. మధ్యలో అనేక ప్రశ్నల్ని వేసి, తన ఉత్సుకతను తెలియజేశాడు. ఒక్కోమాటు "ఆ గణాలు ఇక్కడికి ఎంతదూరంలో వున్నాయి ?" అనడిగేవాడు. ఇంకోమాటు "మేము అక్కడికి పోగలమా ?" అనే వాడు.

రోహిదశ్వుడు దివోదాసుతో "పశ్చిమాన నాకు తెలిసినవరకూ, నేను విన్నవరకూ - మన ఆర్యులే వుంటున్నారు ! కొద్ది గొప్ప వ్యత్యాసాల్తో అందరూ మన భాషే మాట్లాడతారు. వాళ్ళూ మనలాగానే ఇంద్ర, వరుణ, అగ్ని, అశ్వనీకుమారుల్నే ఉపాసిస్తారు. మనలాగానే వాళ్ళూ అతిధిని దేవునిలా భావిస్తారు. అయితే, మార్గాయాసం అధికం. అడవుల్లో క్రూర జంతువు లుంటాయి !"

దివోదాసు నిర్లక్ష్యాన్ని కనబరుస్తూ మార్గాయాసాలు, బాధలూ ఎటూ వుంటాయి ! అవి లేకపోతే, అసలు యాత్రలో ఆనంద మేముంటుంది ?" అన్నాడు.

భోజనసమయం అయింది. రోహిదశ్వుని భార్య, కూతురూ రాగి, చెక్కపళ్ళాల్లో అతిథులకు భోజన పదార్థాలను వడ్డిస్తున్నారు. నేతితో వండిన మాంసాన్ని అపూపాలనూ, నిప్పుల్లో కాల్చిన మాంసాన్నీ వడ్డించారు. చర్మ చషకాల్లో సోమరసాన్ని దగ్గర పెట్టారు. రోహిదశ్వుడి కూతురు

'ఓజా' దగ్గిర కూర్చొని చషకాలను నింపి ఇస్తోంది. ఓజాకు పద్మాలు గేళ్ళుంటాయి. యవ్వనం ఇంకా పూర్తిగా వికసించలేదు ! అయినా సౌందర్యం అద్వితీయ త్రసదస్యుడు అచైతన్యుడిలా ఆమె సౌందర్యాన్ని తిలకిస్తూ వుండిపోయాడు.

భోజనం చేయడ మయిపోయింది. ఈ కొద్దిక్షణాల పరిచయమే, అతిథి గృహపతుల మధ్య గొప్ప ఆత్మీయతను స్థాపించింది. అతిథులు అందరికీ నమస్కరించి వెళ్ళిపోయారు. ఇద్దరు దాసులు గుర్రాలను వాళ్ళ వెనక డోలుకొని వెళ్ళారు. వీరు చిరపరిచితులే కారు; ఏకకుల జనితులు. ఏక రక్త సంబంధీకులు !

ఉత్సవం సమాప్తమవడానికి వచ్చింది. అశ్వోత్సవం అన్న పేరును చరితార్థం చేసే ప్రదర్శనం యీ రోజు జరగబోతోంది. అర్ధయోజనానికి పైగా వున్న ఒక వలయాకారపు మైదానంలో స్త్రీ - పురుషులు విశేషంగా ప్రోగుపడివున్నారు. ఈ గుంపులో పణుల సంఖ్యకూడా అధికంగానేవుంది. ఈ రోజు చివరిసారి గుర్రాల పందెం జరుగుతుంది. గడచిన పన్నెండు రోజులుగా రోజూ గుర్రపుపందాలు జరుగుతూనే వున్నాయి. వేలసంఖ్యలో గుర్రాలు ఈ పందేల్లో పాల్గొన్నాయి. అన్ని గుర్రాల్లో నుండి ఇరవై గుర్రాలు అత్యుత్తమమైనవిగా నిర్ణయింపబడినాయి. ఆ ఇరవై గుర్రాలకు ఇవ్వాళ పందెం జరుగుతుంది. న్యాయమూర్తులు పరుగులో ముందు వచ్చిన గుర్రాన్ని, దాని రౌతునూ, 'సర్వవిజయు' లని ప్రకటిస్తారు.

ఇరవై గుర్రాలూ ఒకే రేఖలో నిలబడివున్నాయి. కొద్ది క్షణాల్లో పరుగు ప్రారంభమౌతుంది. గుర్రాలదగ్గిర వర్ధ్యశ్వుడూ, పురుకుత్సుడూ అన్య ఆర్యరాజులూ, రాజకుమారులూ నిలబడివున్నారు. సాధారణ ప్రజలు కూడా అధికంగా ప్రోగుపడ్డా రక్కడ ! ప్రజలగుంపు హద్దుల్నిదాటి మైదానంలోకి జొరబడుతుందా అనేట్టుగా వుంది. కానీ, అలా జొరబడడం అసభ్యత అవుతుంది. కనుకనే ప్రజాసందోహం, అధిక పత్తిడివల్ల సముద్రంలో కల్లోలితమవుతున్నా హద్దులను అతిక్రమించడం లేదు. ప్రజలందరు గుర్రాలు పరుగును ప్రారంభించే క్షణంకొరకు అశాంతితో ఎదురు చూస్తున్నారు. గాలితో పోటీపడి, కాళ్ళు భూమి నానకుండా, ఆకాశంలో ఎగురుతూ పోయే గుర్రాలను చూడాలని ప్రేక్షకులు కాంక్షి

స్తున్నారు. అక్కడి ప్రజలకు అలాగనే చెప్పారు. చిట్టచివరి రోజు పరుగులో పాల్గొనే గుర్రాలు పరుగెత్తవు, గాలిలో ఎగురుతాయి అని చెప్పారు. కొన్ని క్షణాలు గడిచాయి. వ్యర్థ్యుప్వడి నోటినుండి పూర్వనిశ్చితమైన సంకేతం వెలువడ్డది. వెంటనే పెద్దపెట్టున నగారా మ్రోగింది. గుర్రాలు ముందుకు దూకాయి. ప్రజల దృష్టులుకూడా గుర్రాల ననుసరించాయి!

గుర్రాలు 50. 60 బారల దూరం పోయాయో లేవో, కుడిప్రక్క నుండి దర్శకుల్ని చీల్చుకుంటూ వచ్చి 21 వ గుర్రం పరుగులో ప్రవేశించింది. క్రొత్తగా పరుగులో ప్రవేశించిన గుర్రం ఒక్క క్షణం ముందు వరసలో వున్న ఐదుగుర్రాల వెంటా పరుగెత్తింది. మరుక్షణంలోనే బాణంలా ముందుకు పోయింది. క్షణాలు గడిచిన కొలది మిగిలిన అన్ని గుర్రాలనూ వెనక పడేసి, యీ గుర్రం యింకా యింకా ముందుకు వెళ్ళిపో సాగింది. దర్శకుల్లో విచిత్రమైన కుతూహలం జాగృతమైంది. ఎవరి దీ గుర్రం? గుర్రంపైన వున్న రౌతు ఎవరు? అన్న ప్రశ్నలు దర్శకుల్లో సంచలనాన్ని కలిగించాయి. 21 వ గుర్రం క్షణ క్షణానికి దూరమౌతున్నది. దూరమయిన కొలది గుర్రంమీద వున్న రౌతును పోల్చుకోవడం కష్టం. ఐతే, గుంపును చీల్చుకుని మైదానంలో ప్రవేశించిన ప్రదేశంలోని ప్రజలు గుర్రంమీద ఉన్నది బాలకుడని తెల్సుకున్నారు. కానీ, ఎవరతడు? క్షణంలో యీ విషయం రాజులకూ, రాజకుమారులందరికీ తెల్సిపోయింది. కానీ, ఎవరా కుర్రాడు?

అసలిది 'అశ్వోత్సవపు' నియమాలకే విరుద్ధం! నియమానుసారం అన్ని గుర్రాలూ ఒకే చోటినుండి బయల్దేరాలి. పైగా పరీక్షించి, ముందుగా నిర్ణయించుకున్న గుర్రాలే పరుగులో పాల్గొనడానికి అర్హమౌతాయి. ఇలా అకస్మాత్తుగా, నిర్ణయంకాకుండా పరుగులో పాల్గొనడం నియమవిరుద్ధం! ఏ విషయంలోనూ నియమ విరుద్ధాన్ని ఆర్యులు సహించరు. నియమాన్ని నిర్లక్ష్యంచేసికూడా అసఫలతను పొందినవాడు దోషిగా భావించబడతాడు. సఫలతను పొందినవాడి దోషాన్ని క్షమిస్తారు! నియమాన్ని ఉల్లంఘించిన అశ్వం కొద్ది క్షణాల్లో గుర్రాలన్నింటినీ వెనకపడేసింది. ఒకసారి వెనకపడిన గుర్రమేదీ మళ్ళీ ఆ గుర్రాన్ని కలుసుకోలేదు! పరుగు అంత్యానికి వచ్చినకొలదీ గుర్రపు వేగం హెచ్చసాగింది. రౌతు

గుర్రపు వీపును కుదుచుకునివున్నాడు. ఎగురుతూవున్న గుర్రం మెడమీదిజూలు అతడి ముఖాన్ని కప్పేసింది. రౌతుకూడా గుర్రంలో తాదాత్మ్యతను చెందాడా అనిపిస్తోంది. మొత్తం వలయాన్నిచుట్టి, బయల్దేరినచోటికి వచ్చేసరికి పురుకుత్సుడు అశ్వానికి, అశ్వారోహికి స్వాగతాన్ని చెప్పడానికి రెండడుగులు ముందుకువేశాడు. "దివో. నువ్వా ?" అనేశాడు పురుకుత్సుడు. తరువాత దివోదాసును గాఢాలింగనం చేసుకున్నాడు. దివోదాసు పేరు వినగానే పర్ద్యప్పుడు హర్షవిహ్వాలుడయ్యాడు. కానీ, దివోదాసు దృష్టంతా గుర్రం మీదవుంది. దివోదాసు క్రిందికిదిగిన మరుక్షణంలో గుర్రం నిల్చున్నది నిల్చునట్లు పడిపోయింది. దానినోటినుండి, ముక్కులనుండి రక్తం స్రవించ సాగింది. దివోదాసు పురుకుత్సుడిని విడిపించుకొని "హా, ద్రాఘికా !" అంటూ గుర్రంమీద పడిపోయాడు. గుర్రపుజూలులోనూ, చెవుల్లోనూ ముఖాన్ని దాచుకొని వెక్కి వెక్కి ఏడవసాగాడు. ఏడుస్తూనే "అయ్యో, ద్రాఘికా నన్ను విడిచి వెళ్ళవద్దు. ఈ పన్నెండు రోజుల్లోనూ నేను నిన్నెంతగా ప్రేమిస్తున్నానో చూశావుగా? అయ్యో, ఈ విజయానికి పరిణామం ఇంత ఘోరంగా వుంటుందని ముందేతెలిస్తే ఈ పందెంలో పాల్గొనేవాడినే కాదు. గురుజనుల ఆజ్ఞను తిరస్కరించిన మహాపాపానికి పడికట్టేవాణ్ణి కాదు !" అంటూ ఘోరంగా విలపించ సాగాడు.

చూస్తూండగానే 'ద్రాఘికా' శరీరం చలనరహితమైంది. తల ఒక వైపుకు వాలిపోయింది. దివోదాసుయొక్క ధైర్యం సన్నగిల్లింది. ఇంతలో రోహిదప్పుడు గుంపును చీల్చుకుంటూ దివోదాసు వద్దకు వచ్చాడు. అతడు బలవంతానా దివోను గుర్రం మీదనుండి పైకి లేవదీసి "పుత్రా, ఇక ఇప్పుడు శోకించడం వలన ప్రయోజనంలేదు. 'ద్రాఘికా' తన కర్తవ్యాన్ని నిర్వహించింది. యుద్ధంలో వీరుడు వీరగతికి పోవడం ఎంత సహజమో, ఉత్తమాశ్వానికి పరుగులో చనిపోవడంకూడా అంతే సహజం! కురు భూమిలో పుట్టిన ఈ అశ్వం తనజాతికి వన్నెతెచ్చింది. ఇలాటి ఉత్తమాశ్వం కొరకు కన్నీరు కార్చడం తగదు. యుద్ధంలో గతించిన వీరుడికొరకు శోకాశ్రువుల్ని విడుస్తామా ?" అన్నాడు దివోదాసుతో.

రోహిదప్పుడి ధైర్యవచనాలు దివోదాసుమీద బాగా పనిచేశాయి. అతడి స్థానంలో మరొకరెవరైనా అలా చెప్పివుంటే దివోదాసు అంతగా

ఊరడిల్లేవాడు కాదేమో! ఎంతో విలువైన, అమూల్యమైన గుర్రాన్ని తనకు రోహిదస్యుడు ఇచ్చేశాడు. అతడికీ ఆ గుర్రమంటే ఎంతో మమ కారం. ఎంతధైర్య వచనాలను చెపుతూన్నా రోహిదస్యుడి ముఖం దుఃఖంతో వివర్ణ మౌతూనే వుంది. కండ్లు నీటితో నిండుతూనే వున్నాయి. ఆర్యులు తమ బంధువులకంటే కూడా, తమ గుర్రాలను అధికంగా ప్రేమిస్తారనేది రోహిదస్యుడి ముఖం చూస్తేనే తెలిసిపోతుంది.

దివోదాసు మరోమారు కరుణాపూరితనయనాలతో దాధ్రికావంక చూశాడు. అతడిని అలా ఎక్కువసేపు దుఃఖములో వుంచడం ఇష్టంలేని గురుజనం-పెద్దవారు-బలవంతానా అక్కడనుండి అవతలకి తీసుకపోయారు. తక్షణ! మైదానంలో ప్రోగుపడిన ప్రజలందరిలోనూ క్షణంలో ఈ వార్త ప్రచారమైంది. ఆ సంవత్సరపు విజయాశ్వం 'దాధ్రికా' అనీ, దాని రౌతు దివోదాసనీ అందరూ తెల్సుకున్నారు. దివోదాసు వధ్ర్యశ్వుడి పుత్రుడనీ, త్రుత్సుగణపు భావి మహారాజనీ తెల్సుకున్నా రక్కడి ప్రజలు. కానీ, దివో దాసుయొక్క వయస్సును గురించి విన్నప్పుడు అక్కడి ప్రజల ఆశ్చర్యా నికి, విస్మయానికి హద్దులేకపోయింది. పన్నెండేళ్ళ ఆర్యబాలుడు గుర్రపు స్వారీ చేయడం వింతకాదు. ఐతే, మొత్తం సప్తసింధులోనే అత్యుత్తమైన వని నిర్ణయించబడిన గుర్రాల పందెంలో పాల్గొనడం గొప్ప ఆశ్చర్యకర మైన విషయం!

నిదానంగా విషయమంతా అందరికీ అర్థమైంది. పన్నెండు రోజుల క్రితం దివోదాసుకు కురుఅశ్వం లభించింది. ఆ గుర్రంతో ఆరోజే గొప్పగా స్నేహాన్ని కలిపేశాడు. తన హృదయంలోని ప్రేమకు శాబ్దిక రూపాన్నిస్తూ, ఆ గుర్రానికి 'దాధ్రికా' అని పేరు పెట్టాడు. 'దాధ్రికా' అంటే "స్పృశిస్తే పరుగెత్తేద'ని అర్థం! ఒకప్పుడు పచ్చిగడ్డిని, మరో ప్పుడు పచ్చియవల్ని తన చేతులతో స్వయంగా దాధ్రికాకు తినిపిస్తూండే వాడు. ఆ అశ్వంతో బాగా పరిచయం ఏర్పడి దాని గతి (పరుగు) మతి (స్వభావం) తెలిశాక "అశ్వోత్సవం"లో పాల్గొంటే బాగుం డనుకున్నాడు. ఐతే, పెద్దలకు చెప్తే, గుర్రపు పందెంలో పాల్గొన నిస్తారనేది సంశయాత్మకమైన విషయం! గుర్రపు పరుగులో పన్నెండేళ్ళ కుర్రవాడు పాల్గొనడానికి గురుజనం ఎటూ అనుమతించరు. ఒకవేళ వధ్ర్య

ష్యుడు సమ్మతించినా, పౌరవి సమ్మతించదు. పన్నెండేళ్ళ కుర్రవాడిని అతి సాహసోపేతమూ, ప్రమాద భరితమూ అయిన గుర్రపు పరుగులో పాల్గొన డానికి ఏ తల్లి అనుమతిస్తుంది ? ఎంతోమంది సాహసికులైన రౌతులు గుర్రంమీదనుండి క్రిందపడి ప్రాణాలను విడవడాన్ని పౌరవి తన కండ్లతో చూసింది. తన కొడుకు సిద్ధహస్తుడైన గుర్రపురౌతని ఆమె కెలా తెలి యడం, ఎలా విశ్వాసం కలగడం ?

దివోదాసు అనేక విధాలుగా ఆలోచించి చూశాడు. తనకు అనుమతి లభించడం అసంభవం అని నిర్ణయించుకున్నాడు. అయితే పరుగులో "దాక్షికా" ఏ గుర్రానికీ తీసిపోదన్న విశ్వాసం అతడికి బలంగావుంది. చివ రకు ఎవరికీ చెప్పకుండానే పరుగులో ప్రవేశించడానికి నిశ్చయించుకున్నాడు. తన ఈ నిర్ణయాన్ని బహుగోప్యంగా వుంచాడు. ప్రాణస్నేహితుడైన త్రసదస్యుడికి కూడా చెప్పలేదు. ఆరోజున పరుగుచూడ్డానికి తమ వెంట రమ్మని తల్లీతండ్రీ బలవంతంచేశా రతణ్ణి ; కొన్ని క్షణాలు పరుగులో పాల్గొనగలనన్న నమ్మకమే నశించిం దతడిలో !

తను ప్రథమంగా పొందిన ఈ మహావిజయాన్ని గురించి దివోదాసు ఆనందించకుండా, గర్వపడకుండా ఎలా వుండగలడు ? కానీ, "దాక్షికా" యొక్క మృత్యువు నతడు జీవితపర్యంతం మర్చేపోలేదు. ఆ దుఃఖం అతణ్ణి గుండెలో ముల్లులా వేధిస్తూనే వుంది. దాక్షికామీది ప్రేమాతిశయంవలన అతడు తరువాతకూడా, తనకు ప్రియతమమైన ప్రతి అశ్వానికీ "దాక్షికా" అనే పేరు పెట్టేవాడు. సప్తసింధులోని ప్రజలు వర్ధ్యాశ్వుడి వుత్తమ గుణాలకు ఎంతో ముగ్ధులవుతున్నారు. ఒక్క క్షణంలో కొడుకు తండ్రిని మించాడు. వర్ధ్యాశ్వుడు మొదటే కీర్తినార్జించి, ప్రసిద్ధి వడసినవాడు గనకగాని, లేకపోతే ప్రజలు దివోదాసు-తండ్రి అని వర్ధ్యాశ్వునకు కొడుకు ద్వారా కొంత ప్రసిద్ధిని చేకూర్చేవారే.

ఆరోజు దివోదాసు శోకాకులుడై ఇంటికి రాగానే పౌరవి అతణ్ణి వళ్ళోకి తీసుకుని, హృదయానికి హత్తుకుంది. కన్నీళ్ళు కారుస్తూ అతడి ప్రత్యంగాన్నీ స్పృశించింది. తల్లి తనకు ఎక్కడయినా దెబ్బలు తగిలా

యేమో చూస్తున్నదని తెల్సుకున్నాడు దివోదాసు. "నా కెక్కడా దెబ్బలు తగల్లేదమ్మా! "దాక్షికా" నాకసలు దెబ్బలు తగలనీయలేదు. నేను తన మీదనుండి క్రిందికి దిగేవరకూ, మృత్యువునుకూడా నిరోధించి, నిలబడింది "దాక్షికా" అన్నాడు.



# 4. భరద్వాజ కులం

"స్వాదిష్ఠయా మదిష్ఠయా పవస్వ సోమధారయా"

(ఋగ్వేదం 9.1.1)

(క్రీ. పూ. 1204)

సప్తనదుల్లో అన్నిటికంటె చిన్నవి సరస్వతి, విపాశ (వ్యాసనది). వీటిలో విపాశ జీవనది. బృహత్పర్వతంమీది హిమం కరిగి ఈ నదిలోకి ప్రవహిస్తూంటుంది. ఈ నది చిన్నదే అయినా, దీని మహిమ మాత్రం చాలా గొప్పది. దీనికి 'ఆర్జికియా'అని మరోపేరుకూడా వుంది. 'ఆర్జికియా' సోమలతలకు చాలా ప్రసిద్ధి చెందింది. ఈ నదీతీరంలో లభ్యమయ్యే సోమలతలయొక్క రసం పస్త్య 1 శర్యణావత రీరాల్లో 2 దొరికే సోమలతల యొక్క రసం కంటే ఏ విధంగానూ తక్కువ కాదు. మదిష్ఠంలోనూ (మత్తును కలిగించడంలోనూ) తీసిపోదు: సప్తసింధులోని అన్ని ప్రాంతాలూ ఘోరారణ్యాలతో నిండివున్నాయి. అరణ్యాల్లో సింహ,

---

1. పస్త్య=ఈ పదం ఏ సరోవరానికో చెందిందనుకుంటున్నాను. ఎన్నో నిఘంటువుల్ని, శబ్దకోశాల్ని తిరగవేశాను. సరైన వివరణ దొరకలేదు ॥అను॥

2. శర్యణావతం=శర్యణ జనపదంవద్దకల ప్రాచీన సరోవరం.

వ్యాఘ్రాల్లాంటి క్రూరజంతువు లెన్నో వున్నాయి. ఎంత అయినా, మానవుడు ఈ పృథ్విపై మరోప్రాణి ఆధిపత్యాన్ని సహించలేడు! ఆ రోజుల్లో భరత ఖండంలోని అన్యప్రాంతాలకంటె సప్తసింధు అధిక జనసమృద్ధమనే దాంట్లో సంశయం ఏ మాత్రం లేదు. దస్యులసంఖ్య (పణి, కిరాతకులు) ఆర్యులకంటె అధికం! కాని, సప్తసింధు ప్రాంతానికి ఆర్యులు తామే ఏకాధిపతుల మంటారు. ఇంకెవ్వరి ఆధిపత్యాన్నీ సహించరు. వృద్ధులైన ఋషులు సప్తసింధు అంతట్లోనూ తమ గోత్రాల్ని (ఆశ్రమము - కులం) స్థాపించారు. ఈ గోత్రాలు కేవలం ఒక కుటుంబీకులవరకో, ఒక వంశీకులవరకో పరిమితాలు కావు. ఆర్యవీరుల్నీ, ఆర్య విద్వాంసుల్నీ తయారుచేసే కర్మశాలలుగా ప్రసిద్ధిచెందా యీ గోత్రాలు! జీవితపు ప్రథమపాదంలో బ్రహ్మచర్యం, విద్యాధ్యయనం, మిగిలిన మూడు పాదాల్లోనూ తపంచేసుకోవడం, దానశీలత, ధార్మికచింతనా - వీటిని ఆర్య ఋషులు తమ కర్తవ్యంగా భావిస్తుంటారు. అప్పటి సమాజంలో బ్రహ్మ చర్యం అంటే కేవలం ఇంద్రియ నిగ్రహమనే కాదు అర్థం. బ్రహ్మవేదాన్ని, బ్రహ్మజ్ఞానాన్ని ఆర్జించటానికి శ్రమచేయడం అని ఆశయం! విపాశ, శతద్రు నదులయొక్క సంగమస్థానానికి కొన్ని క్రోసులపైన, దక్షిణపువైపున భర ద్వాజకులం వుంది. విపాశ నది కురుగణపు ఉపశాఖయైన భరత, తృస్తు గణాల సీమాంతంలో వుంది. ఆకాశం నిరభ్రంగా వున్నప్పుడు, భరద్వాజ గోత్రంలోనుండి చూస్తే, బృహత్పర్వతపు శ్వేత శిఖరాలు కనుపిస్తుంటాయి. భరద్వాజ గోత్రంలోని ఆర్యులు వేల సంఖ్యలో సుందరమైన అశ్వాలనూ, గోవులనూ దోచుకుని వస్తుండేవారు. భరద్వాజుడు తన గోత్రంవరకే కాక, సమస్త ఆర్యగణాల్లోనూ గొప్ప ప్రసిద్ధిని పొందాడు. సప్తసింధులోని అన్యభాగాల్లోవుండే పార్థివుల మహారాజయిన తనుపుత్రుడు, అభ్యావర్తి చాయమానుడు, దాసదాసీజనాల సహితంగా రెండు రథాలనూ, 20 గోవుల్నీ భరద్వాజుడికి సమర్పించాడు. విపాశనదికి తూర్పునవున్న ఆర్యగణపు మహారాజు సంజయ పుత్రుడి కుమారుడు మహీరాఘుడిచేత యజ్ఞము చేయిం చాడు భరద్వాజుడు. వివిధ జనాలూ, వాటి మహారాజులూ భరద్వాజుడంటే అధిక భక్తి శ్రద్ధల్ని కనబరుస్తూంటారు!

భరద్వాజుడికి ముందుకూడా ఆర్యుల్లో చాలామంది ఋషులయ్యారు.

అసలు నిజం చెప్పాలంటే దేవతల సాక్షాత్కారం పొందిన ఋషుల్లేందీ, ఆర్యులకు ఒక్క క్షణం గడవదు ! గతంలోనూ ఎంతోమంది ఋషులయినా, వారి గ్రామ నామాలూ, ఇతర వివరణలూ – ఏవీ ఇప్పటి ఆర్యులకు జ్ఞాపకం లేవు. తాము మరచిన, తమకు తెలియని ఋషుల్ని వదిలిపేస్తే, భరద్వాజుడు ఆర్యుల ప్రథమ ఋషి !

వర్ధ్యశ్వుడు పురగణపు ఉపశాఖ భరతగణంలోని అంతర్భాగమైన తృస్తుగణానికి చెందినవాడు. తృస్తుగణం చాలా నగణ్యమైనదీ, అనామక మయినదీను! అలాటి అనామకమయిన గణంలోపుట్టి సమస్త ఆర్యగణాల్లోకే ప్రతిభావంతుడయిన ధీరుడిగా ప్రసిద్ధిని వడశాడు. యోగ్యుడైన తండ్రికి యోగ్యుడైన పుత్రుడు కలగడం బహుదుర్లభం! కాని, దివోదాసుమాత్రం దీనికి వ్యతిరేకంగా 12 వ ఏటనే సప్తసింధులోని ఉత్తమోత్తమమైన గుర్రాలను ఓడించి తండ్రికి తగిన కొడుకనిపించుకున్నాడు. ఆనాటినుంచీ వర్ధ్యశ్వుడు కొడుకుయొక్క చదువుసంధ్యల్ని గురించి యోచించసాగాడు. యోగ్యుడైన ఋషివద్ద కొడుకుని విద్యాధ్యయనం నిమిత్తం విడిచివద్దామను కున్నాడు. అంగిరా గోత్రికుడూ, బృహస్పతి తనయుడూ అయిన భరద్వాజ ఋషి. తన కొడుక్కు తగిన గురువని భావించాడు. భరద్వాజ గురుకులంలో కొడుకును విడవాలని నిశ్చయించుకున్నాడు. ఇంతక్రితమే తన కొడు కును భరద్వాజ ఋషికి వప్పచెప్పనందుకు మనస్సులో బాధపడుతూ, ఇక ఆలస్యం చేయడం తగదని యెంచి, కొడుకును తీసుకుని భరద్వాజ ఋషి ఆశ్రమానికి ప్రయాణమయ్యాడు. అతడివెంట అనేకమంది రాజకుమారులు యోధులూ పయనమయ్యారు. వందల సంఖ్యలో ఆవుల్నీ, వృషభాల్నీ, అశ్వాల్నీ, కంచరి గాడిదల్నీ వెంట తీసుకున్నారు. మధ్య మధ్య మజిలీలను చేసుకుంటూ రెండువారాల్లో భరద్వాజుడి గోచరభూమిలో ప్రవేశించారు. వర్ధ్యశ్వుడి దూత మొదటే, తమ రాకకు సంబంధించిన వివరాల్ని ఋషికి అందచేశాడు.

వర్షాల భయం తీరిపోయింది. భరద్వాజ ఆశ్రమానికి సంబంధించిన కుటీరాలు విపాశ నదీతీరానికీ చాలా దగ్గిరవరకూ వ్యాపించివున్నాయి. యవలపంటను అప్పుడే నాటారు. మూడునాలుగు అంగుళాలకంటే మొక్కలు ఎక్కువ పెరగలేదు ! ఇది చేలకు నీరుపెట్టుకునే సమయం.

ఋషి తన శిష్యుల్తో, అనుచరుల్తో పొలాలకు నీరు పెట్టుకోవడంలో నిమగ్నుడై యున్నాడు. విపాశ నదినుండి తీసిన ఒక చిన్న కాలవద్వారా పొలాలకు నీరు పారుతోంది. వర్ధ్యశ్వుడు, మరి ఆరుగురు రాజకుమారుల్తో కలిసి, గుర్రాలనెక్కి ఋషివద్దకు వెళ్ళాడు. ఋషి కాలువవద్దున కూర్చుని కృషి కర్మను పరీక్షిస్తున్నాడు. భరద్వాజ ఋషికి వర్ధ్యశ్వుడికి వయస్సులో అంత వ్యత్యాసం లేదు. వర్ధ్యశ్వుడికంటె ఋషి 5. 6 ఏండ్లు మాత్రమే పెద్దవాడు. వర్ధ్యశ్వుడు తన తండ్రికి చూపిన గౌరవాన్ని చూపాడు ఋషికి. ఋషిని సమీపించాక వర్ధ్యశ్వుడు, అతడి తోటి రాజకుమారులు గుర్రాలను దిగి నమస్కరించారు. 'అతిధి దేవో భవ' అన్న సూక్తి ననుసరించి, ఋషి తగిన ఆసనాల్ని చూపి. అందరికీ స్వాగతాన్ని చెప్పాడు. కాలవవద్దున ఎక్కువగా మాట్లాడడానికి అవకాశం లేదు. క్లుప్తంగా తా నొచ్చిన పనిని తెలిపాడు:"దివో దాసును తమ అంతేవాసిని చేయడానికి వచ్చాను :" అన్నాడు వర్ధ్యశ్వుడు. ఋషి చాలా ఆనందించాడు. తన స్వీకృతిని తెల్పాడు. "ఇంద్రుడి కృప దివో దాసుమీద పొంగిపొరలుతోంది. ఇతడిద్వారా గొప్ప గొప్ప కార్యాలను చేయించాలని ఇంద్రుడి సంకల్పం" అన్నాడు.

భరద్వాజ గ్రామం అక్కడికి కనుపిస్తూనేవుంది. అందరూ గ్రామం వైపు బయల్దేరారు. గ్రామంలో ఇండ్లన్నీ పూరిగుడిశలే. అవి తాత్కాలిక గుడిశలే అయినా, మంచి ధృఢంగా కట్టబడినాయి. నడివర్షాకాలంలో ధారాపాతంగాకురిసే వర్షాన్నయినా ఆ గుడిశలు నిబ్బరంగా చెక్కుచెదర కుండా భరించగలవు. ఆ గుడిశల నిర్మాణం కళాత్మకంగాకూడా వుంది. గుడిశలముందు వందలసంఖ్యలో వృషభచర్మాలు ఆరవేసివున్నాయి. వాటిలో కొన్ని అప్పుడే వొలిచినవికూడా వున్నాయి. అతిధి అనే దృష్టితో వర్ధ్యశ్వుడికి ఉన్నతమైన ఆసనాన్ని చూపించాడు భరద్వాజఋషి. కాని, ఉన్నతమైన ఆసనం స్వీకరించ నిరాకరించాడు భరతగణపు మహారాజు : ఋషి విద్యలోనూ, వయస్సులోనూకూడా వర్ధ్యశ్వుడికంటే పెద్దవాడే ! అప్పటికి వర్ధ్యశ్వుడికి 50 ఏళ్లుంటాయి. ఋషికి 56 ఏళ్ళు వుంటాయి. వర్ధ్యశ్వుడికి బాగా వళ్ళువచ్చి, శరీరం నిండుగావుంది. ఋషిశరీరం ఆ వయస్సులోనూ పల్చగా శలాకలావుంది. ఋషిగడ్డంలోని కొన్ని బంగారు వెంట్రుకలు తెల్లబడి అతడి వయస్సును బయట పెడు

తున్నాయి. లేకపోతే అతడి వయస్సును తెలుసుకోవడం చాలా కష్టం! కొద్దిసేపు కుశలప్రశ్నలు జరిగాయి. ఈలోపు అతిథికొరకు మధుపర్కాన్ని తయారుచేశారు. కుండల్లో పాలూ, తేనె కలిసిన సోమరసాన్ని తెచ్చి పెట్టారు. కాల్చిన కోడెదూడ మాంసాన్ని తెచ్చారు. పలాస పత్రాలను, చెక్క చషకాలను ముందుపెట్టి మధుపర్కాన్ని † వడ్డించ సాగారు. ఋషి తన చేతుల్తో వర్ధ్యశ్వుడికి, దివోదాసుకూ వడ్డించాడు. ఇంద్రుణ్ణి స్తుతించారు. సోమరసాన్ని స్తుతిస్తూ భరద్వాజఋషి ఇలా అన్నాడు: "ఓ సోమరసం! అతి స్వాదుయుక్తమైన, అతి గొప్పదైన నీ ప్రవాహంతో మమ్మల్ని పవిత్రుల్ని చేయి! నిన్ను సేవించి మా శరీరాలు రాతిలా గట్టిగా శక్తి సంపన్న మవాలి! (అశ్మాం భవతు నస్తూనః; ఋక్ 6-75-12) సోమరసాన్ని తీసుకోగానే సమాజమంతా సోమరసపు స్తుతి శ్లోకాలతో ప్రతిధ్వనించింది. ఆర్యుల ఆనందానికి సోమపానం ముఖ్యసాధనం. సోమరసపు మత్తుతో కండ్లు ఆరక్త మవసాగాయి. మత్తు ఎక్కినకొద్దీ చషకాలపై చషకాలు ఖాళీ అవుతున్నాయి. ఆర్య స్త్రీపురుషులు హాసపరిహాసాల్తో, అత్యుత్సాహంగా సోమరసాన్ని త్రాగుతున్నారు. భరద్వాజఋషికూడా వారిలో వున్నాడు. అతడి స్వరమూ, మాటలూ అతిగంభీరంగా అత్యంత ప్రభావోత్పాదకంగా వున్నాయి. సాయంకాలం ప్రారంభమైన సోమపానం అర్ధరాత్రివరకూ సాగింది. సోమపానం వుందంటే, ఇక నృత్యగానాదులు కూడా సరిగా ఉన్నాయన్నమాటే!

* * *

భరద్వాజఋషివద్ద ఉపనీతుడై, వందల సంవత్సరాసుండి ఆర్జించబడుతున్న ఆర్యవిద్య లన్నింటినీ అభ్యసించసాగాడు దివోదాసు. ఇక్కడే అతడికి శ్యాలపుత్రుడు భుజయుతౌగ్ర్యుడు, కుత్స ఆయునేయుడు, పురుకుత్సుడు, కురువిందుడు – మొదలైనవారితో స్నేహమయింది. వీరి ఈ మిత్రత్వం జీవితమంతా అక్షుణ్ణంగా నడిచింది. పై స్నేహితులు ఋషికులంలోకి దివోదాసుకంటే ముందువచ్చినా త్వరలోనే ఇతడికి, వారికి ఆత్మీయత స్థిరమైంది. ఉదయపు అగ్నిచర్య తరువాత ఋషి తన శిష్యులకు

---

† పెరుగూ, తేనె కలిపి మధుపర్కాన్ని తయారు చేస్తారు.

అధ్యాపన కావించేవాడు. తనవీ. తన పూర్వ ఋషులవీ- ఋక్కులను చెప్పే వాడు. ఋషి నోటినుండి వెలువడ్డ ఋక్కులను శిష్యులు రెండేసి మార్లు వల్లించేవారు. పూర్వఋషుల ఋక్కులు కూడా చాలా వున్నాయి. కాలక్రమంలో కొన్ని లుప్తమయ్యాయి కూడాను; ఇలాగే ఎవరో అజ్ఞాతుడైన పూర్వ ఋషి చెప్పాడు. ఊర్వశీ-పురూరవుల సంవాదాన్ని. గురువు గారివద్ద వల్లిస్తూండడం వలన శిష్యులకు శ్లోకాలు కంఠస్తమౌతాయి. దివోదాసు వల్లించడంలోనూ. శ్లోకాలను కంఠస్థం చేయడంలోనూ ఎవరికీ తీసిపోడు. విద్యాధ్యయనంలో సహపాఠుల్ని మించుతాడేగాని తగ్గడు. ఇక గుర్రపు స్వారీలో అతణ్ణి చెప్పే మరొకర్ని చెప్పాలి. విలువిద్య లోనూ సర్వోత్కృష్ట లక్ష్యభేదకు డతడేను ! అయినప్పటికీ శత్రువుల్ని జయించడం అంత సులభంకాదు. ఒకడు విలువిద్యలోనూ, కత్తియుద్ధం లోనూ, గదాయుద్ధంలోనూ నిపుణుడైన మాత్రాన, అధిక సంఖ్యలో వున్న శత్రువుల్ని గెలవగలగడం అసంభవం ! శత్రువుని జయించడానికి తను యోధుడుకావడమే కాదు ముఖ్యం. నిపుణుడైన సేనా నాయకుడుగా కూడా తయారుకావాలి ! దివోదాసు మొదట కొన్ని విషయాల్ని తోటి విద్యార్థులనుంచి నేర్చుకున్నాడు. అనంతరం గురుముఖంగా సమస్త విద్యల్ని అభ్యసించాడు. దివోదాసుయొక్క తెలివి తేటల్ని శ్రద్ధాసక్తులను చూసి ఋషి చాలా సంతోషించేవాడు. భవిష్యత్తును గురించి యోచించేవాడు. 15, 16 ఏళ్ళ వయసులో దివోదాసు 24, 25 సంవత్సరాల బలిష్ఠుడైన యువకుడిలా కనుపించేవాడు. ఋషి యొక్క ప్రముఖ శిష్యులైన భుజయుడు, ఆయునేయుడు సహజంగానే దివోదాసుని తమ నాయకుడని ఒప్పుకున్నారు. ఐతే, దివోదాసుమాత్రం వాళ్ళని మిత్రులుగా, సమానస్థాయిగల సహపాఠులుగానే చూసేవాడు. తను నాయకుడు, వాళ్ళు అనుయాయులు అన్న దృష్టి కనబరచేవాడు కాదు.

ఋషి ఆశ్రమంలో విద్యాధ్యయనం శస్త్ర విద్యాభ్యాసాలతోపాటు వినోదానికి కావలసిన సాధనలు కూడా బహుళంగా వున్నాయి. సోమపానం, సామగానం, నృత్యగానాదికాలు నిత్యవిషయాలు. పశుచారణ, పాలు పితకడం, కృషికర్మ - మొదలైనవాటిల్లో దివోదాసు, అతడి సహచరులు

సహకరిస్తూ వుండేవారు. వేటకూడా వారి వినోదకార్యక్రమాల్లో ఒకటి ! వేటద్వారా యుద్ధపద్ధతుల్ని కూడా తెలుసుకునేవారు !

ఒకమాటు దివోదాసు, భుజయుడు, కుత్సుడు మొదలైన సహపాఠులతో కలిసి ఉత్తరదిశగా వెళ్ళారు. భరద్వాజ గ్రామాన్ని దాటి చాలాదూరంవెళ్లారు. ఒక ఘోరారణ్యంలో ప్రవేశించారు. అక్కడ పణులగ్రామ మొకటుంది. ఆ గ్రామ పెద్ద ఆర్యరాజ కుమారులకు గొప్పగా స్వాగతాన్నిచ్చాడు. కుశల ప్రశ్నలు జరుగుతూనే వున్నాయి. ఇంతలో దాసుడొకడు పరుగెత్తుకు వచ్చాడు. ఇలా చెప్పాడు: "సింహం మన రోహిత వృషభాన్ని చంపేసింది" అన్నాడు. గ్రామపెద్దకు ఆ వృషభంమీద ఎంతో ప్రేమ: సింహం వీలుచిక్కి నప్పుడల్లా ఆవులనూ, వృషభాలనూ చంపేస్తున్నది. గృహపతి విషాదంలో ఉండటాన్ని చూసి "ఆ సింహాన్ని మేము చంపుతాము !" అన్నాడు దివో దాసు. పణిగ్రామపెద్ద వద్దని ఎంతగానో వారించాడు. "ఆ సింహం చాలా క్రూరమైంది. అస లది ఎదటికి రాదు. ఒకవేళ వచ్చినా దాని దెబ్బ వృథా పోదు!" అన్నాడు.

ఆర్య రాజకుమారు కిదో సవాలులాంటిది. గ్రామపెద్ద ఇచ్చిన మధు పర్కాన్ని భుజించాక, రాజకుమారులు గుర్రాలనెక్కి వృషభం చచ్చిపడి వున్న చోటికి వెళ్ళారు. సింహం వృషభాన్ని చంపి వెళ్ళిపోయింది. కాని, తను చంపిన వృషభాన్ని తినటానికి అక్కడికి తప్పకుండా మళ్ళీ ఒకమాటు వస్తుంది. వృషభం ఓ కాలువవద్దున చంపబడ్డది. ఆ కాలువ విశాపనదికి అభిముఖంగా ప్రవహిస్తోంది. ముందుకు పోయినకొలది కాలువ లోతు అధిక మౌతోంది. కాలువ వద్దున నేరేడు మొదలైన వృక్షాలెన్నోవుండి మహా రణ్యాన్ని స్ఫురింప చేస్తున్నాయి. దట్టంగా వున్న చెట్లకారణంగా పట్టపగలే అంధకారం వ్యాపించినట్టుగా వుంది. సింహం ఎక్కడో దాగింది. రాజకుమారులుకూడా కాలువవద్దున వున్న చెట్లల్లో దాగారు. పచ్చని, దట్టమైన చెట్ల ఆకులమధ్య దాగిన వీరిని, సింహం చూడలేదు. ఐతే నరవాసనవలన సింహం పుండే తమ ఆచూకీని ఎక్కడ తెలుసు కుంటుందోనని రాజకుమారులు భయపడసాగారు. ఇంకా రెండుమూడు ఘడియల ప్రొద్దు వుంది. ఇంత సమయాన్ని మౌనంగా గడపగలగడం అసంభవమైన విషయం. అట్లాగని పెద్దగా మాట్లాడుకోవడానికీ వీలులేదు.

కాకపోతే సౌజ్ఞలతో మాత్రం కొంతవరకు భావప్రకటన చేసుకోగలరు. వర్షఋతువు చివరిరోజులు. వర్షాలు తగ్గి చలి అధికమౌతూన్నది. తెల్లని సూర్యకిరణాలు పచ్చనయ్యాయి. కొన్ని క్షణాల తరువాత ఎర్రనయ్యాయి. సూర్యగోళం క్షితిజంలోకి దిగిపోతూంది. సూర్యునివైపు వీపుపెట్టి, చెట్లల్లో కూర్చునివున్నారు రాజకుమారులు. క్రమంగా సంధ్యాగమన మయింది. చీకటి కారుమేఘాల్లా ఆవరించింది. అర్ధరాత్రికి కాని చంద్రోదయం కాదు. మరి చీకట్లో సింహాన్ని చూడగలగడం ఎలా? వారి సమస్యకు తక్షణం పరిష్కారం కనుపించింది. ఇంకా పూర్తిగా అంధకారం వ్యాపించలేదు. వెలుగు ఏ కొద్దిగానో ప్రసరిస్తోంది. ఆ గుడ్డివెలుగులో, కాలువకు అటు చివరనుండి, ఏదో వస్తువు మెల్లగా జరుగుతున్నట్టయింది. అది చాలా నిదానంగా జరుగుతోంది. ఎంతో లక్ష్యముంచి చూస్తేగాని ఆ జరగడం కనుపించదు. సింహం తను చంపిన వృషభం వద్దకు వస్తోన్నదని అందరూ అర్థం చేసుకున్నారు. సింహం మధ్య మధ్య ఆగి నాలుగువైపులా కళ్ళు పగలగొట్టుకు చూస్తోంది. చెట్లఆకుల సందుల్లోనుంచి అనేక నేత్రాలు సింహాన్నీ చూస్తున్నాయి. సింహం తమలో ఎవరో ఒకరిని చూసేవుంటుందని భావించారు రాజకుమారులు. ఇప్పుడు సింహం నేలమీద పడుకుని ఒకదాని తరువాత ఒకటిగా ముందు కాళ్ళను కదుపుతూ ముందుకు జరుగుతోంది. అలా జరుగుతూ కొంతసేపటి తరువాత వృషభాన్ని సమీపించింది. దాని ప్రాణానికి యుగయుగాంతరాల తరువాత ఆహారాన్ని కళ్ళ చూచినట్టుగా వుంది. పెద్దపెద్ద మాంసపు కండల్ని పెరుక్కుంటోంది. ఉంటూకూడా ఎవరైనా వస్తున్నారేమోనని నాలుగువైపులా చూస్తోంది. దివోదాసూ అతడి మిత్రులూ బాణాలను ఎక్కుపెట్టడానికి ప్రయత్నిస్తూన్నారు. ఇంతలో ఎండుటాకొకటి పెళపెళమంది: సింహం వెనక్కి దూకేసింది. ఆకు శబ్దం చేయడం, సింహం వెనక్కి దూకడం, రెండు పనులూ ఒకేక్షణాన జరిగినట్టనిపించింది! దివోదాసు తన ధనస్సును ఎక్కుపెట్టి తీక్ష్ణమైన బాణా న్నొకదాన్ని. సింహపు శరీరానికి తాకేట్టు వదిలాడు. పరిణామానికి ఎదురుచూడకుండానే పెద్దగా అరుస్తూ, బాణంతోపాటే తనూ చెట్టునుండి క్రిందికి దూకాడు. సింహం దెబ్బతిన్నది. అయినా, మానవుడి అరుపులనూ, కేకలనూ సహిస్తుందా? సింహం వెనక్కు తిరిగింది. దివో

దాసు సిద్ధంగా వున్నాడు. అతడి ఎడంచేతిలో డాలు, కుడిచేతిలో కత్తీ వున్నాయి. సింహం అతడిమీదకు లంఘించింది. తక్షణమే దివోదాసు కుడి వైపుకు ఎగిరి దూకి తనస్థానాన్ని రక్షణం చేశాడు. చేతిలోని పొడుగాటి కత్తిని సింహం మెడమీదకు విసిరాడు. సింహం అతి క్రూరంగా భయంకరంగా దివోదాసు కండ్లల్లోకి చూసింది. సింహానికి రెండు దెబ్బలూ బలమైనవే తగిలాయి. అయినా లెక్క చేయకుండా దివోదాసుమీదకు మళ్ళీ దూకింది. దివోదాసు ఈమాటూ తప్పుకుని మరొక దెబ్బ వేశాడు. ఇంతలో తోటివారుకూడా చెట్లమీదినుంచి దూకారు. దివోదాసు వారించాడు. అయినా తమ కుక్కల్ని సింహం మీదకు వదిలారు తోటివారు. కొద్ది క్షణాల్లోనే సింహం పని పూర్తయింది. దివోదా సొకడే ఆ సింహాన్ని చంపగలడు. అతడి మనస్సు పూర్తి వశంలోవుంది. అతడికి సింహంతో వ్యాయామశాల్లో తోటి యోధులతో వ్యాయామాన్ని అభ్యాసంచేసుకున్నట్టుగా వుంది.

సింహం ప్రాణాలు విడిచింది. సింహం చనిపోయినా చాలా విలువ చేస్తుంది. అది తుదిశ్వాసల్ని విడవగానే అందరూ తమ తమ వరలనుండి కత్తుల్ని తీసుకున్నారు సింహ చర్మాన్ని వొలచడానికి! అక్కడున్న వాళ్ళందరికీ చర్మాలు వొలచడంలో గొప్ప నేర్పరితనంవుంది. ఎన్నో వృషభాలకు, కోడెలకు, లేళ్ళకు – చర్మాలను వొలచివున్నారు. చర్మం వారికి ఆసనాలుగానూ, వసనాలుగానూ ఉపయోగపడుతుంది. సింహ చర్మం పులి చర్మంకంటేకూడా గొప్పదిగా భావింపబడుతుంది. ఈ సింహం ఆకారంలో చాలా పెద్దదికావడంవలన చర్మంకూడా బాగా విశాలంగా వస్తుంది. మాంసాన్ని, ఎముకల్నీ తీసినా చర్మం చాలా బరువుగావుంది. చర్మాన్ని పణిగ్రామపు దాసులచేతికి ఇచ్చి రాజకుమారులు తాము గుర్రాలమీద ఎక్కారు.

రాత్రి ఒక జాము గడిచేసరికి అందరూ పణిగ్రామాన్ని చేరుకున్నారు. ఇది స్థిరమైన సంపూర్ణమైన గ్రామం. గ్రామపెద్ద నివాసం ఇటుకరాతితో కట్టబడిన మూడంతస్తుల భవనం. ఇతరుల ఇండ్లు కొన్ని ఇటుకరాతివీ వున్నాయి. కొన్ని మట్టిగోడలవీ వున్నాయి. పై కప్పుల్ని చెక్క, మట్టితో నిర్మించుకున్నారు. (మట్టిమిద్దెల్లా!) ఆర్యుల నిషేధాన్ని లెక్కచేయకుండా

పూరికి చివరివరసలోవున్న ఇండ్లను ఒకదాని కొకటి ఆనించి కట్టుకున్నారు. అలా కట్టుకోవడంవలన శత్రుభయం వుండదు! గ్రామానికి ముఖ్యద్వారం కూడా వుంది. ఈ రక్షణ చర్యలవల్ల సాధారణమైన దొంగల్ని ఆపవచ్చు గానీ, ఆర్యులను ఆపగలగడం మాత్రం అసంభవం! ఈ ఏర్పాట్లన్నీ ఆర్యులకు గడ్డిపోచల్తో సమానం.

గ్రామపెద్ద, ఆర్యరాజకుమారులకు ఏదైనా ప్రమాదం సంభవించిందేమోనని భయపడ్డాడు. వారికేదైనా ప్రమాదం జరిగితే అందుకు తను కారణుడని ఆర్యులు ఎక్కడ భావిస్తారోనని గ్రామపెద్ద ప్రాణాలు గుప్పెట్లో పెట్టు కూర్చున్నాడు. ఈ రాజకుమారుల్లో భరతజనపు భావి మహారాజు దివోదాసు, సప్తసింధు ఆర్యుల్లోకే మహావీరుడైన వర్ధ్యశ్వుడి కొడుకు త్రసదస్యుడు వున్నారు! వాళ్ళకేదయినా ప్రమాదం జరిగితే, తమ గ్రామం సర్వనాశనమవడమేగాని మరో దీరు వుంటుందా? గ్రామపెద్ద విషణ్ణ వదనుడై రాజకుమార్ని వెతుక్కురావడానికి తన మనుషుల్ని పంపించబోతూండగా. ఊరి కుక్కలు అరిచాయి. కుక్కలు గ్రామపు ఉత్తర దిశన గుమిగూడి అరుస్తూండడంవల్ల, గ్రామ పెద్దకూడా కొంతమంది పరివారంతో అటువైపుకు వెళ్ళాడు. ఇతడు వెళ్ళేసరికి ఆర్యరాజకుమారులు అక్కడికి వచ్చేశారు. వాళ్ళవెంట సింహచర్మంగూడా వుంది. రాజకుమారులందరూ అక్షత శరీరులుగా తిరిగి వచ్చారు. గ్రామపెద్ద తన ఆనందాన్ని వ్యక్తపరుస్తూ. దేవతలకు నమస్కరించాడు.

పణులకు ఆర్యుల యుద్ధ కౌశలాన్ని గురించి వేరే చెప్పవలసిన పనిలేదు. కానీ దివోదాసుయొక్క సఫలతనుచూసి గ్రామపెద్ద ఆశ్చర్యాన్వితుడయ్యాడు. రాత్రి అయ్యాక గ్రామపెద్ద తన వద్దవున్న 'సుర'లో కల్లా అత్యుత్తమ మైనదాన్నితెచ్చి ఆర్య రాజకుమారులకు ఇచ్చాడు. అయితే ఆర్యులు తమ విజయాన్ని పురస్కరించుకుని ఇంద్రుణ్ణి స్తుతించదలచారు. అందుకు సోమరసం ముఖ్యం. వృషభం ఎటూ వుండనేవుంది. సింహం చంపిన వృషభాన్ని హవనీయంగా, ఇంద్రుడి కా రాత్రి సోమపాన్ని అర్పించారు.

భరద్వాజ ఋషి వద్ద దివోదాసు తన పరాక్రమాన్ని గురించి అధికంగా ఏమీ చెప్పుకోలేదు. కానీ, అతడి స్నేహితుల మాత్రం అతడి పరాక్ర

..న్ని ఏ మాత్రమూ క్లుప్తీకరించకుండా చెప్పేశారు. అశ్వోత్సవంలో ఘన విజయాన్ని సాధించిన ఆర్య వీరుడు ఎలాటి కష్టంలోనూ, క్లిష్టస్థితిలోనూ తన మానసిక స్థయిర్యాన్ని గోల్పోడు! భుజయుడికి, కుత్సు ఆయునేయుడికి దివోదాసు పొందిన సఫలత తమదిగానే వుంది. భరద్వాజ కులంలోని స్త్రీ పురుషులందరికీ సింహ సంహారంలో అతడుచూపిన పరాక్రమాన్ని సజీవంగా వర్ణించి చెప్పారు.

భరద్వాజ ఋషి తన శిష్యుల్లో, తమ పూర్వీకుల పౌరుష పరాక్రమాల్ని కలిగించాలని అభిలషిస్తున్నాడు. మేధావులైన శిష్యులుకూడా, ప్రశ్నలు వేసి జ్ఞానాన్ని అభివృద్ధి చేసుకోవడంలో ఎలాటి సంశయాన్నీ పుంచుకోరు. ఒకమాటు కుత్సు ఆయునేయు డిలా అడిగాడు: "ఆర్యుల ఉత్పత్తి ఎలా జరిగింది?"

ఋషి "ఆర్యులు ఇంద్రుడి నుండి పుట్టారు: ఇంద్రుడికి అందరికంటే ప్రియ పుత్రులు ఆర్యులు, ఇంద్రుడికి అనన్యభక్తులు ఆర్యులు, పణులు. కిరాతులు, నిషాదులు – వీళ్ళూ ఇంద్రుడి సంతతే! ఐతే, వీళ్ళు కృతఘ్నులు, ఇంద్రుణ్ణి ద్వేషిస్తారు. అందుకనే ఇంద్రుడికి వీళ్ళు అంతగా నచ్చరు!" అని సమాధానం ఇచ్చాడు.

"మన వెంట్రుకలు బంగారు రంగులో వున్నాయి. మన కండ్లు కూడా నీలంగానో, బంగారు రంగులోనో వున్నాయి. మన శరీరాలు అధిక బలయుతంగానూ, పొడవుగానూ వుంటాయి. ఇదంతా ఇంద్రుడి కృప అన మనమనుకుంటున్నాము. మరి ఇతర్లు రంగులో మనకు భిన్నంగా వున్నారేం?" ఈ మాటు భుజయు డడిగాడు.

"ఇదీ ఇంద్రుడి మహిమే! పణులను. చామన చాయలోనూ, నిషాదులను బొగ్గులాటి నల్లని రంగులోను, కిరాతకులను చట్టి ముక్కువాళ్ళగా, మీసాలూ గడ్డాలూ మొలవని వాళ్ళగా పుట్టించాడు. ఈ విధంగా రంగుద్వారా తన భక్తుల్నీ కానివాళ్ళనీ వేరుచేయడం ఇంద్రుడి ఆశయం!"

"ఒకే కాలంలో, ఒకే దేశంలో ఇంద్రుడు నాలుగు జాతుల్నీ సృజించాడా?"

ఋషి: "దీన్ని గురించి స్పష్టంగా చెప్పడం కష్టం. ఆర్యులు పశ్చిమం నుండి సప్తసింధులోకి వ్యాపించారు. నిషాదులూ, కిరాతకులూ నిమ్నశ్రేణి

మనుష్యులు. వీరు మనువు సంతానం కామకనక మనుష్యులని అంటానికి కూడా వీలులేదు. ఈ రెండు జాతులూ అడవుల్లోనూ కొండల్లోనూ నివసిస్తుంటాయి. వేట వీరి జీవనానికి ముఖ్యమైన ఆధారం. వీరు ఇప్పటికీ రాతి ఆయుధాలనే ఉపయోగిస్తున్నారు" అన్నాడు.

"పణులు ఇలాటివారు కాదే!" దివోదాసు అన్నాడు.

"పణులు మనకంటే ఏ విషయంలోనూ తక్కువకాదు. కానీ, ఇంద్రుడికి భక్తులు కాకపోవడం వలన, వారి భూములను ఇంద్రుడు మనకిచ్చాడు!"

"అయితే, ఆర్యులు రాకముందు, ఇక్కడ ఇంద్రుడికి యజ్ఞాలు జరిగేవి కాదంటావు?"

"అవును, కనుకనే ఇంద్రుడు ఆర్యుల ముఖ్యగణా లయిదింటినీ ఇక్కడికి పిలిపించాడు. పణులకూ ఆర్యులకూ ఘోరమైన సంఘర్షణలు జరిగాయి. మనువులాటి సేనాని దొరకడం ఆర్యుల అదృష్టం! కానీ, పణుల సేనాని విషశిప్రుడుకూడా కేవలం తీసివేయ వలసినవాడు కాదు. ఇంద్రుడే గనుక స్వయంగా వచ్చి యుద్ధం చేయకపోతే పణులను ఓడించడం అసంభవమే అయ్యేది. పణులకు పెద్దపెద్ద నగరా లున్నాయి. వారి వద్ద తీక్ష్ణమైన రాగిఖడ్గాలుకూడా వున్నాయి. అయితే మనలాటి గొప్ప యోధులు వారికి లేరు. సంఖ్యలో మాత్రం వారు మనకంటే అధికం!"

"యోధులు అధిక సంఖ్యలో వుండికూడా పరాజితులయ్యారా?" దివోదాసు అడిగాడు.

"ప్రతి యుద్ధంలోనూ ఇంద్రుడు మనకు బాసటగా నిలిచాడు. ఇంద్రుడి కృపవల్లనే మనకు అశ్వాలు లభించాయి. పణులకు అశ్వాలు లేవనే చెప్పాలి. మన ప్రతి యువకుడు పరాక్రమోపేతుడైన యోధుడు. అన్నిటినీ మించి మనకు మనువులాటి నాయకుడు దొరికాడు!"

"అన్నిటినీ మించి పణులు నగరవాసులయ్యారు. సుఖాలు మరిగారు. యుద్ధద్వేషులయ్యారు! వాళ్ళ పరాజయాలకు ఇదీ ఓ గొప్ప కారణమే!" అన్నాడు కుత్సుడు.

"అవును పణుల వినాశానికీ ఈ నగరవాసమూ ఓ కారణమయింది. కనుకనే, పణుల నగరాల నెన్నింటినో జయించినప్పటికీ మనం నగర

వాసులం కాలేదు. మనకు పౌరుషంతో నిండిన జీవితం యిష్టం. మనం గోవులనూ, అశ్వాలనూ, గొర్రెలనూ, మేకల్ని మేపుకుంటూ నదీతీరాల్లోనూ అడవుల్లోనూ చరిస్తూంటాము. మనం ఆయుధాలకు ఎన్నడూ తుప్పు పట్ట నీయం. మన స్త్రీపురుషులు కూడా సోమరులు, కేవల భోగలాలసులు కాకారు. సర్వకాలాల్లోనూ పరిశ్రమిస్తూంటాము, సోమరితనము, భోగలాలసత–ఇవిరెండు అంటువ్యాధుల్లాంటివి కనుకనే పణులను మనలోకి రానీయము. వారికీ మనకూ కలయికేలేదు.

"కలయికవలన మరి కూడా నష్టాలున్నాయా ?"

"ఎందుకులేవు ? చాలా నష్టాలున్నాయి ! వాళ్ళ కలయికనుండి ఎంత దూరంగా వుందామని ప్రయత్నించినా మనం వుండలేకపోతున్నాము. కలయిక (వర్ణసంకరం) ఏదోవైపునుంచి జరుగుతూనేవుంది. ఆర్యస్త్రీలు ఈ వర్ణసాంకర్యానికి ఏమాత్రమూ అవకాశాన్నీయడంలేదు. ఈ విషయంలో వారిని అభినందించకతప్పదు కాని ఆర్యపురుషులను ఈ విషయంలో ఎంత నిందించినా తప్పులేదు ! ఆర్యపురుషుల దోషంవల్లనే అనార్యుల్లో ఆర్యవర్ణ మిశ్రితాన్ని చూడగలగుతున్నాము "అనార్యస్త్రీకి జనించిన ఆర్యసంతానం అనార్యుల్లోనే వుంటుందికదా. అందువల్ల నష్టమేమిటి ?" అని మనమను కుంటున్నాము, కానీ, అలా అనుకోవడం చాలా పొరపాటు ! ఒకగణంలో కలిగిన ఇలాటి అనార్యసంతానం మరో ఆర్యగణంలోకివెళ్ళి, తన శరీరపు రంగునుచూపి ఆర్యుణ్ణంటుంది.: అంటుందని ఊహించడమేకాదు. అలా అన్న సందర్భాలుకూడా ఎన్నో వున్నాయి. కనుకనే ఆర్య అనార్య, లేక అనార్య ఆర్యస్త్రీ పురుషుల సంపర్కాన్ని ఎలాటి స్థితిలోనూ సహించరాదు!"

"కానీ, అనార్యదాసులు లేకపోతే మన పని ఒక్కక్షణం సాగదు గదా?" ఋజ్యాడడిగాడు.

"ఇదే మన దౌర్బల్యం. ఈ దౌర్బల్యం కారణంగానే ఆర్యులు భవిష్యత్తులో అనేకమైన ప్రమాదాల్ని ఎదుర్కోవలిసి వస్తుంది. అయితే, ఇంత మాత్రానికి మనం నిరాశపడరాదు. ఇంద్రుడు తన భక్తులయొక్క శుద్ధతనూ, శౌర్యాన్నీ ఎప్పుడూ రక్షిస్తూంటాడు. అతడు మనని అడుగడు గునా రక్షిస్తూనేవున్నాడు. పురూరవా ఐల్ సమయంలో పణులు కొంత తల ఎత్తారు. ఐతే, ఇంద్రుడి సాయంతో అతడు తక్షణం వాళ్ళను అణిచివేశాడు.

పురూరవా ఐల్ కొడుకు నహుషుడుకూడా గొప్పగా పరాక్రమాన్ని ప్రదర్శించాడు. అందువల్లే మానవుల్ని నహుష సంతానమనికూడా అంటారు. నహుషుడి పుత్రులయిన యయాతి. మాంధాతలు గొప్ప వీరులు, ఇంద్ర భక్తులు! కనుకనే వారి కీర్తి అజరామరంగా నిలిచిపోయింది!"

"అయితే ఆర్యులు ఏ మాత్రమూ నిరాశపడనవసరంలేదు. ఇంద్రుడు ఈనాటికీ ఆర్యులకు నాయకత్వం వహించడానికి సిద్ధంగావున్నాడు" దివోదాసు తృప్తిగా అనేశాడు.

* * *

ఇంద్రుడు ఆర్యులు తనపట్ల భక్తిరహితులుకావడాన్ని ఎన్నటికీ సహించడు. అలా అయిన క్షణాన వాళ్ళని ఏదోవిధంగా దండిస్తూంటాడు. దివోదాసుయొక్క ఋషికులవాసపు చివరి సంవత్సరం ఇంద్రుడు ఆర్యుల్ని ఘోరంగా దండించాడు. గ్రీష్మఋతువు ప్రథమ పాదంలో వుంది. సూర్యుడు ప్రచండంగా అగ్నిని వర్షిస్తున్నాడు. భరద్వాజ గ్రామాన్నానుకొని వున్న పొలాల్లోని యవపంటను కోశారు. ధాన్యం రాల్చుకోగా మిగిలిన గడ్డిని పశువులు మేయడం కూడా జరిగింది. విస్తృతంగా వ్యాపించిన పొలాలకు కొంచెం అవతల అరణ్యంలో గ్రీష్మం తన శక్తిని కొంతవరకూ గోల్పోయి సౌమ్యతను కనబరుస్తోంది. ఆకుపచ్చని పలాశ పత్రాలు సుందరంగా వున్నాయి. రావి, మర్రిలాంటి విశాల వృక్షాలు తమ నీడలతో ఎంత వేడిమిని తగ్గిస్తున్నాయి! మధ్యాహ్నసమయం పశువులు కడుపులనిండా మేత మేసి, చెట్లక్రింద పడుకుని నెమరు వేస్తున్నాయి. గోపాలకులు వాటి ప్రక్కనే నిశ్చితంగా పడుకుని విశ్రాంతి తీసుకుంటున్నారు. ఇక్కడ రాత్రిపూటే క్రూరజంతువుల భయం అంతగా వుండదు. ఇక పగటిపూట వాటిగురించిన ఆలోచనలకు తావెక్కడిది?

ఇంతలో గ్రామం వైపునుండి ప్రజల కోలాహలం వినిపించింది. అరణ్యానికి వెలుపలి భాగంలో దివోదాసు తన మిత్రులతో ఒకమామిడి చెట్టుక్రింద కూర్చునివున్నాడు. మామిడిపిందెలు ఆకు ఆకుకూ మధ్యలో వేలసంఖ్యలో వున్నాయి. ఆ సంవత్సరపు మామిడిపంటను గురించే చర్చ జరుగుతోంది. పండ్లల్లో తీయదనాన్ని అభివృద్ధి చేసే కార్యక్రమం అప్పటి

కింకా మానవుడు అభ్యసించలేదు. ప్రకృతి సహజంగా ఏర్పరచే తీపేగాని, మానవుడు తనవైపునుండి పండ్లల్లో కల్పించే తీపి ఏమీ వుండదు.

కోలాహలం చెవుల బడగానే వారిదృష్టి ఊరివైపు మళ్ళింది. ఊరి ప్రజలందరూ నదివైపు చూడడం గమనించి, దివోదాసు ప్రభృతులుకూడా నదివైపు తమదృష్టిని మరల్చారు. ఆర్జీకియా ప్రవాహం ఉదయంకంటే విస్తృతమైంది, పల్లంలోవున్న గోశాలలో అప్పటికే నీళ్ళు ప్రవేశించాయి. ఇక ఆలోచనలకూ అభిప్రాయాలకూ సమయం లేదు. దివోదాసు తన మిత్రుల్ని తీసుకుని గ్రామంవైపు పరుగెత్తాడు.

గ్రామాన్ని సమీపించగానే ఆవులూ, దూడలూ అతి కరుణాభరిత మైన స్వరంలో అరవడం వినిపించింది. గోశాలల్లో నీరు అంతకంతకూ నిండుతోంది. ఆవులూ, దూడలూ ఈదుతూ అరుస్తున్నాయి. చెక్కగోడలు చాలా ఎత్తుగా వున్నాయి. ఆ గోడలను దాటి సురక్షిత ప్రదేశానికి వెళ్ళడం పశువులకు చేతకావడం లేదు. ప్రజలు తమతమ ఇండ్లలోనుండి సామాన్లను సురక్షిత స్థానాలకు చేర్చుకుంటున్నారు. నీరు తీవ్రవేగంతో అభివృద్ధవు తోంది. దివోదాసు, అతడి మిత్రులూ త్రాళ్ళను తెంపి గోశాలల తలుపుల్ని తెరిచేశారు. పశువులు శాలల్లోనుండి బయటికి వచ్చేస్తున్నాయి. కానీ, అప్పటికి సగంగ్రామం నీటిలో మునిగిపోయింది. ఋషియొక్క పర్ణశాల కూడా నీటి మయమైంది. ఆర్యుల ఖాద్య పదార్థాల్లో యవలూ, పిండి మాత్రమే నష్టమయ్యాయి, పశువులన్నీ సలక్షణంగా బయట పడ్డాయి. కాకపోతే, ఇండ్లలో నుండి, వస్త్రాల్నీపాత్రల్ని అన్య అవసరమైన సామాన్లనూ బయటికి తెచ్చుకునే సమయం దొరకలేదు. మొదట సూచన ప్రాయంగానైనా ఈ ప్రమాదాన్ని గురించి గ్రామవాసులకు తెలియలేదు. గ్రీష్మంలో ఇలా నీటి ఉపద్రవం సంభవిస్తుందని అసలు వారు భావించనే లేదు. నదీప్రవాహం విస్తృతమవడాన్ని ఉదయమే చూచారు. అయినా నిర్లక్ష్యంచేసి ఊరుకున్నారేగానీ ఇంత ప్రమాదాన్ని తెచ్చిపెడుతుందని తలచలేదు. కనుకనే ప్రవాహం మధ్యాహ్నానికల్లా భయంకర రూపాన్ని దాల్చి ప్రమాదస్థితిని తెచ్చిపెట్టింది. ఇక నప్పుడు ప్రజలకు తమ వస్తువుల్ని చేరవేసుకునే అవకాశమే లేకపోయింది. ప్రజలు దిగ్భ్రాంతులూ, భయ భ్రాంతులూ అయిపోయారు. గోశాలల తలుపుల్ని తెరచి పశువులను

బయటికి త్రోలే మతిఅయినా లేదువాళ్ళకు. తన ప్రాణాలను తానే రక్షించుకో లేని స్థితిలో మానవుడు తన ఆశ్రితములైన పశువుల్ని గురించి "ఆలో చిస్తాడు? గ్రామంలోని మానవులు ప్రాణాలను అరచేతుల్లో పెట్టుకుని పరుగెత్తసాగారు. నదీ ప్రవాహం కొండచిలువలా మానవుల వెంటాడు తోంది. ఆ మధ్యాహ్న సమయానికి ప్రవాహం ఏ వర్షాకాలంలోనూ లేనంత ఉధృతరూపాన్ని దాల్చింది.

మట్టిరంగు నీటి ప్రవాహంలో ఎన్నోచెట్లూ, ఇండ్లూ కొట్టుకు పోతున్నాయి. కొన్నిటిమీద మానవులుకూడా కూర్చునివున్నారు. ఎన్నో పశు కళేబరాలు కూడా మునుగుతూ. తేల్తూ పోతున్నాయి. బ్రతికివున్న పశువులు ఈదుతూ ప్రవాహంనుండి బయటపడ్డానికి ప్రయత్నిస్తోన్నాయి. భయంకరమైన దృశ్యం! ప్రజలు ఆశలు వదులుకుని క్రియారహితులై వుండిపోయారు. ఎంతోమంది ప్రజలు చెట్లల్లో కూర్చునివున్నారు. అయినా వాళ్ళూ అశాంతితోనే భయంగానే వున్నారు. ప్రవాహం ఏ క్షణాన్నయినా వాళ్ళనూ తనలో లీనం చేసుకోవచ్చు! భరద్వాజ ఋషి ఒక విశాలమైన వటవృక్షంమీద కూర్చుని ఈ మొత్తం దృశ్యాన్ని చూస్తూన్నాడు. అదే వట వృక్షంమీద ఇంకా అనేకమంది శిష్యులూ, ఆర్య స్త్రీ పురుషులూ కూర్చుని రక్షణను పొందుతున్నారు. వారికి మానసిక స్థైర్యాన్ని కలిగించడం ఋషి కర్తవ్యం:

ఋషి ఇలా అన్నాడు:

"ఆర్యులు తమ ప్రాచీన ధర్మాన్ని విస్మరించారు. నిత్యకర్మల్లో అల సత్వాన్ని ప్రదర్శిస్తున్నారు. ఇందుకు ఇంద్రుడు తప్పక ఆర్యుల్ని శిక్షిస్తాడు. కనుకనే కాలంకాని కాలంలో జలప్రళయ మొచ్చింది. గ్రీష్మఋతువు. ఆకాశం నీలంగా నిరభ్రంగా వుంది. ఈ సమయంలో ఈ ఉధృత జలప్రవాహ మేమిటి? ఆర్యుల అపరాధానికి? దండనకుగాను ఇంద్రుడు విశాపనదిని పంపించాడు: ఆర్యులు ఇప్పటికయినా కండ్లు తెరవడం మంచిది!"



# 5. దివోదాసు మహారాజు

"అగ్ని నరనామీ వృత్రహా పురుచేతన దివోదాసస్య సత్పతిః"

(క్రీ. పూ. 1195)

దివోదాసు ఇరవై ఏళ్ళయువకు డయ్యాడు. భరద్వాజఋషివద్ద విద్యలన్నిటినీ అభ్యసించాడు. ఋషియొక్క జ్యేష్ఠపుత్రుడు గర్గుడూ తండ్రికి తగిన కొడుకే. శిష్యుడూ, కొడుకూ - వీరిద్దర్లో ఋషికి ఎవరిమీద అధికప్రేమ? అనేది చెప్పడం కష్టం! ఋషి బ్రహ్మద్రష్ట. దేవతల సాక్షాత్కారం పొందినవాడు. అతడు కేవలం పురోహితుడే కాదు, యుద్ధ విద్యలోనూ ఆరితేరినవాడు. అంతేకాకుండా, ఆర్యుల ఉన్నత ఆదర్శాలకు, ఆశయాలకు ప్రతీకలాటివాడు. ఆర్యుల్లో పరస్పరం విద్వేషాలు పెచ్చు రేగుతున్నాయి. ఈ పరస్పర ద్వేషాల్తో ఒకరకంగా ఆర్యజాతే శిథిల మౌతూన్నది. ఆర్యుల్లోని ఈ బలహీనత కారణంగా శత్రువులు తిరిగి తల ఎత్తుతున్నారు. ఆర్యుల అధికారాన్నీ, ప్రభుతనూ స్థిరంగా నిలపడానికి, అఖండంగా వుంచడానికీ వర్ధ్యశ్వుడు కొంత ప్రయత్నం చేశాడు. అయితే, అతడి ప్రయత్నము అసంపూర్తిగానే వుంది. దాన్ని పరిపూర్తికి తీసుకు రావడం అవసరం! ఆర్యులకు లొంగిరాని శత్రువులుకూడా చాలామంది వున్నారు. వారినుండి ఏనాటికయినా ప్రమాదం సంభవించవచ్చు!

భరద్వాజఋషి నిరంతరం ఆర్యుల స్థితిగతుల్ని గురించి చింతిస్తూండే వాడు. ఆర్యుల్లో ఐక్యతను స్థాపించడాన్ని గురించి, వారి బలాన్ని, పౌరుషాన్ని అభివృద్ధి పరచడాన్ని గురించి అపరాజితులుగా వున్న శత్రువుల గురించి శిష్యులకు చెప్తూండేవాడు. యువకులైన శిష్యుల్లో ఉగ్రభావాల్ని నింపేవాడు. దివోదాసు, భుజ్యు, కుత్సు, కురువిందుడూలాటి తరుణులైన శిష్యులు తన ఆశయాలను తప్పక నిర్వహిస్తారని ఋషికి గొప్ప విశ్వాసం!

ఈ విధంగా ఋషి. అతడి శిష్యులూ తమ ఆశల్ని. ఆశయాలనూ ప్రగాఢంచేసుకొంటున్న సమయంలో ఒక అశ్వారోహి ఋషి కులానికి వచ్చాడు. అత డో విషాద భరితమైన సమాచారాన్ని వినిపించాడు. "వధ్ర్యశ్వుడు పితరుల వద్దకు వెళ్ళిపోయాడు!" అని చెప్పాడు. ఋషికులం అంతట్లోనూ విషాదం వ్యాపించింది. దివోదాసు సహజంగానే మంచి ధైర్య స్థైర్యాలు కలవాడు. కాని అత్యంత ప్రియపాత్రుడైన తండ్రిని శాశ్వతంగా కోల్పోయాడు. దుఃఖం కారుచీకటిలా అతడి మేధస్సు నావహించింది. ఋషి ధైర్య వచనాలను చెప్పాడు : "వధ్ర్యశ్వుడు వయస్సులో నాకంటె చిన్నవాడే అయినా, ఎటూ వృద్ధుడైపోయాడు. ఇవ్వాళ కాకపోతే రేపు, రేపు కాకపోతే ఎల్లుండి, ఎప్పుడో ఒకప్పుడు ఈ లోకాన్ని విడిచి పితరుల్లో చేరవల్సినవాడనూడు. ఐతే నీ తండ్రి, మనువు, మాంధాతల్లాటి ఆర్యవీరులు చేసిన ఘనకార్యాలకు మెరుగులు దిద్దాడు. మొత్తం సప్తసింధు, ఈనాడు వారి ప్రతిభనూ యోగ్యతనూ ప్రశంసిస్తూంది. వధ్ర్యశ్వుడు ఈ సప్తసింధుకు నీలాటి కొడుకును ప్రసాదించాడు. తండ్రిమృత్యువుయొక్క దుఃఖం కొద్ది రోజుల్లో పోతుంది. నీవు నీ కర్తవ్యాన్ని గుర్తుంచుకో. తండ్రివిడిచివెళ్ళిన కార్యభారాన్ని వహించడానికి సంసిద్ధుడివికా! తృత్సు-భరతగణాలే కాదు, సమస్త ఆర్య గణాలూ ఈ కష్టకాలంలో నీ పై సానుభూతిని ప్రదర్శిస్తున్నాయి. తమ భవిష్యత్తుకు సంబంధించిన ఆశల్ని నీపైనే నిలుపుతున్నాయి. తృత్సుగణపు వృద్ధులు నిన్ను శీఘ్రంగా తీసుకురమ్మని కబురంపారు. నీతోపాటు నేనూ వస్తున్నాను. నీ కక్కడ అభిషేక మహోత్సవం జరుగుతుంది!"

దివోదాసుయొక్క దుఃఖాన్ని పంచుకోవడానికి గర్గు, భుజు, కుత్సు, కురువిందుడు మొదలుగాగల గురుపుత్రులు, గురుభ్రాతృలున్నారు. వారి ఓదార్పులతో కొంత దుఃఖశమనం జరిగింది. గురుపత్ని దివోదాసును ఎప్పుడూ

తన కొడుకులా చూసుకునేది, అతడిపై ప్రేమాదరాలను ప్రదర్శిస్తూండేది. ప్రత్యేకమైన అభిమానంతో ప్రవర్తించేది. అందుక్కారణం ఆమె భరత గణపుకన్య. వర్ధ్యశ్వుడి మృత్యువుకు దివోదాసుకంటె గురుపత్ని ఎక్కువగా దుఃఖించింది. మరునాడు భరతగణంవద్దకు వెళ్ళడానికి భరద్వాజఋషి నిశ్చయంచేశాడు.

ఋషి, ఋషిపత్ని కొడుకు కోడలూ- అందరూ భరతగణం వద్దకు బయల్దేరారు. వీరేకాక, అనేకమందిశిష్యులూ, భరద్వాజకులంలోని ఇతరులూ ప్రస్థానాన్ని సాగించారు. వారితోపాటు వారి పశువులూ కదిలాయి. పశువుల పాలనకు వందలసంఖ్యలో దాసదాసీజనాలూ కదిలారు. భరతగణం నిశ్చిత మైన ప్రదేశాల్లోనే నివశిస్తూంటుంది. అయితే పణుల్లా స్థిరమైన గ్రామాల్ని, నగరాలనూ నిర్మించుకోరు. భరతగణం సాధారణంగా ఇలాటి ప్రత్యేకమైన సమారోహాలను పరుష్ణీనదివద్దనే జరుపుకుంటుంది. వర్ధ్యశ్వుడు అశ్వోత్సవం జరిగిన ప్రదేశంలోనే చనిపోయాడు. భరద్వాజ ఆశ్రమంనుండి పరుష్ణి తీరానికి వెళ్ళడానికి ఒకరోజు పడుతుంది. భరద్వాజఋషి దివోదాసు మొదలైనవారిని వెంటతీసుకుని మరునటిరోజు పరుష్ణీతీరాన్ని చేరాడు.

పౌరవి అప్పటివరకూ ఎలాగో దుఃఖాన్ని అణచుకుంది కాని దివో దాసును చూడగానే, ఆమె దుఃఖం కట్టలు తెంచుకుంది. దివోదాసును కౌగ లించుకుని వెక్కివెక్కి ఏడ్చింది. ఋషి ఇలా అనునయించాడు : "శవాన్ని దహనం చేయడం ముఖ్యం! అంతకంటెకూడా ముఖ్యమైంది దివోదాసుకు రాజ్యాభిషేకం చేయడం! నీవే ఇలా ధైర్యాన్నికోల్పోయి విల పిస్తే, తక్షణ కర్తవ్యాలను ఎవరు నిర్వహిస్తారు?" అన్నాడు.

ఈ ప్రదేశంలోనే ఒకప్పుడు సప్తసింధులో సమస్తగణాలూ, శాఖలూ కలిసి చరించాయి. అశ్వోత్సవంలో ఆర్యులందరూ మహోత్సాహంతో పాల్గొన్నారు. అందరూ వర్ధ్యశ్వుణ్ణి గౌరవించారు. అభిమానించారు. అయితే, కొందరు ఈర్ష్యాళువులుకూడా వున్నారు. వర్ధ్యశ్వుడు తమకంటె అభివృద్ధి లోకి పోయాన్నందుకు కనుబెర్రచేసే ఆర్యరాజులుకూడా వున్నారు.

పరుష్ణీతీరాన ఒక విశాలమైన చితిని పేర్చారు. దివోదాసూ, మరి కొందరు ఆర్యరాజులూ వర్ధ్యశ్వుడి శవాన్నితెచ్చి చితిమీద వుంచారు. దివో

దాసు తలక్రింద నిప్పుపెట్టాడు. భరద్వాజఋషి ఉచ్చైస్స్వరంలో శ్లోకాల్ని చదివాడు.

"మన పూర్వులు వెళ్ళిన ప్రాచీన బాటల ననుసరించి మన పితరుల దగ్గరకు వెళ్లు! (అక్కడ) యముణ్ణీ, వరుణుణ్ణీ చూస్తావు. ఓ యముడా! రక్షించేవాడా! పథగాములైన మానవుల మంచిచెడ్డల్ని చూసే, నీ వద్దనున్న నాలుగుకండ్ల కుక్కల్ని రెంటింటినీ వీరి (చచ్చినవారి) రక్షణకోసం పంపించు! వీరిని ఆరోగ్య వంతులను చేయుము!"

కొద్ది క్షణాల్లోనే వర్ధ్యశ్వుని శరీరం భస్మమైంది. కానీ. అతడి కీర్తి అజరామరంగా నిలచిపోయింది!

* * *

ప్రజలు దివోదాసుయొక్క రాజ్యాభిషేకపు కార్యక్రమాల్లో మునిగి ఉన్నారు. పౌరవి కొద్దిరోజుల క్రితమే ఘోరమైన విషాదాన్ననుభ వించింది. ఇప్పుడు మహోన్నతమైన ఆనందాన్ని అనుభవించ పోతోంది. భారమూ బాధ్యతలుకూడా పౌరవికే ఎక్కువగా వున్నాయి ఇప్పుడు! వర్ధ్యశ్వుడుండగా పరిపాలనకు సంబంధించిన భారాన్ని ఎక్కువపాళ్ళు అతడే మోస్తూండే వాడు. ఇప్పుడు నవతరుణుడు, అనుభవ శూన్యుడూ అయిన కొడుకు అభి షిక్తుడౌతున్నాడు. అలాటి కొడుకుచేత సక్రమమైన మార్గంలో పరిపాలనను నిర్వహింపచేసే భారమూ, బాధ్యత ఆమెమీదే వున్నాయి! అయితే, భర ద్వాజుడు సమర్థుడైన ఋషి. అతడు మార్గ దర్శకుడు కావడం వలన ఒక రకంగా అందరూ ధైర్యంగా, శాంతంగా వున్నారు. ఋషి మొత్తం సప్త సింధులోని ఆర్య గణాలకు వర్ధ్యశ్వుడి మృత్యువును గురించి, దివోదాసు యొక్క రాజ్యాభిషేకాన్ని గురించి సమాచారాన్ని పంపించాడు. అందరికి ఆహ్వానాలను పంపాడు. ఇలాంటి స్థితిలో పణులే అయితే ఆహ్వాన పత్రం వ్రాసి పంపించేవారు. తప్పనిసరిగా వ్రాతను ఆశ్రయించి అత్య ధిక సంఖ్యాకులకు తమ ఆశయాన్ని తెలియచేసేవారు. కానీ 'వ్రాత' అనేది పణులు ఆవిష్కరించింది కావడంవలన, ఆర్యులు 'వ్రాత' ను ఘోరంగా నిరసిస్తారు. ఒక్క 'వ్రాత'నే కాదు, పణులు ఆవిష్కరించిన అనేక నూతన విషయాలను (కేవలం అవి పణులద్వారా ఆవిష్కరించ

బడినవి కావడం వలన) ఆర్యులు నిరసిస్తుంటారు. భరద్వాజఋషి తన సందేశాన్ని ముఖతా పంపించాడు. సందేశ వాహకులు తీవ్రగాములైన అశ్వాలను అధిరోహించి ప్రపంచపు నాలుగు చెరుగులకు పరుగెత్తారు. ఒకడు, పశ్చిమంలోని పక్తగణం గాంధార గణంవైపుకుపరుగెత్తితే, మరొకడు తూర్పున వున్న వశిష్ట-కుశిక గణాలవైపుకు దౌడుతీశాడు. తూర్పున నున్న వశిష్టకుశిక జనాలకు నాయకుడు విశ్వామిత్రుడు. తరుణ వయస్కుడు. అతడికీ నిమంత్రణ సందేశాన్ని పంపించారు.

వసంతఋతువు చివరిరోజులు. గ్రీష్మం ప్రారంభం కాలేదు. ప్రకృతి మనోహరంగావుంది. ఆమంత్రులకు ప్రకృతి సంబంధమైన అభ్యంతరాలేమీ లేవు. పరుష్ణీతీరపు అరణ్యాలు మళ్ళీ ఒకసారి మానవస్వరాలతో ప్రతిధ్వనించాయి. పశువులు చరించసాగాయి. మానవభయంవలన క్రూర జంతువులు దూరంగా వెళ్ళిపోయాయి. పౌరవి అతిధుల సత్కారంలో తన సంపదను నీళ్ళలా ఖర్చుపెట్టిం. ఉదయాన్నే ప్రతిదేరాముందూరా కలశాలతో సోమరసాన్ని, కుండల్లో మధువునూ, క్షీరాలనూ పంపుతూండేది. ఉదయ, మధ్యాహ్న, సాయం సమయాల్లో ప్రజ్వలితుడైన అగ్నిహోత్రుడికివర్ధ్యశ్వుడి తరపునలేత కోడెదూడల మాంసాన్ని ఆహుతిచ్చేవారు. త్రికాలాల్లోనూ అత్యధికంగా సోమపానం చేసేవారు. మానవుడు ఎంత చిత్రమైన జీవో? క్షణం దుఃఖం, క్షణం ఆనందం! ఆత్మీయుడి దుఃఖంలో కార్చిన విషాదాశ్రువుల చారలైనా ఇంకా ఇంకలేదు. అప్పుడే ఆనందం ముప్పిరిగొన్నది. ప్రజలు ఆనందోత్సాహాల్లో తన్మయులౌతూన్నారు!

అయితే, అందరు అతిధుల విషయంలోనూ అలా అనుకోవడానికి వీలులేదు. కొందరు అతిధులు సహజమైన ఉత్సుకతను కూడా కనబరచడం లేదు. దివోదాసుకు మేనమామ అయిన పురుకుత్సుడు చాలా అన్యమనస్కంగా, అయిష్టంగా అభిషేకోత్సవానికి వచ్చాడు. అందుక్కారణం వర్ధ్యశ్వుడు తనకు పోటీదారుగా తయారు కావడమే. పురుకుత్సుడు పురుగణ: ఉపశాఖలకేకాక, మొత్తం ఆర్యగణాల్లోకే ఓ గొప్ప పలుకుబడికల వ్యక్తి అలాటి తనకు వర్ధ్యశ్వుడు పోటీదారయ్యాడు. మొత్తం ఆర్యగణాలకు తనూ ఓ ప్రముఖ వ్యక్తయ్యాడు. ఇది పురుకుత్సుడు సహించలేని విషయం. వర్ధ్యశ్వుడు విడిచివెళ్ళిన స్థానాన్ని దివోదాసు ఆక్రమించబోతున్నాడు.

దివోదాసు తనకు మేనల్లుదే అయినా ఇది సహింపరాని విషయంగానే తలు స్తున్నాడు పురుకుత్సుడు. అయితే, అతడి కొడుకు త్రసదస్యును మాత్రం అలా తలచడం లేదు. త్రసదస్యుడు అహర్నిశలూ తన బుల్లి బావ వెంట వుండి అతడికి అన్ని విధాల సహకరిస్తున్నాడు.

ఆ రోజు అభిషేకోత్సవం జరుగుతుంది. ప్రాతః వందనం తరువాత ముఖ్య ఘట్టం జరిగింది. ఒక కాష్ఠ ఫలకా న్నొకదా న్ని వేశారు. ఆర్యగణాలు తమ తమ నదుల్లోని పవిత్ర జలాలను రాగి కలశాల్లో వెంట తీసుకుని వచ్చాయి. సప్త సింధువుల్లోని (నదుల్లోని) పవిత్ర జలాలతోటే దివోదాసుకు అభిషేకం చేశారు. ఈ అభిషేకాన్ని ఆర్య రాజులు అందరూ ఒకరి తరువాత ఒకరుగా జరిపారు. అనంతరం దివో దాసుకు అధోవస్త్రాన్నీ, చర్మకంచుకాన్నీ, ఉష్ణీషాన్నీ, (తలగుడ్డను) ధరింపచేశారు. ఎత్తయిన వేదిక నొకదాన్ని ఏర్పరచారు. దానిమీద క్రొత్త వృషభ చర్మాన్ని పరచారు. భరద్వాజఋషి, దివోదాసును తీసుకుపోయి వృషభ చర్మంమీద కూర్చోపెట్టాడు అతడి చేతికి పలాశ దండాన్నొక దాన్నిచ్చి:

"నేను నిన్ను (ఇక్కడికి) తీసుకువచ్చాను. (దేశంలోకి) జొచ్చుకుపో స్థిరంగా, ధృవంగా వుండిపో ! ప్రజ లందరూ నిన్నే కోరాలి, నీ రాష్ట్రం (రాజ్యం) భ్రష్టంకారాదు. !

ఇక్కడేవుండు. పర్వతంలా ధృవంగావుండు. భ్యుతుడివికావద్దు. ఇంద్రు డిలా ధృవంగావుండి. ఈ రాష్ట్రాన్ని పాలించు ॥2॥

"ధృవమై హవనీయంవలన ఇంద్రుడు ధృవత్వాన్ని స్థాపించాడు. దానినుండే సోమరసం మాట్లాడాలి, బ్రాహ్మణస్పతికూడా (పలకాలి) ॥3॥

"ద్యొలోకం ధృవంగా వుంది. ఈ పృధ్వికూడా ధృవంగానే వుంది. పర్వతం ధృవంగా వుంది. జగత్తంతా ధృవంగా వుంది. ఈ రాజు (దివోదాసు) కూడా ధృవంగా వుండాలి ॥4॥

"ఇంద్రుడు, అగ్ని, వరుణుడు, బృహస్పతి — వీరందరూ ధృవంగా వున్నారు. వీరు ఈ రాష్ట్రాన్ని ధరింతురు గాక ! ॥5॥

ధృవమైన హవనీయంతో ధృవమైన సోమరసాన్ని కలుపుతున్నారు.

ఇంద్రుడు నీ ప్రజల్ని ఐక్యత కలవారిగా, పన్ను చెల్లించేవారిగా చేయు గాక ! ॥6॥ (ఋక్కు 10-173)

దివోదాసు సమస్త ఆర్యప్రజల సమ్ముఖాన క్రింది శపథాన్ని వల్లించాడు. "ప్రజలే రాజును చేస్తారు. వారి సహాయం వలనే అతడు స్థిరంగా వుండ గలుగుతాడు!"

తరువాత ప్రజలు ఈ క్రొత్త రాజుకు తమయొక్క శుభాకాంక్షల్ని తెల్పారు. ప్రథమంగా శుభాకాంక్షల్ని తెల్పిన వాడు పురుకుత్సుడు. అతడు తన మేనల్లుడికి శుభశాంతులు లభ్యం కావాలని వాంఛిస్తూ "ప్రత్యేకమైన పక్షపాతం వలన నేను దివోదాసును ప్రశంసించడంలేదు. అతడు తన తండ్రి చేసిన యజ్ఞాల్ని ఇంకాకూడా అభివృద్ధి చేస్తాడు. అయితే, నేను దివోదాసుచేసిన అభివృద్ధిని చూడడానికి వుంటానో వుండవో చెప్పలేముకదా! కానీ, నా కొడుకు త్రసదస్యుడికీ దివోదాసుకీ మధ్యవున్న ప్రేమ భ్రాతృ ప్రేమకంటెకూడా అధికమైంది. ఇది చాలా హర్షించదగిన విషయం!" అన్నాడు.

వశిష్టుడు, విశ్వామిత్రుడు - మొదలుగాగల పురుగణపు ఉపశాఖల నాయకులందరూ తమ శుభాకాంక్షలను తెలియచేశాక, అన్యఆర్యజనాల నాయకులుకూడా తమ హృదయోద్గారాలను తెలియచేశారు. యదుగణం, తుర్వశ గణంకూడా తమ భావాలను వ్యక్తపరిచాయి. అయితే పై గణాల నాయకుల మాటలు అనేకుల హృదయాల్లో కలతలేర్పరిచాయి. వాళ్లు వర్ధ్యశ్యుణ్ణి ప్రశంసిస్తూనే "వర్ధ్యశ్యుడు చాలా తొందర స్వభావంకలవాడు. కొడుకు తండ్రిలా కాకుండా దూరదృష్టినీ, సౌమ్యతనీ ప్రదర్శిస్తాడని ఆశిస్తున్నాము!" అన్నారు.

దివోదాసు ఆర్యులందరికి కృతజ్ఞతను తెల్పాడు. యదు తుర్వశ గణాల ప్రజలను గొప్పగా గౌరవించాడు. వారిని గురించి "యదు, తుర్వశ గణాలు అనాదినుండి సర్వశ్రేష్ఠులైన వీరుల్ని ప్రసాదించాయి. దస్యులను అణచడంలో యదు తుర్వశ వీరులు గొప్పగా పరిశ్రమించారు. మరో విధంగా చెప్పాలంటే అన్య ఆర్య గణాలు గొప్ప పరాక్రమవంతులైన రాజుల్ని ఉత్పన్నంచేస్తే, యదు, తుర్వశ గణాలు, తమలోని ప్రతిఒక్క ఆర్యుణ్ణి మహా వీరుడిగా తయారు చేశాయి. ప్రతి ఆర్యుడూ అనుకరించ

దగిన ఆదర్శాలను నెలకొల్పాయి. యదు, తుర్వశ వంశాలనుండి నే నెన్నో విషయాలను నేర్చుకున్నాను. పై వంశాల ప్రేమనూ, వాత్సల్యాన్నీ పొందేట్టు నన్ను తయారు చేయమని సదా ఇంద్రుణ్ణి ప్రార్థిస్తుంటాను: నా గురువులు సర్వకాల సర్వావస్థల్లోనూ నావెంటవుండి నన్ను పదభ్రష్టుణ్ణి కాకుండా చేస్తారని ఆశిస్తున్నాను!"

అభిషేకం అయ్యాక సాయం వందనంలో అందరూ ఏక కంఠులై ఇంద్రుణ్ణి స్తుతించారు. అనేకరకాల యజ్ఞశేషాలతోటి, రుచికరమైన సోమ రసంతోటి అతిథులను సత్కరించారు. ఉత్సవం ముగిసింది. బంధు మిత్రుల వియోగం భరింపరానిది. అతిథులందరూ డేరాలను విడిచి వెళ్ళిపోయారు. దాసులూ దరిద్రు లయిన పణులు అతిథులు విడిచివెళ్ళిన ప్రదేశాలను వెతు క్కునారు. ఎవడికైనా, ఏదైనావస్తువు దొరికితే, విడిచివెళ్ళిన అతిథిని పొగడు తున్నాడు. రాగికత్తులూ, దాణ ఫలకాలూ, పగిలిపోయిన కాష్ఠచషకాలూ. మొదలైన వెన్నో వాళ్ళకు దొరికాయి; సేద్యానికి మంచి ఎరువు దొరికింది. గుడిసెలమీది గడ్డినీ, కర్రల్నీ తీసుకుని వెళ్ళారు సేద్యగాళ్ళు. ఎన్నో రోజులు బలవంతానా వెట్టిచాకిరీ చేసి నిర్మించినందుకు వాళ్ళకా గడ్డి కర్రలే ప్రాప్తం!

దివోదాసుకు అగ్నిదేవుడు ఇష్టదైవం. అడగకుండానే అభీష్టాలను నెరవేరుస్తుంటాడు. అయినప్పటికీ దివోదాసు తన బాధ్యతలను ఎరిగి ప్రవర్తిస్తూండేవాడు. ఏ విషయంలోనైనా గురువుగారితో పరామర్శించందే ఒక నిర్ణయానికి వచ్చేవాడు కాదు. భరద్వాజ ఋషి దివోదాసును సాధారణ శిష్యుడుగా ఎన్నడూ చూడలేదు. అతడిమీద ఎన్నో ఆశల్ని పెట్టు కున్నాడు. ఒకమాటు ఉత్తర దిశనున్న, బృహత్పర్వతాల వైపులనుండి కబురు వచ్చింది. "కిరాతకులు వెనక తాము ఉండవచ్చిన (సింహాన్ని వేటాడిన) పణిగ్రామాన్ని దోచుకున్నారనీ, ఎంతోమంది పణులను చంపా రనీ" వర్తమానం అందింది. ఇదే సందర్భంలో ఋషి "మనకు అనాది శత్రువులైన పణుల్లో ఎదిరించి పోరాడేశక్తి నశించింది నిషాదులు మన సప్తసింధులో అత్యల్ప సంఖ్యలో వున్నారు. కనుక వారిని లెఖ్ఖపెట్టనే అవసరంలేదు, ఇకపోతే, ఉత్తరదిశన కొండల్లో నివసించే ఈ కిరాతకులే మనకు నిజమైన శత్రువులు!" అని అన్నాడు.

"కానీ, కిరాతతులకంటె మనమెంతో అభివృద్ధిలో వున్నాం కదా ? మనకంటే వారికి శస్త్రబలమూ, బుద్ధిబలంకూడా అల్పమేకదా ! అలాంటప్పుడు వారినిగురించి అంత జాగ్రత్త తీసుకోవలసిన పనేముంది ?" దివోదాసు అడిగాడు.

"నువ్వన్నది నిజమేను ! శస్త్ర బుద్ధిబలాల్లో వాళ్ళు మనకంటె హీన స్థితిలో వున్నారు. కానీ. ఇతర అనేక విషయాల్లో వాళ్ళు మనకంటే శక్తి సంపన్నులు. గొప్ప సాహసికులు, నిర్భయులు, సంఘీభావంకూడా వారిలో మనకంటె ఎక్కువగా వుంది. వారి సంఘీభావానికీ, నిర్భయానికీ ఉదాహరణ అనతగిన ఒక కథ చెప్తాను విను ! ఇది కథకాదు, నిజంగా జరిగిన చరిత్ర ! ముప్పైఏళ్ళక్రితం విషయం. అప్పటికింకా నీవు పుట్టలేదు. ఒకమాటు మిడతలదండు ఒకటి వచ్చింది. దాన్ని మిడతలదండు అనడానికి వీలులేదు. మహా ప్రళయమే ఈ పృథ్వీమీదకు అవతరించిందనాలి ! ఇక పృథ్వీమీద ప్రాణి అనేది లేకుండా తుడిచిపెట్టుకు పోతుందని అందరూ భయపడ్డారు !"

"మిడతలు అంత భయంకర రూపాన్ని దాల్చాయా ?"

"అవును. అసలు సాంతం విను ! మధ్యాహ్న వందనం చేసుకుని నేను పొలంలో తిరుగుతున్నాను. నావెంట కొంతమంది అనుచరులుకూడా వున్నారు. యవలు పంట కొచ్చాయి. కాకపోతే ఇంకా కొంచెం గింజ గట్టి పడాలి. అంతే ! ఆ సంవత్సరం యవలపంట ఎంత బాగా వచ్చిందంటే, అలాటి పంటను నేను గతంలోనూ చూడలేదు. అటు తరువాతనూ చూడ లేదు ! ఆ సంవత్సరపు పంటలను చూసి మేము ఆనందంతో పొంగి పోతున్నాము. మేమే కాదు దేవతలుకూడా పరమానంద భరితులౌతున్నారు. అవునుమరి, యవలు అధికంగా పండిన సంవత్సరం వాళ్ళకు యవాశిర్ (యవలపాయసం) పురోడాస్ (యవల పిండిలో తలకాయ మాంసాన్ని కలపి వండిన భోజ్య పదార్థం : ఇది ఒక రకపు యజ్ఞ శేషం ; యజ్ఞంలో దేవతలకు ఆహుతినిచ్చే నిమిత్తం తయారు చేస్తారు!) మొదలైన హవనీయాలు రోజూ లభిస్తాయి కదా! ఇలాటివే అనేక విషయాలను మాట్లాడుకుంటూ మేము చేలగట్లపై తిరుగుతున్నాము. అదే సమయంలో పశ్చిమదిశనుండి రొదలాటి విచిత్రమైనశబ్దం

వినిపించింది. మే మందరమూ పశ్చిమదిశకు మా దృష్టిని మరల్చాము. పొడవైన శలభాలు అటునుండి ఎగిరి వచ్చేస్తున్నాయి. మొదటగా ఆకాశంలో ఎగురుతూన్న శలభాలను మాత్రమే చూశాము. తరువాత క్షితిజం వైపుకు దృష్టిని పోనిచ్చాము అసంఖ్యాకంగా ఎగిరి వస్తూన్న మిడతలు కనిపించాయి. మరికొద్దిసేపటికి గాఢమైన నీలిమేఘా లావరించినట్టయింది. పశ్చిమ క్షితిజం! మిడతల దండు క్రమంగా ముందుకు జరుగుతోంది. మరి కొద్దిసేపటికి సూర్యుడు మిడతల దండు వెనుక మరుగుపడిపోయాడు! పూర్ణ సూర్యగ్రహణంలా పృథ్వీమీద అకాలంలో అంధకారం వ్యాపించింది. మిడతల దండ్లను గురించి వెనుకే వినివున్నా. ఇంత భయంకర దృశ్యాన్ని మే మెన్నడూ చూడలేదు. మొదట ఆ మిడతలు లక్షల సంఖ్యలో చెట్ల మీద వ్రాలాయి. అనంతరం మా పంట పొలాలమీద వ్రాలాయి. లక్షల ముఖాలతో యవలను తినివేయసాగాయి. అవి యవలను తింటూండడం వలన ఏర్పడే మర్మరధ్వనులు స్పష్టంగా వినుపించాయి మాకు! మరి కొద్ది క్షణాల్లో అవి మామీదకూడా వ్రాలసాగాయి. ఒకటి రెండుచోట్ల మమ్మల్ని కరిచాయి. మేము పొలాలను విడిచి పరుగెత్తాము. ఒక్కొక్క యవలగింజకు వందల సంఖ్యలో మిడతలు మూగాయి. తమకు అడ్డు వచ్చిన ప్రతిదాన్నీ ఆహారించాయి. మా యిండ్ల కప్పులపైనా, వాకిండ్లల్లోనూ నిండిపోయాయి. తలుపులు బిగించేశాం! లేకపోతే ఇండ్లల్లోకి కూడా వచ్చిపడేవే! మామూలు మిడతల్ని అల్పమైనవిగా భావించి అలక్ష్యంతో చూస్తాము. కానీ, ఈ మిడతలు అలాటివి కాదు. చాలా భయంకరమైనవి. చాలా క్రూరమైనవి! తేలిక అయిన ఇండ్లకప్పులన్నీ విపరీతమైన మిడతలబరువుకు నిలవలేక కూలిపోయాయి!

సూర్యాస్తమయం కాగానే మిడతలదండు ఎక్కడో ఒకచోట విశ్రాంతికి ఆగిపోయేది. సూర్యోదయంతోపాటు తిరిగి ఆహారానికి బయల్దేరేవి. ఆ మిడతల ఆకలి ఎంత తిన్నా, ఎన్నటికీ తీరేదికాదు. సర్వభక్షకుడైన అగ్నిదేవుడిలా, అవి ఎటు దృష్టిసారిస్తే అటు సర్వం నాశనమవసాగింది. మొదటిరోజు ఆక్రమణతరువాత మిగిలిన కొద్ది గొప్ప సస్యాన్నీ, చెట్ల ఆకుల్నీ రెండవరోజున తుడిచేశాయి. రెండవరోజు సాయంకాలానికి ఇక నీ పృథ్వీమీద పచ్చదనమంటూ లేకుండాపోయింది. మూడవరోజున, పంటలూ, ఆకులూ సర్వం హరించిపోగా, తమ ఆహారంకొరకు మిడతలు

ప్రాణులను హింసించసాగాయి. కనపడ్డ ప్రతిప్రాణికి మిడతలు లక్షల సంఖ్యలో అతుక్కొని రక్తాన్ని పీల్చి చంపేసేవి. ఇండ్లల్లోనుండి బయటికి వచ్చిన మనుషుల్నికూడా ఇదేవిధంగా చంపేశాయని చెప్పుకున్నారు. ఇక నా క్రూర శలభాలనుండి విముక్తిపొందేమార్గం కనుపించక, అగ్నిదేవుణ్ణి శరణు జొచ్చాము. కట్టెలరాశికి నిప్పంటించాము. అగ్నిదేవుడిముందు శలభాలెంత ? కాని, నిర్భయంగా సంఘటిత మవడంలో ఎంతటి శక్తివుంటో, అప్పుడు తెలుసుకున్నాము. అగ్ని వాటికి భయాన్నిగొలిపేదిగా కాక ఉత్సాహాన్ని రెట్టింపు చేయటానికిమాత్రమే ఉపకరించింది. మిడతలు ఉత్సాహంగా అగ్ని మీదకు ఎగిరేవి. మంటల్లో దగ్ధమయ్యేవి. కాని, తిరోముఖం పట్టేవి కావు. అసంఖ్యాకంగా ముసురుతూన్న శలభాలముందు అగ్నిదేవుడుకూడా పరాజితుడయ్యాడు. అవి తమ సంఖ్యాధిక్యతతో అగ్నిదేవుడిని శాంతపరి చాయి. అగ్నిలో దుమికి కాలి చనిపోయిన శలభాల శరీరాలనుండి కాలిన నీరు, అగ్నిదేవుణ్ణి శాంతపరడమే కాకుండా, పెద్ద ప్రవాహంలా భూమి మీదకు వ్యాపించింది !"

"నిజంగా ఆశ్చర్యకరమైన విషయం !"

"ఆశ్చర్యకరమైనదే కాదు, అవిశ్వాసకరమైనది కూడాను. కండ్లతో చూడనివారు ఈ మిడతలదండును గురించి అంతగా విశ్వసించజాలరు. మార్గమధ్యాల్లో చనిపోయిన మానవుల సంఖ్య విపరీతం. ఈ మిడతల దండు ఎటు చూస్తే అటు ఓ మహాప్రళయం తాండవించింది. మనుష్యుడు, మిడతలకు ఓడి, పిరికివాడై ఇంట్లోకూర్చుని, తలుపులు వేసుకు ప్రాణా లను రక్షించుకున్నాడు. అయితే ఇందులో సంతోషించదగిన విషయం ఏమిటంటే, ఈ భయంకర ప్రాణి హింస ప్రళయలీల సప్తసింధు అంత ట్లోనూ జరగలేదు. పురు, భరత మొదలుగాగల కొన్ని గణాలు మాత్రమే ఈ మిడతల వాతబడ్డాయి. అప్పుడే ఆర్యులందరూ ఇంద్రుడి కోపము ఎంతటి ప్రళయరూపాన్ని ధరిస్తుందో తెలుసుకున్నారు. ఇంద్రుడిలో ఎంతటి మహిమ వున్నదో కూడా అప్పుడే అర్థంచేసుకున్నారు. ఒక అల్పప్రాణి 'మిడత' ఇంద్రుడి యొక్క మహిమవల్లనే అంతటి శక్తివంతమైన ప్రాణి కాగలిగింది. శలభంలాటి ప్రవృత్తిగల శత్రువు యుద్ధంలో ఎంతటి

భయంకరుడౌతాడోకూడా ఆర్యులు తెలుసుకున్నారు. నిజంగా కిరాతకులు శలభాల్లాంటివారు !"

పర్ధ్యశ్వుడు ఆర్యులను సంఘటితపరచానికి చాలా కృషిచేశాడు. అతడి కృషి కొంతవరకూ ఫలించింది కూడాను. కాని ఈ మధ్య మళ్ళీ ఆర్యుల్లో ద్వేషానలం ప్రజ్వరిల్లింది. అయితే, దివోదాసుకు భరద్వాజ ఋషిలాటి మార్గదర్శకుడు లభించడం, ఆనందించవలసిన విషయం ! ఆశాజకమైన భవిష్యత్తుకొరకు ఎదురుచూడవచ్చు !



# 6. గంధర్వుడు పట్టిన కన్య

"అక్షైర్మా దీవ్య: కృషిమిత్ కృషస్వ"

(1195 క్రీ. పూ.)

తన గణాన్ని అన్నివిధాలా సమృద్ధం చేయాలని దివోదాసు నిశ్చయించుకున్నాడు. అతడికి తన కుటుంబాన్ని గురించిన బాధ్యత లేమీలేవు. తండ్రి ప్రచురంగా ధనాన్నీ, పశువుల్నీ సంపాదించి యిచ్చి పోయాడు. సహజంగానే సత్ప్రివర్తన కలవాడు కావడంవల్లనూ, ఋషియొక్క సహ్పోధలవల్లనూ దివోదాసు ఏవిధమైన దుర్వ్యసనాలకు లొంగిపోక పవిత్రమైన ప్రవర్తన కలవా డయ్యాడు. సరళమైన. పరిశ్రమతోకూడిన జీవితం అతడికి యిష్టం. ఐతే తన గణం మొత్తం సుఖాలను శుభాలను పొందే వరకు అతడికి శాంతి ఎక్కడిది? దివోదాసు తన మాతృభూమయిన విహాశ, శతద్రు, పరుష్ణి — నదుల మధ్యగల విస్తృత ప్రదేశంలో సదా పశువుల్ని మేపుకుంటూ తిరుగుతూ వుండేవాడు. అలా తిరగడంలో ఒక్క పశువుల్ని మేపుకోవడమే దివోదాసుయొక్క ఆదర్శం కాదు. తన గణపు ప్రతి శాఖతోటి, ప్రతి వ్యక్తితోటి ఆత్మీయతను వ్యక్తిగత పరిచయాన్నీ ఏర్పరచుకోవాలని, అతడి ఉద్దేశ్యం. మొత్తం ప్రదేశంలోనూ,

తాత్కాలిక నివాసాలను (గ్రామాలను) నిర్మించుకుంటూ తిరుగుతున్నాడు. ఇలా తిరగడంలో ఒక మాటు పరుష్ణీనదికి చాలా దూరంగా ఉత్తరదిశకు వెళ్ళిపోయాడు. ప్రజల తగాదాలనూ, కొట్లాటలనూ పరిష్కరించడం రాజు కర్తవ్యం. ఆ రోజు దివోదాసు ప్రాతఃవందనం ముగించుకుని కూర్చునివుండగా, ఒక వ్యక్తి మరొకణ్ణి పట్టుకుని అతడివద్దకు తీసుకుని వచ్చాడు. ఇలా అన్నాడు: "ఇతడు నాకు కొంతధనాన్ని ఋణపడివున్నాడు. కానీ, ఎన్నాళ్ళికీ ఈయడంలేదు."

ప్రతివాది ఆర్తస్వరంలో "నే నితడికి ఋణపడివున్నమాట సత్యమే. కానీ, ఇవ్వడానికి నా దగ్గిర ఏమీ లేదు" అన్నాడు.

వాది "ఇతడికి తల్లీ దండ్రి. అత్త మామయూ, ఇంకా ఇతర బంధువులూ చాలా మంది వున్నారు. వారి వద్ద ధనంవుంది. ఇవ్వదల్చుకుంటే నిరభ్యంతరంగా ఇవ్వగలడు:" అన్నాడు.

ప్రతివాది "అత్త మామలు నన్ను ద్వేషిస్తున్నారు. భార్య నన్ను విడిచి వెళ్ళిపోయింది. నాకు ఎవ్వరూ లేరు. ముసలి గుర్రాన్ని పనికి మాలిందిగా భావించి. విడిచివేసినట్టు, నన్ను నా బంధువులందరూ వదలి వేశారు" అన్నాడు.

ఇంతలో అక్కడ అనేకమంది స్త్రీ పురుషులు ప్రోగుపడ్డారు. ప్రతివాది బంధువులుకూడా వచ్చారు.

ప్రతివాదియొక్క తల్లిదండ్రులను సౌంజ్ఞతో చూపుతూ "వీరు ఇతడి తలిదండ్రులు. వీరి వేషభాషల్నిచూస్తే దరిద్రులుకారనీ, ధనికులనీ తెలిసిపోతుంది:" అన్నాడు వాది.

ప్రతివాది తండ్రి కల్పించుకుని "ఇతడికీ మాకూ ఏలాటి సంబంధమూ లేదని మొదటే చెప్పాము. కాకపోయినా జూదగాడికి బంధువులుంటారా? వాడు మీకు ధనం ఇవ్వవలసివుంటే వాడిని తీసుకువెళ్ళి మీ ఇష్టం వచ్చినపని చేసుకోండి" అన్నాడు.

దివోదాసుకు అసలు విషయం అర్థమైంది. ప్రతివాది ధనాన్ని ఋణంగా తీసుకోలేదు. జూదంలో ఓడిపోయాడు. ఆ ఓడిన ధనమే ఋణమై కూర్చుంది.

దివోదాసు అడిగాడు : "ఇతడి భార్య ఎక్కడుంది ?"

ప్రతివాది తల్లి అందుకుంది "వాడినే అడగండి, నాకోడలు ఎక్కడ వుందో?"

ప్రతివాది ఇలా సమాధానం ఇచ్చాడు : "అది నన్ను కష్టపెట్టేదీ కాదు నా మీద కోపగించుకునేదీ కాదు. నా జీవితానికే అది శోభామయి. ఎంతో అనురాగవతి. అలాటి భార్యను దూరం చేసుకున్నాను. ఈ జూదంతో విసిగి విరక్త అయి వెళ్ళిపోయింది!"

దర్శకుల్లోనుంచి ఒకడిలా అన్నాడు : "ఇప్పుడామె మరొకడి దగ్గర వుంటోంది. పాపం ఎన్నాళ్ళని ఇతడి జూదాన్ని భరిస్తుంది? ఈ దుర్మార్గుడు ఆమెనూ పందెంలో ఒడ్డడానికి సిద్ధమైయ్యాడు. విసిగి లేచిపోయింది. ఒక రోజున వీడు "నే నివ్వాళ తప్పక గెల్చుకువస్తానని" గర్వోక్తుల్ని పలికాడు. ఆనాడు సర్వస్వాన్ని గోల్పోయాడు. ఋణం చేశాడు. ఒక ఇంట్లో దొంగ తనం చేయడానికి జొరబడ్డాడు. బంధువులు కావడంవలన, తండ్రి ముఖం చూచి విడిచిపెట్టారు !" అని చెప్పాడు.

తండ్రి "కొద్దిరోజులుగా వీ డసలు ఇంటికే రావడంలేదు. రాత్రిం బగళ్ళూ ఇల్లు విడచి ఎక్కడో తిరుగుతున్నాడు" అన్నాడు.

జూదరి బ్రతిమలాడుతూ "వీళ్ళందరు చెప్పింది నిజమే ! పాచికలు, బల్ల ఈ రెండూ నన్ను వివశుణ్ణి, అశక్తుణ్ణి చేసేస్తాయి. మంజువాన్ పర్వతంమీద లభించే సోమలతయొక్క రసం ఎంత ఉత్తేజకంగానూ, మదిష్టం గానూ వుంటుందో, ఈ పాచికలయొక్క సంస్పర్శకూడా నా కలాగే వుంటుంది. నే నెన్నోసార్లు ఇక పాచికలను ఆడకూడదని నిశ్చయించు కున్నాను. ప్రతిజ్ఞచేశాను. కానీ, జూదగాళ్ళయిన మిత్రుల్ని విడువలేక పోయాను. పాచికల శబ్దం విన్నక్షణాన తక్షణం వెళ్ళి జూదగాళ్ళయిన మిత్రుల్ని కలుసుకోవడానికి సిద్ధమౌతాను. వ్యభిచారిణి తన విటుణ్ణి కలుసు కోవడానికి వ్యాకుల పడ్డటుగానే, నేనూ నా మిత్రమండలిని కలుసుకోవ డానికి అలాగే వ్యాకులపడుతూ వుంటాను !" అన్నాడు.

దివోదాసు ఆలోచించసాగాడు. ఇత డొక్కడికేకాదు, ఆర్యులందరూ ఈ దుర్వ్యసనంతో బాధపడుతూనే వున్నారు. శ్రమించకుండా ధనోపార్జన

చేయాలన్న అత్యాశ ఆర్యుల్నిలా జూదం వైపుకు లాగుతోంది. ఇంతవరకూ జూదంవలన ధనికుడైనవాణ్ణి తను చూడలేదు. ఎవడైనా ఒకసారి గెల్చు కున్నాడంటే, రెండవమాటు రెట్టింపు ఓడిపోవడం తథ్యం! ఆర్యుల్లో సురాపానపు వ్యసనం అసల్లేదనే చెప్పవచ్చు! రుచికరమైన సోమపానం వలన మత్తూ కలుగుతుంది. గౌరవానికీ ఎలాటిభంగమూ వుండదు!

దివోదాసు జూదగాడితో "జూదమాడకు! సేద్యం చేసుకో, పశు వుల్ని మేపుకో! తృప్తిగా జీవితాన్ని గడుపు! సూర్యభగవానుడి ఆదేశం ఇదే!" అని చెప్పాడు.

తరువాత అక్కడ ప్రోగుపడిన ప్రజల నుద్దేశించి ఇలా జూద మాడడం మహాపాపం! పశువుల్ని, దాస, దాసీలను చివరకు పత్నిని కూడా జూదంలో గోల్పోతారు. ఇది ధర్మ విరుద్ధం! ఈ జూదాన్ని గురించి ఇప్పు డింతకంటె ఇంకేమీ చెప్పలేను. నేను తరువాత అన్యరాజ కుమారులనూ, వృద్ధులయిన ఋషులనూ ఈ విషయంలో సలహా అడుగు తాను. వారూ నా అభిప్రాయాలతో ఏకీభవించినట్లయితే, త్వరలోనే జూద మాడడము దండించవల్సిన అపరాధంగా ప్రకటిస్తాను!" అన్నాడు.

తన ప్రజల్లోని గొప్ప బలహీనతను ఆనాడు దివోదాసు కనిపెట్టాడు. భరద్వాజ ఋషి. భరతగణంలోని ఇతర వృద్ధులూ దివోదాసు భావాలకు ఆమోదాన్ని తెల్పారు. ఇదే సందర్భంలో భరద్వాజఋషి ఇలా అన్నాడు: "అత్యధికమైన తీరిక, శ్రమపడకుండా ధనోర్జన చేయాలన్న భావనా ఆర్యు లను పాచికలవైపు లాగుతున్నాయి. పణుల్లోనూ ఈ వ్యసనం చాలా ఎక్కువ. ఆటకు సరైన చెయ్యి దొరక్కపోతే ఆర్యులు రహస్యంగా వెళ్ళి పణుల్తోకూడా ఆడివస్తూంటారు! అయితే పణుల్తో ఆడేప్పుడు ఆర్యులు తమవద్ద ప్రస్తుతానికి ఉన్న ధనాన్ని మాత్రమే పందెంలో ఒడ్డుతుంటారు. తమ గ్రామాల్లోవున్న భార్యాబిడ్డలనూ, దాసదాసీలనూ పశువులనూ పందెంలో ఒడ్డడం అలాంటి స్థితిలో సంభవంకాదు."

"అలాంటప్పుడు ప్రజల్ని ధనోపార్జనకు పనికివచ్చే కార్యక్రమాల్లో ప్రవేశపెట్టడం ఉచితంకాదా?" అన్నాడు దివోదాసు.

"ఎప్పుడూ ధనోపార్జనలోనే వున్నట్లయితే మనిషి త్వరలో విసిగి

పోతాడు. క్రీడలనూ, వివోదాలనూ కోరతాడు. సేద్యం, పశుపాలనా యివి ధనోపార్జనకు సంబంధించిన పనులేగా ?" ఋషి అన్నాడు.

"జూదం నిషిద్ధమైనదిగా ప్రకటించినట్లయితే, ప్రజలు ధనాన్ని పోగొట్టుకోవడం కొంతవరకూ తప్పుతుందికదా ? కొంత ప్రయోజనకారి అవుతుందికదా ?" దివోదాసు అడిగాడు.

"కొంతవరకేం ? బాగా ప్రయోజనకారి అవుతుంది. అలాటి నిషేధపు టాజ్ఞను ప్రకటించినట్లయితే, ఇక పశువుల్నీ, అన్య ప్రాణుల్నీ జూదంలో ఓడడానికి వీలుండదు. ఋణంచేసి జూదమాడడమూ జరుగదు. కాని, ఈ వ్యసనాన్ని పూర్తిగా తొలగించాలంటే ఒక్క నిషేధపు ఆజ్ఞే చాలదు. స్త్రీపురుషులందరికీ అధికంగా వినోదాన్ని కలిగించే ఏర్పాట్లను చేయాలి :"

"ఆ ఏర్పాట్లు ఏమిటంటారు ?"

"నేను చాలాకాలంగా దీన్నిగురించే యోచిస్తున్నాను. మన పూర్వులు అశ్వోత్సవాల్ని ప్రజల వినోదంకొరకే ఏర్పరచారు. సోమపానాలూ, సామగానాలూ అన్నీ ప్రజల వినోదార్ధమే ! అయితే ఈ వినోదాల్ని పరిపూర్తిగా అనుభవించడానికి ప్రజలకు అవకాశం తక్కువ. వినోదపు ఏర్పాట్లుకూడా ప్రజలకు కావలసినంతగా లేవనే చెప్పాలి ! ఒకవేళ ఎక్కడైనా ప్రజా వినోదానికి కావలసిన ఏర్పాట్లు వున్నా, అవి చెప్పుకోదగినంత ఆకర్షణీయంగా లేవు. ప్రతిగ్రామంలోనూ వినోద కార్యక్రమాలను ప్రచారం చేయాలి. వీటిలో పందాలు, బహుమానాలూ నిర్ణయించాలి. మీ నాయనగారు ఏర్పాటు చేసిన అశ్వోత్సవం మొత్తం సప్త సింధులోకే ఎలా ప్రసిద్ధమైందో చూశావుకదా ! ప్రజ లెలా ఆకర్షింపబడుతూన్నారో ? ఎంత ఇష్టంగా ఆ వుత్సవాల్లో పాల్గొంటూన్నారో చూశావుగా ? ఈ ఉత్సవాలు ఏదో ఒక చోట కాకుండా, ప్రతి గ్రామంతరపునా జరగాలి. ప్రతి గ్రామంలోనూ, అశ్వారోహుల్ని, సామగాయకుల్ని, నర్తకుల్ని ప్రోత్సహించాలి. సంవత్సరాంతంలో జరిగే వుత్సవాల్లో వారందరూ పాల్గొనేట్టు చేయాలి. పందేలు పెట్టి బహుమతుల్ని పంచాలి. వీటిల్లోనే కాదు. కృషిలోకూడా నిపుణతకు బహుమతుల్ని పంచాలి. శిల్పాల్లోనూ ఇలాగే పందాలు పెట్టి బహుమతుల్ని పంచాలి. కాష్ఠ, పాషాణ, మృత్తికా, అయః- మొదలైన వాటితో శిల్పాలను

మలిచే శిల్పులకు ప్రోత్సాహాన్నియాలి. మనం రోజూ చూసే రాగే మంచి శిల్పి చేతుల్లోపడి ఎంతచక్కని కత్తులుగా, భోజన పాత్రలుగా, కలశాలుగా మారుతుంది? మనం రోజూ చూసే పాషాణమే ఉత్తముడైన శిల్పి హస్త స్పర్శచే ఎంత సుందరమైన తిరుగలి, రోలులాంటివి తయారౌతాయి. చెక్కతో కూడా అనేకమైన సుందరపాత్రల్ని తయారుచేస్తుంటారు. మట్టితోమాత్రం ఎన్నివస్తువులు తయారు కావటంలేదు! కుండలు, మూకుళ్లు జాడీలు,ఇంకా అనేకమైన పాత్రలు మట్టితో తయారవుతున్నాయి. నిపుణుడైన శిల్పి సాధారణ మట్టి పాత్రల్లో ఎంతటి సౌందర్యాన్ని తీసుకు వస్తూన్నాడో గమనించావా? భోజ్య పదార్థాలుకూడా అంతే. నిపుణతనుబట్టి పదార్థాల్లో రుచులుకూడా మారుతుంటాయి. ఆశిర్ (పాలూ సోమరసం కలిసిన పదార్థం) గవాశిర్, యవాశిర్ (యవల పాయసం), పృషదాజ్య (నేయి కలిపిన పెరుగు), పురోడాస్ మొదలైన భోజ్యపదార్థాలు నేర్పరులు చేస్తే ఎంత రుచిగా తయారవుతాయో! నేర్పరియైన వంటవాడు సాధారణమైన మాంసం తోటే ఎంత రుచ్యంగా సూపాన్ని * తయారు చేస్తాడో చెప్పలేను! ఒక్క మాటు తింటే జీవిత పర్యంతం జ్ఞాపకముంటుంది సూపం! కనుక చెప్ప వచ్చే దేమిటంటే, మనకు నిత్యజీవితంలో వుపయోగించే ప్రతి చిన్నపని లోనూ, వస్తువులోనూ సౌందర్యానికీ, కౌశల్యానికి సమృద్ధిగా అవకాశా లున్నాయి. కాని, ఈనాడు ప్రోత్సాహం ముఖ్యం. తమ తనుల్లో ప్రజలు పోటీలుపడి ఉత్తమత్వాన్ని సాధించ దలచేట్లయితే, అదే గొప్ప వినోద కార్యక్రమంగా తయారవుతుంది ప్రజల శరీరాలూ, మనస్సూ, బుద్ధీ పటిష్ఠ తను పొందుతాయి. ఇంద్రుడికి మనం సదా కృపా పాత్రులమై వుంటాము!"

"ఇంద్రుణ్ణి మనం ఎన్నటికీ మర్చేపోలేము!"

"ఇంద్రుణ్ణి మర్చిపోవడమంటూ జరిగితే అది మనకు ఘోర పరాజయం క్రిందే లెక్క:.... ఇంద్రుడే మన గుర్రాలకూ, గోవులకూ, గొర్రె లకూ, మేకలకూ, నరులకూ, నారులకూ – అందరికీ శుభాన్ని చేకూరుస్తు న్నాడు!" అన్నాడు ఋషి.

---

* సూపం – మాంస వంటకపు విశేషం. ఈనాడు ఆంధ్ర దేశంలోని బ్రాహ్మ ణులు వండిన కందిపప్పును సూపం అంటున్నారు.

తన మాటల్ని పూర్తిచేస్తూ ఋషి "ఇంద్రుడి దయవుండి, మానవుడు గట్టిగా పరిశ్రమ చేస్తే, ఏ పని సంభవం? బిష్వలా నెరుగుదువుగా నీవు? అగస్త్యుడి భార్య! ఆమె కాలు విరిగిపోయిందొకమాటు చెక్కపనివా డొకడు రాగిలో ఆమెకు కృత్రిమ పాదాన్నొకదాన్ని తయారుచేసి ఇచ్చాడు. అశ్వనీ కుమారు లిద్దరూ ఆ పనివాడికి సాయపడ్డారు. కార్యపరాయణుడైన మానవుడికి దేవతలు తప్పక సహాయం చేస్తారు!" అన్నాడు.

"అవును. ఆర్యులైన శిల్పకారులకు మనం తప్పక ప్రోత్సాహాన్నియాలి!"

"పణులు తయారుచేసిన కంచుకం ఎంత బాగుంటుంది? పైగా వారసలు కంచుకాలను ధరించనే ధరించరు. వాళ్ళు కంచుకాలను మన కోసమే తయారుచేస్తారు. ఒక్కొక్క కంచుకానికి మనవద్ద చాలా విలువను కొట్టేస్తారు ఒక కంచుకానికి బదులు ఓ మంచి గుర్రాన్ని పుచ్చుకుంటారు. కనుక కంచుకాలను తయారుచేయటం మనమూ నేర్చుకోవాలి!"

* * *

భరద్వాజఋషి, దివోదాసు, భుజ్యుడు, కుత్సుడు మరికొంతమంది భరతజనపు పెద్దలూ ఉత్తర దిశగా ప్రస్థానాన్ని సాగించారు. అక్కడ కొంతమంది కిరాతకులు ఉపద్రవాలు చేస్తున్నారు. వారిని అణచడానికే ఈ అభియానం! సాయంకాలానికి అందరూ ఒక ఆర్య గ్రామాన్ని చేరుకున్నారు. గ్రామ పెద్ద తమ ఋషికి, రాజుకు గొప్పగా స్వాగతాన్నిచ్చాడు. ఘనమైన ఆతిథ్యాన్నిచ్చి తన హృదయంలోని భక్తి ప్రపత్తుల్ని తెల్పుకున్నాడు. అందరూ తమ తమ ఆసనాల్లో కూర్చున్నారు. ఇంతలో ఒక అపరిచితు డొచ్చి భుజ్యు చెవిలో ఏమిటో చెప్పి పోయాడు. భుజ్యు వెంటనే తన ఆసనంనుంచి లేచి దివోదాసు వద్దకు వెళ్ళి గంధర్వుడు పట్టిన (దయ్యం పట్టినట్టు) కన్యల్ని గురించి ఇంతవరకూ మనం వినటమేకాని కండ్లతో చూడలేదు. ఇక్కడో కన్యకు గంధర్వుడు పట్టాడుట! చాలా విచిత్రంగా మాట్లాడుతుందిట....కొద్దిసేపు ఆర్యుల భాషలోనూ, మరికొద్దిసేపు పణుల భాషలోనూ మాట్లాడుతుందిట....ఎక్కడో జరుగుతున్న విషయాలను గురించి ప్రత్యక్షంగా జరుగుతున్నట్టు చెప్తుందిట!" అన్నాడు.

"అయితే, ఆ కన్య కిరాతకులను గురించి కూడా చెప్తుతుంది కదా? ఇంకేం పదండి పోదాం!" అన్నాడు దివోదాసు.

దివోదాసు తన అనుచరులను వెంటపెట్టుకుని గ్రామానికి అటు చివరన వున్న ఓ గృహంలోకి వెళ్ళాడు. ఆ యింట్లో జనం క్రిక్కిరిసి వున్నారు. సూర్యుడు అస్తమించాడు. కాని, ఇంకా వెలుగు ప్రసరిస్తూనే వుంది. గంధర్వుడు పట్టిన కన్య ఇంటిబయట వృషభచర్మం వేసుక్కూర్చుని వుంది. బంగారు తలవెంట్రుకలు వీపుమీదా, ముఖం మీదా పరుచుకున్నాయి. శరీరం మెల్లగా ఊగుతోంది. దివోదాసు ముందుకు పోవడానికి దారి ఇస్తూ "ఈమెను గంధర్వుడు పట్టి రెండు ఘడియలైంది!" అని చెప్పారు అక్కడున్న ప్రజలు. కొద్ది క్షణాల క్రితంవరకూ కాళ్ళూ చేతులూ ఊగిస్తూ, ఏవేవో మాట్లాడడం, పాటలు పాడడం చేసింది. ఇప్పుడు ఊగడం తగ్గింది. పాటలూ, మాటలూ కూడా తగ్గాయి. ప్రజల ప్రశ్నలకు సమాధానాల నిస్తోంది.

దివోదాసును చూడగానే గంధర్వుడు పట్టిన కన్య "భరతగణపు మహారాజు దివోదాసు నా మాటలను తప్పక విశ్వసిస్తాడు! అతడు కిరాతకులను అణచడానికి వెళ్తున్నాడు. కిరాతకులు చాలా గర్వాంధులయ్యారు. ఆర్యుల పసువుల్నే కాక, స్త్రీపురుషుల్ని కూడా ఎత్తుకుపోవడానికి సిద్ధమయ్యారు. కాని, దివోదాసుముందు కిరాతకులు ఒక్కక్షణం నిలువలేరు. దివోదాసుకు ఇంద్రుడు పూర్తిసహకారాన్నిస్తాడు. అలాగని ఇంద్రుడంటూండగా నేనూ విన్నాను. దివోదాసు కిరాతకుల్ని తప్పక సంహరిస్తాడు!" అని అంది.

"నువ్వెవరు?" దివోదాసు అడిగాడు.

"నేను గంధర్వుణ్ణి. ఇంద్రుడి కృపకు పాత్రుణ్ణయిన అనుచరుణ్ణి!"

"అయితే ఇక్కడికి రావడానికి సెలవు ఎలా లభించింది?" ఈమాటు భుజ్యు ప్రశ్నించాడు.

"ఇంద్రుడు తన పరిచారకుల మనోవాంఛితాలను తప్పక నెరవేరుస్తాడు. నేను ఏడు రోజులనుంచి సెలవుమీద వున్నాను. పరుష్ణి తీరపు సౌందర్యాన్ని అవలోకిస్తున్నాను. పరుష్ణి తీరంలో స్నానం చేస్తూండగా

ఈ యువతిని చూశాను. అనన్య సామాన్యమైన ఈమె నగ్నసౌందర్యాన్ని చూసి, మోహితుణ్ణయ్యాను. కనుకనే నన్నిక్కడ చూస్తూన్నావు !"

"ఐతే, మోహితుడివై, పాప మీ కన్యను బాధిస్తున్నావన్నమాట ? ఎన్నాళ్ళవరకూ ఈమెను పట్టుకుని వుంటావు ?"

"ఎక్కువ రోజులు బాధించనులే ! ఈమెకు వివాహం అయ్యే వరకూ ఇలా అప్పు డప్పుడూ పడుతూవుంటాను !"

కుత్సుడు ముందుకు వచ్చాడు : "ఐతే కిరాతకులు ఎక్కడున్నారో చెప్పు, ఇప్పుడు ?" అనడిగాడు.

"కిరాతకులు తమ పర్వతాల్లోనే వున్నారు. అదిగో, దూరంగా శ్వేత హిమశిఖరాలు కనుపిస్తున్నాయే, అవే వారి పర్వతాలు ! ఆ పర్వత సానువుల్లోనే కిరాతకులు వేటాడుతున్నారు. అదుగో, వాళ్ళ నాయకుడు శంబరుడు ఇప్పుడో బాణాన్ని వేశాడు. ఆ బాణం ఒక మంచు ఎలుగు గుండెల్లో గుచ్చుకుంది. ఇక్కడ నిలబడివున్న మిమ్ములను ఎంత స్పష్టంగా చూడగలుగుతున్నానో, అంతే స్పష్టంగా శంబరుణ్ణికూడా చూడగలుగు తున్నాను !"

"శంబరుడు ఎవడు ? ఎలా వుంటాడు ? ఇక్కడికి ఎంత దూరంలో వున్నాడు ?"

గంధర్వుడు : "మెల్లగా వెళితే ఇరవై రోజులు దూరంలో వున్నాడు. శీఘ్రంగా వెళ్ళినా పదిరోజులకు తక్కువ పట్టదు. కాని, ఈ పర్వతాలన్నీ కిరాతకులవి. ఆర్యులు వాటిలోకి వెళ్ళి ఒక్క రోజుకూడా బ్రతకలేరు. శంబరుడు చాలా బలశాలి. దివోదాసుకంటె కొంచెం పొట్టిగా వుంటాడు. కాని, అతడి ఛాతీ చాలా విశాలమైంది. బాహువులు చాలా బలమైనవి. శరీరంమీద మంచుఎలుగు చర్మం వుంది. తలపైన హిమవత్పర్వతాల్లో వుండే సుందరమైన పక్షిఈక లున్నాయి !"

"కాని, నీ వీ మాటలన్నింటినీ కల్పించి చెప్తూన్నావో, నిజమే చెప్తూన్నావో మా కెలా తెలుస్తుంది ? నిదర్శనం ఏమిటి ?" అనడిగాడు దివోదాసు.

"అయితే పరీక్షించుకో !"




"నా తూణీరం నా గుర్రపు వీపున వుంది. ఆ తూణీరంలో ఎన్ని బాణాలున్నాయి? నా గుర్రపు రంగు ఏమిటి? గుర్రం ఎటు ముఖంగా నిలబడివుంది? చెప్పు!"

గంధర్వుడు ఏమాత్రమూ ఆలస్యం చేయకుండా "నీ గుర్రం ఎర్రగా వుంటుంది. దాని పేరు 'దార్ఘికా'. నీ చనిపోయిన గుర్రం పేరే దీనికీ పెట్టుకున్నావు. అది దక్షిణదిశకు ముఖంపెట్టి నిలబడి వుంది. తూణీరం దానివీపున వామపక్షంలో వ్రేలాడుతోంది. తూణీరంలో పదిహేడు బాణాలున్నాయి!" చెప్పేశాడు.

గంధర్వుడు చెప్పినవన్నీ నిజమయ్యాయి. కొంతమంది వెళ్ళి చూసి వచ్చారు. దివోదాసుక్కూడా ఇదే ప్రథమం ఇలాటి సంఘటనల్ని చూడడం! చాలా ఆనందితుడయ్యాడు. వినయపూర్వకంగా "గంధర్వా! నీవు చాలా సత్యవాదివని ఒప్పుకున్నాను. నీవు నిజంగా ఇంద్రుడికి, ప్రియపాత్రుడివైన అనుచరుడివే! ఆర్యులే ఇంద్రుడికి గొప్పభక్తులని నీకూ తెల్సు కదా? నీవూ ఆర్యులకు నీ శక్తికొలది సహాయం చేయాలి!" అన్నాడు.

"గొప్ప భక్తులూ, కొద్ది భక్తులూ అనే విషయాన్ని చెప్పకు! నే నే కిరాతకన్యకో, లేక పణికన్యకో పట్టినట్లయితే, వాళ్ళు ఇంతకంటె గౌరవంగా, వినయాన్ని ప్రదర్శిస్తూ మాట్లాడేవారే! కాని, పణులూ, కిరాతకులూ ఇంద్రుడికి శత్రువులని నాకు తెలుసు. వాళ్ళకు తమ దేవుళ్ళే అందరి కంటె గొప్ప? పణులైతే తమ శిశ్న (లింగం) దేవుడి ముందు ఇంద్రుణ్ణికూడా లెక్కపెట్టరు! ఇంద్రుడికి అనుచరుణ్ణికావడం వలన నేమి, మీకు అన్ని విధాలా సహాయకారిగా వుంటాను. ఒక విషయం ముందే చెప్పుతున్నాను. ఇక ఏడు రోజులకు కిరాతకులు ఆర్యుల మీద ఆక్రమణ జరుపుతారు. వారితో ఘోరంగా పోరాడవలసి ఉంటుంది!"

దివోదాసు మొదట అన్యమనస్కంగానే గంధర్వుడు పట్టిన కన్యను చూడడానికి వచ్చాడు. అతడికి ఇలాటి విషయాల్లో విశ్వాసం తక్కువ. కాని. ఇప్పు డెలాటి అవిశ్వాసానికీ తావు లేకుండాపోయింది. గంధర్వుడు గతంలో జరిగిన విషయాలను చెప్పాడు. వర్తమానాన్ని గురించీ చెప్పాడు. అతడు చెప్పిన విషయాలన్నీ నిజమయ్యాయి. ఇక నిప్పు డతడు భవిష్యత్తును గురించి చెప్పింది మాత్రం నిజం కాదని

ఎలా అనుకోవడం ? గంధర్వుడి మాటలు దివోదాసులో బాగా పనిచేశాయి. "ఇతడు గంధర్వుడు, చెప్పిందే గనక నిజమైతే, ఈ అభిమానం సార్థకమే అవుతుంది !" అనుకున్నాడు దివోదాసు.

"ఇక నే వెళ్తున్నాను !" అనేసి గంధర్వుడు వెళ్ళిపోయాడు. కన్యక నీరసించి, నేలమీద పడిపోయింది. స్పృహ లేదామెకు. తల చమర్చడం వలన వెంట్రుకలద్వారా స్వేదబిందువులు స్రవించసాగాయి. ముఖాన ముత్యాల్లా స్వేదం మెరుస్తోంది. ప్రజలు ఎత్తుకుని కన్యకను ఇంట్లోకి తీసుకుపోయారు. అనంతరం దివోదాసు తన సహచరుల్తో సహా ఆవాసానికి తిరిగి వచ్చాడు.

మామూలు రోజుల్లో అయితే విందులో ఘడియల తరబడి మధుపర్క సత్కారం, సోమపానం జరిగేది. కానీ, ఇవ్వాళ విందు క్షణాల్లో ముగిసిపోయింది. గ్రామపెద్దా, దివోదాసుయొక్క అనుచరులూ. కిరాతకుల ఆక్రమణను గురించే చాలాసేపు చర్చించుకున్నారు. అక్కడికి ఓ రోజు ప్రయాణంలో వున్న పర్వతపాద ప్రాంతాల్నుండి కిరాతకుల భూమి ప్రారంభమౌతుంది. పర్వతపాద ప్రాంతాలకు కిరాతకులు కేవలం శరదృతువులో మాత్రం వస్తారు. ఇంకో నెలరోజులకుగానీ చలి ముదరదు. కిరాతకులు ఒక్కోసంవత్సరం కొంచెం వెనుకా ముందుగా కూడా పర్వతాల్ని దిగుతుంటారు. భరతభూమికి, కిరాతకుల భూమికి స్పష్టమైన సరిహద్దేమీ లేకపోయినా, ఎవరి భూము లెంతవరకో ఉభయులకూ తెలుసును !

* * *

గంధర్వు డలా భవిష్యత్తును గురించి చెప్పకపోయినట్లయితే, బహుశ దివోదాసు భరతగణపు సీమాంతమైన బృహత్పర్వత పాదాలను సమీపించేవాడు కాదేమో ! ఒకవేళ వెళ్ళినా, ఇప్ప టిలా అన్ని జాగ్రత్తల్తోటీ వెళ్ళేవాడు కాదు ! ఆర్యుల్లో అందరూ గంధర్వుల్ని నమ్మరు. అసలు ఆర్యులు ఇంద్రుడికి అనన్యభక్తులు కదా ! అలాటి ఆర్యుల్లోనే ఇంద్రుణ్ణి సంశయించేవారు; ఇంద్రుడిపై భక్తిలేని వారు కూడా వున్నారు. అయితే, అలాటివారి సంఖ్య అత్యల్పం ! ఇంద్రుడిమీద పూర్ణ విశ్వాసమున్నవారు అతడి ఆకారాన్ని ఇలా "ఇంద్రుడు నెమలి ఈకల్లాటి రోమాలు కల అశ్వా

లను పూన్చిన రథాన్నెక్కి వస్తాడు. తలపై కిరీటమూ, చేతిలో వజ్రాయుధమూ వుంటుంది. అతడి గడ్డం మీసాలు పుతం పెట్టిన బంగారంలా పచ్చగా మెరుస్తుంటాయి. అతడి మెడ మాంసంతో నిండి వుంటుంది. ఆర్యులు డోళ్ళూ, నగారాయూ వాయించి ఇంద్రుడికి స్వాగతం చెప్తారు: అభివర్ణిస్తారు." అయినప్పటికీ విశ్వాసంలేని కొంతమంది "ఇంతవరకూ ఎవరైనా చూశారా ఇంద్రుణ్ణి? ఎవ్వరికీ కనపడనివాణ్ణి ఎలా స్తుతించడం?" అని అడిగేవారు.

గంధర్వుడు పట్టిన స్త్రీలు, ప్రశ్నోత్తరాలద్వారా, అదృశ్యములైన విషయాలను చెప్పడంద్వారా ప్రజల హృదయాల్లో ఇంద్రుడిమీద విశ్వాసాన్ని పెంపొందిస్తున్నారు లేకపోతే. అవిశ్వాసుల సంఖ్య ఏనాడో పెరిగిపోయేది!

పురుకుత్సుడు కిరాతకులని సప్తపురాలను విధ్వంసం చేసి, పర్వత సానువుల్లోనివారి గోచరభూముల్ని లాగేశాడు. అప్పుడు ఎంతటి భయంకరమైన యుద్ధం జరిగింది? ఆయుద్ధాన్ని ఆర్యులు ఇప్పటికీ మర్చేపోలేదు! భరత భూమికి (రావి, వ్యాసనదుల మధ్యనున్న ప్రదేశం) ఉత్తర దిశన వున్న పర్వత పాదభూమికొరకు కూడా అంతటి ఘోర యుద్ధమే జరగవలసియున్నదని కూడా ఆర్యులకు తెలుసును. ఇక్కడి కిరాతకులు మహావీరుడూ పరాక్రమవంతుడూ ఐన శంబరుడికి అధీనులు! అక్కడక్కడా ఒకటి రెండు ఆర్యగ్రామాలమీద శంబరుడి సైన్యం ఆక్రమణచేసి పశువుల్ని తోలుకు పోయింది. ఈ మాత్రానికి కిరాతకుల బలాన్ని సరిగా అంచనా వేయడం సంభవం కాదు. శ్వేతపర్వతాలు ఎంతవరకూ వ్యాపించిఉన్నాయో వాటిపైన కిరాతకులు ఏమాత్రం సంఖ్యలో ఉన్నారో ఆర్యులకు తెలియదు. అది తెలియనివరకూ కిరాతకులు ఆర్యులదృష్టికి అపరాజేయులైన శత్రువులుగానే కనుపిస్తున్నారు. ఆర్యుల గ్రామపెద్ద "కిరాతకులు శలభాల్లాంటివారు. మృత్యుభయమేమిటో వారి కసలు తెలియనే తెలియదు: చచ్చినవాళ్ళతోపాటే చావుభయంకూడా అంతరిస్తుంది వాళ్ళల్లో!" అని కిరాతకుల్ని గురించి చెప్పాడు.

కిరాతకుల భూమి దగ్గరకు వస్తూన్నకొలదీ ఆర్యగ్రామాలు పల్చబడసాగాయి. పూర్తి సరిహద్దుదగ్గరకు ఆర్యులు కేవలం సంవత్సరంలో ఒక్కసారిమాత్రమే వెళ్తారు. సంవత్సరాంతంలో, భూమి సస్యశ్యామలంగా వున్న

ప్పుడు మాత్రమే ఆర్యులు తమ పశువుల్ని తీసుకుని సరిహద్దు ప్రదేశానికి వెళ్తారు. దారిలో కిరాతకులచే ధ్వంసం కావింపబడిన కొన్ని ఆర్య గ్రామాలు తగిలాయి. కొన్ని గ్రామాలను కిరాతకుల ఉపద్రవాలకు భయపడి ఆర్యులు ఖాళీ చేశారు. దివోదాసు ఖాళీ అయిన గ్రామాల్లో తిరిగి ఆర్యుల నివాసాలను ఏర్పరచాడు. ఈ గ్రామాల్లోనుండే యుద్ధ క్షేత్రంలోవున్న సైన్యాలకు అస్త్ర, శస్త్రాలూ, అన్నపానాలూ పంపబడతాయి. రక్షిత సైన్యాన్ని కూడా ఈ గ్రామాల్లోనే వుంచాల్సి వుంటుంది. ఖాళీ అయిన గ్రామాల్ని తిరిగి నింపడమే కాకుండా, సరిహద్దు ప్రాంతంలో కొన్ని క్రొత్త గ్రామాల్ని కూడా నెలకొల్పాడు. తరువాత కిరాతకుల భూమిలోకి తమ పశువుల్ని తోలాడు. ఇది యుద్ధానికి వాళ్ళను బాహాటంగా పిలవడం!

ఆర్యులు తప్పంతా కిరాతకులదే నంటారు. కానీ, నిజం ఆలోచిస్తే తప్పంతా కిరాతకులదే ననిపించదు! కిరాతకుల గోచరభూములు రెండు, ఒకటి పర్వతాలపై భూమి. రెండవది పర్వతాలక్రింద వున్న పసిరిక లోయలు. ఈ రెండు చోట్లా పశువుల్ని మేపుకోవడం వేల సంవత్సరాలుగా వస్తూన్న ఆచారం. కిరాతకులు అధిక ఆతపాన్ని సహింపలేక గ్రీష్మాన్ని పర్వతాలపైన గడిపేస్తారు. తమ పశువుల్ని మేపుకుంటూ పర్వతాల్ని అధిరోహిస్తూ పూర్తి హిమాచ్ఛాదితాలైన పర్వతాగ్రప్రదేశాల్ని చేరతారు. సంవత్సరంలో ఏ రెండు మూడు నెలల్లో తప్ప, మిగిలిన అన్ని కాలాల్లోనూ ఆ పర్వతాగ్రప్రదేశాల్లో మంచు కురుస్తూనే వుంటుంది. చలికాలంలో మరీ మంచు ఎక్కువ అవుతుంది. ఆ సమయంలో వన్యపశువులు కూడా చలిని భరించలేక క్రిందకు దిగుతాయి. కేవలం మంచు ఎలుగులు మాత్రం క్రిందికి దిగవు. ఏవో ఒక గుహలో పడుకుని, మంచు విస్తారంగాకురిసే ఆరునెల్లూ నిద్రిస్తాయి. మంచు ఎలుగుల్లా ఏవో ఒక గుహలో ఆరునెల్లు కండ్లు మూసుకు పడుండడం అసంభవం. కనుకనే వన్యపశువులోపాటు వారూ పర్వతాల్నుండి దిగుతారు. కిరాతకులు ప్రధానంగా మృగయాజీవులు (వేటాడి జీవించేవారు). పణులనూ, ఆర్యులనూ చూసి, కిరాతులుకూడా కొద్దికొద్దిగా సేద్యాన్ని ప్రారంభించారు. వారిది క్రొత్త సేద్యం: పర్వతాలపైనున్న అడవుల్ని నరికి, భూములను శుభ్రపరుస్తారు. విత్తులు చల్లుతారు. రెండుమూడేళ్ళ తరువాత, వీటిని వదలి మరోచోట క్రొత్తభూముల్ని శుభ్రపరచుకుంటారు.

భూముల ఆకర్షణలో పడి, ఒకేచోట నిలిచి వుండడం కిరాతులకు కిట్టదు : తిరుగుమోత్తనం వారి రక్తంలో జీర్ణించుకుని వుంది. రోజూ వేట దొరుకు తుందన్న నమ్మకం వుండే వా రసలు పశువులనుకూడా పెంచరు.

గంధర్వుడు చెప్పినట్టు సరీగా ఏడవరోజునే భీషణమైన సంఘర్షణ జరగలేదు. కానీ, ఒకటి రెండు రోజులు వ్యత్యాసంగా నయినా గంధర్వుడి వాక్కు నిజమే అయింది! చేపను పట్టడానికి మొదట ఎరను వదిలినట్టు, కొన్ని గుర్రాలనూ, ఆవులనూ కిరాతకుల భూమిలోనికి వదిలాడు దివోదాసు. ఆర్యులు ఇలా తమ భూమిలోకి పశువుల్ని వదలడాన్ని చాలా అసాధారణ సంఘటనగానే భావించారు కిరాతకులు. అయినా దివోదాసు ఇంత పెద్ద ఎత్తున తయారై వస్తున్నాడని మాత్రం ఊహించలేక పోయారు. ఆ రాత్రి తమకు దగ్గరలో వున్న సేనానాయకుడు ఋష్టుకు ఈ విషయాన్ని తెల్పారు. కిరాత సేనానాయకుల్లో ఒకడైన ఋష్టు, ఆరాత్రే సరిహద్దు ప్రదేశానికి వచ్చాడు. రెండవరోజు ఉదయం తమ భూముల్లోకి వచ్చిన ఆర్యుల పశువుల్ని, తమ పశువులతో పాటు పొదల్లోకి తోలించి వేశాడు. ఆర్యుల గోపాలకులు, ఈ విషయాన్ని దివోదాసుకు తెలియపరచారు. పర్వతపాదభూమిలోని విశాలమైన వృక్షాల క్రింద, పొడవైన పచ్చిగడ్డిలో పొంచుని వున్న ఆర్య సైనికులు, అశ్వారోహులై కిరాతకులపైకి వచ్చి పడ్డారు. దివోదాసు మొత్తం సైన్యాన్ని మూడు భాగాలుగా విభజించాడు. ఒక భాగానికి భుజ్యుడు నాయకుడు. భుజ్యుడి నాయకత్వంలో నడుస్తున్న సైన్యదళం అందరికంటే ముందున్నది, ఒక భాగానికి దివోదాసే నాయకత్వం వహిస్తున్నాడు ఈ దళం కుడివైపున వుంది. మూడవ దళానికి కుత్సఆర్జునేయుడు నాయకత్వం వహిస్తున్నాడు. ఈ దళం ఎడంప్రక్కన వుంది.

అందరికంటే ముందున్న భుజ్యుదళం మీదనే కిరాతకులు విరుచుకు పడ్డారు. వాళ్ళు నిజంగా శలభాల్లాంటి వారే! ప్రాణాలనయినా విడుస్తారు గానీ, యుద్ధక్షేత్రాన్ని మాత్రం విడువరు. ఈమాటు సంఖ్యాబలంలో ఆర్యులూ తక్కువకాదు. పైగా ఆర్యులవద్ద అధిక శక్తివంతమైన ఆయుధాలు కూడా వున్నాయి. ఉభయ దళాలూ, బాణాలనంతగా ఉపయోగించ లేదు. చెట్లు, పొదలు ఎక్కువగా వుండడంవల్ల బాణాల నుపయోగించ

దానికి అవకాశమే లభించలేదు. అమితమైన వేగంతో పరుగెత్తుకుంటూ వచ్చి ఉభయుల సైన్యాలూ ఒకదాంట్లోకి ఒకటి చొచ్చుకుపోయాయి.

ఒకవైపు నుండి భుజ్యుడు, శత్రుసైన్యాన్ని ఊచకోత కోసేస్తున్నాడు. మరోవైపు నుండి దివోదాసు, కుత్స ఆర్జునేయుడు కిరాతకులను చుట్టుముట్టారు. కిరాతకులకు వెనుకా ముందూ. రెండు వైపులనుండి ఆర్య సైన్యం యుద్ధం చేస్తోంది. అయినా శుష్ణ హతాశుడు కాలేదు. అతడి శరీరం క్షత-విక్షతమైంది. అతడి అంగాలనుండి రక్తం స్రవిస్తోంది. స్పృహ తిరోహితమౌతోంది. అయినా ఆర్యసైన్యాన్ని సంహరిస్తూనే వున్నాడు. చివరకు పది, పదిహేనుమంది కిరాతకులు మాత్రమే మిగిలారు. కిరాత సైన్యాధిపతి శుష్ణ పూర్తిగా అచేతనుడయ్యాడు. మిగిలిన కిరాతకులు చైతన్యరహితుడైన తమ నాయకుణ్ణి తీసుకుని పర్వతాల్లోకి వెళ్ళిపోయారు.

యుద్ధం ఐదారు ఘడియలకంటే ఎక్కువకాలం జరగలేదు. అయినా ఈ కొద్దికాలంలోనే అరణ్యమంతట్లోనూ అభూతపూర్వమైన దృశ్యం పొడకట్టింది. ఇటు మానవులు ఆకలిగొన్న వ్యాఘ్రాల్లా ఒకరిమీదకు ఒకరు లంఘించి ప్రాణాలు తీసుకుంటున్నారు; ఆటు అరణ్యానికి నిజమైన హక్కుదార్లు, వన్యమృగాలు భ్రాంతచేతను లయ్యాయి! సింహాలకు అసంఖ్యాకంగా అశ్వాలు లభ్యమయ్యే సమయం. కానీ సింహాలు అశ్వాలవంక లోభదృష్టితో చూడలేకపోతున్నాయి. ఏనుగులు మాంసభక్షణ చేయవు. భక్షించడానికి కాకపోయినా, తమ అరణ్యాలను గోచర భూములుగా మార్చుకున్న మానవులపై పగ తీర్చుకోవడాని కయినా, విజృంభించవచ్చును, అవీ అలా చేయడంలేదు! వ్యాఘ్రాలు బెదిరి తమ వద్దకు పరుగెత్తుకు వచ్చిన లేడిపిల్లలవంక కన్నెత్తయినా చూడకుండా, మానవ కోలాహలాన్ని చెవులు రిక్కించి వింటున్నాయి! అరణ్యంలోని జంతువులన్నీ, తమ సహజశత్రుత్వాలను మరచి, మానవ కోలాహలానికి వెరచి, ఎక్కడికో పరుగిడుతున్నాయి. కానీ, అడవిని విడిచి ఎక్కడికి పరుగిడగలవు? భయంకర యుద్ధఘోష, మానవ కోలాహలము, ప్రాణుల పదధ్వనులు ఎక్కడికి పోయినా మృగాలను వెన్నాడుతూనే వున్నాయి!

కిరాతకులతో దివోదాసు జరిపిన ప్రథమ సంఘర్షణ ఇది. ఈ యుద్ధంలో దివోదాసు పూర్తిగా విజయాన్ని పొందాడు. అయినప్పటికీ

ఇది కిరాతకులపై తాను సాధించిన అంతిమ విజయం మాత్రంకాదని దివో దాసుకు తెల్సును. తమ భూములలోకి వచ్చి, మోసంతో తమను గెల్చిన శత్రువుపట్ల కిరాతకులు ఎన్నటికీ మౌనాన్ని వహించరు, యుద్ధక్షేత్రంలో పడిపోయిన కిరాతకుల్లో ఎక్కువమంది చనిపోయినవారే! కిరాతకుడు ప్రాణావశిష్టుడై వున్నాసరే, పీతకేశులు దగ్గరకువస్తే, దెబ్బతిన్న సింహంలా మీదపడతాడు. అతిడు స్వయంగా ఎవరిమీదా దయచూపడు. శత్రువు నుండి దయను ఆశించడు. యుద్ధక్షేత్రంలో ఆర్యులకు కిరాతకులు విడిచి వెళ్ళిన ఆయుధాలు ఎన్నో దొరికాయి. ఆహారపదార్థాలు కూడా లభించాయి.



# 7. ఋజ్యా రక్ష

"ఇంద్రస్య దూతీరిషితా చరామి మః ఇచ్ఛన్తీ పణ్యానిధీన్వః"

(క్రీ॥ పూ॥ 1197)

(ఋ. 10-108-2)

"సరమా : నీవు చాలా దూరప్రాంతం నుండి, అనేకమైన మార్గాయాసాలను సహించి ఇక్కడికి వచ్చావు. నీ రాకకు కారణమేమిటి ? ఏమికోరి నువ్విక్కడికి వచ్చావు ? అదిసరే మార్గమధ్యంలోవున్న నది నెలా దాటావు ?"

'పై ప్రశ్నలు, ఒక ఆర్యస్త్రీని, పణులు అడుగుతున్నారు.'

'సరమా' చూడ్డానికి నలభైయ్యే, నలభై ఐదేళ్ళదానిలా కనిపించినా, తలంతా ఎప్పుడో పెరుగుబుట్టయింది. తల నెరిసిందన్న మాటే గానీ, ఆమె ముఖంలోగానీ, శరీరంలోగానీ ఒక్కముడతా కనుపించడం లేదు. స్వరం కూడా బాగా దృఢంగా, స్ఫుటంగా వుంది. తామ్రవర్ణులైన, పణులమధ్య ఎత్తయిన ఆసనంమీద. గంభీరముద్రలో కూర్చునివుంది సరమా ! గంభీరంగా ఎందుకు వుండదు ? సప్తసింధు అంతటికీ రాజ్యాధి

కారుసైన ఆర్యజాతికి చెందిందామె : ఇక గంభీరానికి, స్వేచ్ఛకు ఏంతక్కువ? ఆర్యుల ముఖ్యస్థావరాలు అక్కడికి చాలా దూరం. చాలా దూరాన్నుండి, విజాతీయుల భూమిలోకి వచ్చింది సరమా ! పణులు ఆమెపట్ల సహజమైన ఆదరాన్నీ, గౌరవాన్నీ ప్రదర్శిస్తున్నారు. వారి ప్రవర్తనలో ఎక్కడా, భయం కాని, తెచ్చిపెట్టుకున్న తనం కాని కనుపించడం లేదు.

సరమా ఆర్యస్త్రీ. ఆర్యుల్లో కనిపించే ఉద్దండతతోకూడిన అభిమానం ఆమెలోనూ వుంది. ఆమె మాటలుకూడా కొంతవరకూ కఠినంగానూ, నిర్మొగమాటంతోకూడి వుంటాయి. అయినా పణులు సరమాపట్ల గాఢమైన కృతజ్ఞతను ప్రకటిస్తుంటారు. అందుకు కారణం కూడా వుంది. ఆర్యులు క్రోధోన్మత్తులై, పణులనుకానీ. కిరాతకులనుగానీ. విచక్షణారహితంగా చిత్రవధచేయడానికి సిద్ధమైనప్పుడు, సరమా, వారిని రక్షించడానికి ప్రయత్నించేది. రక్షించేది. కనుకనే సరమాపట్ల వారికా గౌరవమూ కృతజ్ఞతాను : దీనులూ, దుఃఖితులూ, బాధామయజీవులు అంటే సరమాకు ఎంతో దయ. వారికి సదా సహకరిస్తూ వుంటుంది. అయితే సరమాయొక్క ఈ సహకారం లోనూ, ఆర్యజాతియొక్క శ్రేయస్సే అంతర్భూతమై వున్న ప్రధానాశయంగా గోచరిస్తుంది. వందల సంఖ్యలో ఆర్యులు హతులై తేగాని సాధించలేని కార్యాన్ని, ఒక్క ఆర్యుడూ నిహతుడు కాకుండా సాధించుకురావడం సరమాలోని గొప్పతనం. అలాటి స్థితిలో విపక్షులు వేలసంఖ్యలో మృత్యువు నుండి కాపాడబడడమూ సహజమే !

ఆర్య స్త్రీ పురుషులు పరస్పరం చాలా స్వతంత్రంగా కలుపుగోలుతనంగా వుంటారు. వివాహాది విషయాల్లో పధూవరుల ఎన్నిక యువతీ యువకుల ఇష్టంమీదనే ఆధారపడి వుంటుంది. కన్యకు ఇష్టం లేకపోయినా ఎవడో ఒకడి మెడకు చుట్టడమన్న పనిని ఆర్యులెన్నటికీ చేయరు. ఆర్యస్త్రీలు సర్వ విషయాల్లోనూ స్వతంత్రులు ! అయితే సాధారణ ఆర్య స్త్రీ స్వాతంత్ర్యానికీ, సరమాయొక్క స్వాతంత్ర్యానికీ వ్యత్యాసం వుంది సరమా ఏ ఆర్య గణంలో వుంటే ఆ గణానికి నాయకురాలిలా, దేవతలా భాసిస్తుంది. ఆమెకు దేవతల్ని ప్రత్యక్షం చేసుకోగల శక్తికూడా వుందని ప్రతీతి. ఎప్పుడూ ఆమె వెంట వందల సంఖ్యలో అనుచరులుంటూ వుంటారు. ఆమె అనుచరుల్లోని పణులూ, నిషాదులే

అధికం. సరమాకు స్వాగతం చెప్పడానికి, ఆమెను సత్కరించడానికి, పణి నిషాద స్త్రీ పురుషులు సదా పోటీ పడుతుంటారు. తమవద్దనున్న పశుధనాన్ని కానుకగా ఇస్తూంటారామెకు.

సరమాకు ఎక్కడా స్థిరమైన నివాసమంటూ లేదు. తన అనుచరులను వెంట తీసుకుని ఒక చోటినుండి మరోచోటికి ఎప్పుడూ తిరుగుతూ వుంటుంది. ఆమె నాశ్రయించిన దీనులూ, దుఃఖితులూ, దరిద్రులూ - రిక్త హస్తంతో, నిరాశతో వెనుతిరిగి రావడం జరగదు. దాన ధర్మాల్లోనూ, సహాయ సంపత్తుల్లోనూ జాతి విచక్షణ చేయదామె. ఉదారచరిత ! ఆమె ఆవాసంలో రాత్రింబగళ్ళు అతిధి సత్కారాలు జరుగుతుంటాయి. అతిధులు వివిధ జాతులకూ చెంది వుంటారు. భోజన శాలలో సర్వకాలాల్లో, అహర్నిశలూ అగ్ని మండుతూ వుంటుంది. పెద్దపెద్ద గుండిగల్లో మాంసం వుడుకుతూంటుంది, ఒక చెంప రొట్టెల్ని కాలుస్తూంటారు, పిండి రాశిపోసి వుంటుంది. ఆర్యులకు పిండి అంటే మహా యిష్టం. సరమా వంటశాల్లో వరి అన్నంకూడా వండుతారు. గోధుమ కావలసినవారికి గోధుమకూడా దొరుకుతుంది.కొంతమంది బర్రెమాంసాన్ని కోరేవారూ వుంటారు. వారికొరకు బర్రె మాంసమూ సిద్ధమౌతుంది సరమా ! మొత్తం సప్తసింధులో ప్రసిద్ధి నందడానికి యీ నిరంతరం అతిథిసత్కారమూ ఒక కారణమే !

సరమా వయస్సు అరవైని దాటుతోంది. కాని, ఆమె సౌందర్యం మాత్రం యింకా అనన్యసామాన్యంగానే వుంది. మరి తరుణవయస్సులో యెలా వుండేదో ? అతి రూపవతి అనవచ్చు ! మరా రోజుల్లో ఆమె సౌందర్యాన్ని చూసి మోహించిన యువకుల్లేరా ? తప్పకుండా వున్నారు. కాని అంగీరస వంశంలో ఉద్భవించిన ప్రజాశ్రేయోదాయిని అయిన, ఈ సరమా, వివశంగా వివాహ సంకల్పాన్ని వదులుకోవలసిన పరిస్థితులేర్పడ్డాయానాడు. సరమా ఒక యువకుణ్ణి ప్రేమించింది. ఆ యువకుడూ సరమా నెంతగానో ప్రేమించాడు. కాని, వీ రిద్దరూ వివాహ మాడడానికి తలిదండ్రులు వప్పుకోలేదు. ఇంతలో పణుల గోవులను అపహరించడానికి వెళ్ళిన తన ప్రియుడు దెబ్బతిని, శత్రువులకు బందీగా దొరికిపోయాడని ఆమెకు తెలిసింది. అతణ్ణి విడిపించుకోవాలనీ యెంతో ప్రయత్నించింది. కాని, విడిపించుకోలేకపోయింది. అతడు పణుల బందీగృహంలోనే

చనిపోయాడు. అప్పుడు సరమా 20 ఏండ్ల ఎలప్రాయంలో వుంది. పరిపక్వమైన బుద్ధికుశలత కలది. ప్రియుడి మృత్యు వార్తను వినిన క్షణానే తన హృదయంలో నుండి వివాహపు సంకల్పాన్నే తీసివేసుకుంది. ఆ నాటినుండి ఆమె తన జీవితాన్ని దీనులకూ, అసహాయులకూ సహాయ్యం చేస్తూ గడుపు గోంది. తన జీవితంలోని అనంతమైన దుఃఖంలో నుండి ఆమెకు నూతనమైన ప్రేరణలు కలిగాయి. వివిధ జాతుల ప్రజల్లోనూ. వివిధ రంగుల ప్రజల్లోనూ దుఃఖమనేది ఒకేరకంగా పనిచేస్తోంది. దుఃఖానుభవం అందరికీ కటువుగానే వుంటుంది. అప్పటినుండి సరమాకు ఇతరుల - జాతి విచక్షణలేకుండా - దుఃఖంలో పాలుపంచుకుని, వారికి సహాయంచేసి, దుఃఖోపశమనాన్ని కల్పించడంలో దివ్యమైన ఆనందానుభూతులు కలుగుతూండేవి. ఇప్పుడామె జీవిత పరమాదర్శమే ఇతరుల దుఃఖాన్ని ఉపశమింప చేయడమయింది. ప్రజలు ఆమె జీవిత విశేషాలను చిత్ర విచిత్రాలైన గాథలుగా చెప్పుకుంటారు. పణులు ఆమెను మహామాత అనీ, పృథ్వీమాత అనీ పిల్చేవారు.

సరమా సదా పర్యటిస్తూనే వుంటుంది. ఇప్పుడు ఆమె శతద్రు, పరుష్ణి నదుల సంగమ స్థానాన్ని దాటి దక్షిణ దిశగా చాలా దూరం వచ్చేసింది. అక్కడికి మహామరుభూమి (థార్ ఎడారి) చాలా దగ్గర. ఆర్య గ్రామాలు అక్కడసలు లేవనే చెప్పవచ్చు! బహుళంగా మార్గాయాసాలను సహిస్తూ, సరమా అక్కడికి రావడం నిజంగా ఆశ్చర్యకరమైన విషయమే! ఐతే, రాక తప్పలేదు! అక్కడి ఆర్యులకు పణులకు మధ్య సంబంధాలు చెడిపోయాయి. సరమా తన ప్రయత్నంవల్ల సత్సంబంధాల్ని స్థాపించడానికి వచ్చింది. పణులు సహజంగానే తమ శాసకుల శాసనాన్ని ఉల్లంఘించే స్వభావం కలవారుకాదు. అయితే సహనానికి కూడా ఒక హద్దంటూ వుంటుందిగా? అత్యాచారాలు విపరీతమైనప్పుడు ఆర్యుల శాసనాన్ని తిరస్కరించక ఏం చేస్తారు? ఆర్యులకూ ఇదోవంక దొరికింది. తమ శాసనాన్ని ధిక్కరించారనే సాకుతో పణిజాతినే సర్వనాశనం చేయడానికి సిద్ధమయ్యారు. కాని, పణిజాతిని సర్వనాశనం చేయడం ఆర్యులకే కాదు, ఆర్యుల దేవతలకుకూడా సాధ్యంకాదు. పణులు లక్షలసంఖ్యలో వున్నారు. అంతమందిని నాశనం చేయడం ఎవడితరం? అకారణంగా మానవులను

చంపి, మాంసాన్ని ప్రోగులు పెట్టడం ఎటూ సంభవంకాదు. పైగా ఆర్యు లకు పణులు పాడి ఆవుల్లాంటివారు. వారి పశువుల్లోనూ, పంటల్లోనూ ఆర్యులకు భాగాలున్నాయి. ఆర్య రాజులూ, సామంతులూ తమకుకావలసిన విలాస వస్తువులను పణులవద్దనుండే ఉచితంగా పొందుతూంటారు. ఆర్య వీరులు శిల్పకారులైన పణులవద్దనుండే సుందరమైన, శక్తివంతములైన అస్త్ర-శస్త్రాలను పొందుతూంటారు. ఇన్నివిధాలా తమకు, ఆదాయాన్నీ, సహకారాన్నీ ఇస్తూన్న పణులను ఆర్యులెలా సర్వనాశనం చేసుకుంటారు? ఐతే, పణులను సర్వనాశనం చేయాలన్నంత కోపం ఆర్యుల్లో కలిగినమాట మాత్రం యథార్థం! ఆర్యుల కోపం సరమాకు తెల్సును. కనుకనే ఈ శరత్తులో, శతద్రు, పరుష్ణి సంగమాన్నిదాటి, దక్షిణదిశన, సుదూరాన. ధాన్య (ధార్) ఎడారికి సమీపానవున్న ఆ నూతన ప్రదేశానికి వెళ్ళింది. అక్కడున్న పట్టణాలూ-గ్రామాలూ అన్నీ పణులవే, ఆ పట్టణాల విపుల ఐశ్వర్యాన్ని చూసే ఆర్యులు ఆ రుధ పాణులయ్యారు. ఆర్యులకు, వారు కోరిన ధనాన్ని ఇచ్చివేస్తే ఇకవారు ఈ కత్తులు నూరడాన్ని మానేస్తారని అనుకుంది. అలా ఇప్పించడానికే పణుల గ్రామాల్లోకి వచ్చింది.

సరమా ఆ పణుల గ్రామానికి వచ్చి రెండు మూడురోజులయింది. పణులు ఆమెకు ఘనంగా స్వాగతాన్నిచ్చారు. ఆమె అభిప్రాయాల్ని విన డానికి, పణీజాతి సరదారు లెందరోమంది చాలాదూర ప్రదేశాలనుండి కూడా వచ్చారు. ఏమైనా, ఈమాటు పణులకూ, ఆర్యులకూ మధ్య అగ్ని బాగా రగుల్కొంది. సరమాప్రయత్నాలు సఫలమయ్యే సూచనలు కనుపించడం లేదు. ఆమె మాటలు సరదారులకు అంతగా రుచించడంలేదు.

ఇంద్రుడి దూతిక- ఆర్యులదూతిక, సరమా - పణులతో "ఓ పణి ప్రజలారా! నేను ఇంద్రుడి దూతికనై, మీ నిధులను, ధన సంపదలను వెతుక్కుంటూ వచ్చాను. ఇంద్రుడిపట్ల నా హృదయంలో ఉన్న భక్తి, భయాలే నన్ను రక్షించాయి, నదిని దాటించాయి!" అని అంది.

వృద్ధుడైన పణుల సర్దారొకడు నవ్వుతూ "సరమా, నీవు మానిధు లను వెతుక్కుంటూ రాలేదు. నీ అభిప్రాయం మాకు తెల్సును!" అన్నాడు.

"నిజం, నేను మీ నిధుల కోసరమే వచ్చాను. ఇంద్రుడి ఆజ్ఞ ననుసరించి వచ్చాను!"

"సరేకాని, ఇంద్రుడి దూతికనై వచ్చానన్నావుకదా ! అసలు ఇంద్రుడెలా వుంటాడో చెప్పు చూద్దాం ! పోనీ, నీవురాకుండా అతణ్ణే పంపకపోయా ! నీద్వారానైనా అతణ్ణి మిత్రుణ్ణి చేసుకునే వాళ్ళంగా ! అతడు మా గోవుల్ని కాస్తుంటాడు. మే మతడికి కావల్సినన్ని గోవుల్ని. కోరినంత ధనాన్నీ ఇస్తాము."

సరమా చాలా గంభీరాన్ని దాల్చింది. "ఇంద్రుడు అజేయుడు, మీనముఖా, సముద్రాలూ ఏవీ అతడి మార్గాన్ని అడ్డలేవు. అతడి వజ్రా (గదా) ఘాతంతో మీరందరూ హతులౌతారు" అన్నది.

సరదారు ఇలా అన్నాడు : "ఓ సుభాంగీ ! మా గోవులు దిగంతాల వరకూ వ్యాపించి వున్నాయి. వాటిని గాజేయడానికి పీతకేశులు - ఆర్యులు పన్నిన పన్నాగం ఇది. అనవసరంగా ఇంద్రుడి పేరు మధ్యలో ఇరికిస్తారెందుకు ? ఆర్యులు నీ ద్వారా మా కో బెదిరింపును పంపించారు. కాని మేమంతమాత్రానికి బెదరం. మా కత్తులు బాగా తీక్షంగా వున్నాయి."

"మీ కత్తులూ, మీ ఆయుధాలూ చాలా తీక్ష్ణమైనవని ఎవరెరగరు ? ఆర్యులవద్దనున్న తీక్ష్ణ, మారణాయుధాలు మీరిచ్చినవేగా : అయినా ఒక విషయాన్ని మీరు మర్చిపోగూడదు. ఆయుధాలు మీరిచ్చినవే అయినా వాటి ప్రయోగం మీకు తెలియదు. ఆర్యులబాణాలు మీ శరీరాలను భేదించేస్తాయి. దేవగురుడైన బృహస్పతికూడా ఆర్యులతరపున వుండి మీమీద పోరాడ్డానికి సిద్ధంగా వున్నాడు."

"ఆర్యులకు ఒక్క బృహస్పతే కాదు. వందమంది బృహస్పతులొచ్చి సహాయం చేసినా మాకేమీ భయం లేదు. మా గోవులూ, మా నిధులూ అన్నీ పర్వతాల్లో వున్నాయి. మా యోధులు వాటికి కాపలా కాస్తున్నారు. ఆర్యులు అస లా పర్వతాల్లోకి వెళ్ళడమే అసంభవం. ఒకవేళ వెళ్ళినా వారికి లభించే దేమీ వుండదు.

సరమా పరిహాసంగా నవ్వింది. "నీవు చెప్పేది సత్యదూరం ! అయాస. ఆంగీరస, నవగూ - మొదలుగాగల ఆర్యయోధులు వస్తారు. వారు మీ ధనాన్ని యెటూ లాక్కుంటారు. మిమ్మల్ని చిత్రవధకూడా చేస్తారు. అనవసరమైన వాచాలత అక్కరకు రాదు :" అంది.

"సరమా! పీతకేశులు, ఆర్యులు ని న్నిక్కడికి అనవసరంగా పంపించారు. అయినా, ఫరవాలేదు. ఎటూ వచ్చావు. ఇక నిక్కడే వుండిపో! మా సోదరి వనుకుంటాము. మా దగ్గిరే వుండిపో! తిరిగి పీతకేశుల్లోకి వెళ్ళవద్దు. నీవు కోరినన్ని గోవుల్నిస్తాము. కాక, నీ కేం కావాలో చెప్పు, ఇస్తాము. వెనక యెన్నోసార్లు నీకు మేము గోవుల నిచ్చాము. నీవు ఆ గోవులను, మా యాచకుల్లోనే పంచేశావు. సరమా, మాకు సోదరివై మా దగ్గిరే వుండడానికి సమ్మతించు."

"ఓ పణులారా! బంధుత్వాలూ, చుట్టరికాలూ పనిచేసే సమయం కాదిది. నన్ను మీరు సోదరిగా స్వీకరించినా, మాతగా స్వీకరించినా ప్రయోజనంమాత్రం శూన్యమనే చెప్పక తప్పదు. ఇంద్ర, ఆంగీరసులు మీ ధనాన్నీ, మీ గోవుల్నీ కోరుతున్నారు. వారు మిమ్మల్ని యెటూ విడువరు. కనీసం మీ రిక్కడినుండి దూరం, చాలాదూరం వెళ్ళిపొండి! ఇక నేను వెళ్ళిపోతున్నాను."

పణులు యెక్కడికి పారిపోగలరు? వారికి ఒక్క గోధనమే కాక, ఇతర ధనాలుకూడా అపారంగా వున్నాయి. తరతరాలుగా కష్టించి, అపారంగా సంపదను ప్రోగుచేసుకున్నారు. వారి గ్రామాలూ, నగరాలూ - సంపదలకు నిలయాలు! ఊరకా ఏ మాత్రమూ సంఘర్షించకుండానే, ఈ గ్రామాలనూ, నగరాలనూ - సర్వసంపదలనూ విడిచి వెళ్ళడం సంభవ మేనా?

* * *

ఆర్యులకూ, పణులకూ జరిగిన ఈ సంఘర్షణను, సాధారణ యుద్ధమనో, దోపిడీ అనో చెప్పడానికి వీలులేదు. సంధి చేయడానికి ప్రయత్నించిన సరమా కూడా ఓడిపోయింది. సప్తసింధుయొక్క దక్షిణ పశ్చిమ దిశలను (ఇక్కడే పణిజాతి అధికంగా వుంది) నిప్పంటుకున్నట్టయింది. నిన్నటివరకూ పిరికివాళ్ళ లాగున్నవారు ఇవ్వాళ కత్తిపట్టి కదన రంగానికి వురుకుతున్నారు. ప్రాణంమీదికి వచ్చినప్పుడు తెగించక ఏం చేస్తారు? ఆర్యజనాలన్నీ కలిసి ఒకటయ్యాయి. దివోదాసు వారికి నాయకు డయ్యాడు. అనేక సంఘర్షణల్లో పణుల్ని ఘోర పరాజయాల పాలుచేస్తూ,

ఆర్యవాహిని ఇప్పుడీ సప్తసింధుయొక్క పశ్చిమ-దక్షిణ కొసకు వచ్చింది. సింధు తటానికి క్రింద, తూర్పు దిశగా కనుపించే పర్వతాలన్నీ, పణుల దుర్గాలుగా మారిపోయాయి. ఆ పర్వతాలకు మరికొంత తూర్పున ధన్వ ఎడారి (థార్ ఎడారి) వుంది. ఈ ఎడారికూడా పణుల రక్షణకు ఎంతగానో ఉపకరిస్తోన్నది. తమ ఒంటెలను ఎక్కి ఈ ధన్వఎడారిలోకి పారిపోవచ్చు: నీరూ, వనస్పతి లభించని ఈ ఎడారిలో ఆర్యుల గుర్రాలు నిశ్శక్తమూ, నిరుపయోగమూ అవుతాయి !

ఇప్పటికీ బృహత్పర్వతాల్లోని కిరాతకులతో ఆర్యులకూ సంఘర్షణ జరుగుతూనే వుంది. ఆర్యులు ఉత్తర, దక్షిణ - రెండు రంగాలల్లోనూ యుద్ధం చేయవల్సినవారయ్యారు. బృహత్పర్వత రంగంలో దివోదాసు వుండడం చాలా ముఖ్యం ! పణులూ, కిరాతకులు - వీరిద్దరూ కలసి, ఉమ్మడి శత్రువైన ఆర్యులతో తలబడినట్లయితే, ఆర్యులకు పరాజయం తప్పదు. పణులూ, కిరాతకులూ కలవడానికి అభ్యంతరకరంగా పరిణమించిన పరిస్థితులు రెండున్నాయి. ఒకటి జాతిభేదం. రెండవది ఉభయజాతుల ప్రదేశాల్లోని దూరం ! ఇలా పణులు, కిరాతకులు - కలసి తమను ఎదుర్కొనలేకపోవడం ఆర్యుల అదృష్టమనే చెప్పాలి ! ఆర్యులకు మహాపరాక్రమవంతులైన సేనానాయకు లెందరో వున్నారు. 'శ్యావపుత్రు తౌగ్య భుజ్యు' మహా పరాక్రమవంతులైన సేనానుల్లో ఒకడు. ఇతణ్ణే దివోదాసు దక్షిణ రంగానికి సేనానాయకుడిగా పంపించాడు. భరతభూమి - (భరతజనపు భూమి, పరుష్ణీతీర ప్రదేశం) కి దక్షిణంగా చాలా దూరం వరకూ భుజ్యురో గట్టిగా నిలబడి పోరాడినవాడెలేడు. కాని. అతడు పణుల భూమిలోనికి పోయినకొలదీ బాధలధికమయ్యాయి ! ఆర్యులు పణుల ధనాన్ని దోచుకుని ఇండ్లకు నిప్పంటించి. గ్రామాలకు గ్రామాలను దగ్ధం చేసేస్తున్నారు. ఈ స్థితిని గమనించిన పణులు గ్రామాలను ఖాళీచేసేముందు, తమ గ్రామాలకు తామే నిప్పంటించి దగ్ధం చేసేస్తున్నారు. తమవెంట తీసుకు వెళ్ళగలిగినంత ఆస్తినీ, ధనాన్నీ తీసుకువెళ్తున్నారు. తీసుకువెళ్ళడానికి అసాధ్యమైన ధనాన్ని ఇండ్లల్లోనేవుంచి నిప్పంటించివేస్తున్నారు. సంఘర్షణ ప్రారంభమైన ప్రధమస్థితిలో పణుల భూమికి సమీపంలోవున్న ఆర్యుల తాత్కాలిక నివాసాలను కొన్నింటిని పణులు తమ గ్రామాలతోపాటు దగ్ధం

చేశారు. తత్కాలంలో వారి సహాయానికి అన్య ఆర్య సైన్యాలు వెళ్ళలేక పోయాయి. తాము వెళ్ళలేని అసమర్థత ఆర్యుల హృదయాల్లో పణుల మీది క్రోధానలమై భగ్గుమంది. కనపడ్డ ప్రతి పణిని అతి క్రూరంగా. నిర్దయాత్ములై వధించేస్తున్నారు ఆర్యులు. అయితే ఆర్యులకూ కొద్దిగానో గొప్పగానో జననష్టం కలుగుతూనే వుంది.

భుజ్యు సైన్యానికి పణులు ఎన్ని రకాలైన బాధలు కల్పించడానికి వీలుంటుందో అన్ని రకాల బాధలూ కల్పిస్తున్నారు. తమ గ్రామాలనూ, నగరాలనూ ఖాళీ చేయడంవలన ఆర్య సైన్యాన్ని ఒక రకంగా ఇరకాటంలో పెట్టేశారనే చెప్పవచ్చు. గ్రామాలన్నీ నిర్మానుష్యములూ. స్మశాన సదృశ్యములూ కావడంవలన ఆర్య సైన్యం తమ కవసరమైన పూర్తి ఆహారాన్ని వెంట తీసుకునే బయల్దేరవలసి వస్తోన్నది. అడవుల్లో, కొండల్లో చాటుమాటుగా దాగివున్న పణులు అదును చూసుకుని ఆర్య సైన్యాలమీద పడి. ఉన్న ఆహార పదార్థాలను కొట్టేస్తున్నారు. భుజ్యుసైన్యం ఒక్క ఆహారాన్ని గురించే గాక, నీటిని గురించికూడా పెద్దగా బాధపడవల్సిన స్థితి ఏర్పడ్డది. దారిలో వున్న బావులన్నింటిలోనూ పణులు విషం కలిపేశారు. సామాన్యంగా నదుల వద్దున గుడారాలను వేసుకుంటున్నారు. అనేకమైన బాధలను ఎదుర్కొంటూకూడా అతి తక్కువ జననష్టంతో శత్రువుల్ని దూరంగా తరమగలుగుతున్నందుకు భుజ్యును అభినందించక తప్పదు. పణుల నగరాలను దోచడంవలన భుజ్యుకు ఎన్నో మణులూ, మాణిక్యాలూ లభించాయి. వాటిలో కొన్ని తన వీరులకు పంచాడు. మిగిలినవాటిని దివోదాసు వద్దకు పంపించాడు. పణులవద్దనున్న నవరత్నాలనూ చూచి తన కండ్లను తానే నమ్మలేకపోయాడు. పణులవద్ద ఇంత సంపద వుంటుందని అతడు కలలోనైనా వూహించి ఎరుగడు.

అప్పటికి పణిజాతి అంతా ఆర్యుల శాసనం క్రిందకురాలేదు. సింధు నదికి పశ్చిమంలో పశ్చిమ సముద్రంవరకూ కల విశాల భూఖండంలో నివసించే పణులకు అసలు ఆర్యులెవరోకూడా తెలియదు. వారి శాసనంలోని ఘోరదురంతాలను చెవులైనా అంతవరకూ వినలేదు ! కాని, ఇప్పుడిప్పుడే పీతకేశుల అత్యాచారాలు అక్కడి పణులకు తెలియసాగాయి. సప్తసింధులోని తమ పణిసోదరుల సహాయార్థం సింధునదికి పశ్చిమానవున్న పణులు

ఎందరో వచ్చిపడ్డారు. క్రొత్తగావచ్చిన వీరు సప్తసింధులోని పణులంత మూర్ఖులుగానీ, పిరికివారుగానీ కాదు. వీరు చాలా ఉగ్రస్వభావం కలవారు. ఆర్యుల గుర్రాలతో పోటీచేయడం వీరికి చేతగానిపనే ! కానీ, నదీతీరాల్లోనూ, సముద్రతీరాల్లోనూ కల వీరి నావలముందు ఆర్యుల గుర్రాలు ఎందుకూ పనికిరావు ! నూరు తెరచాపలు కల వీరినావలు అతి వేగంగా ప్రయాణిస్తూ వందలసంఖ్యలో సైన్యాన్ని ఒక చోటినుండి మరో చోటికి చేర్చేస్తుంటాయి.

భుజ్యు సైన్యం చివరకు పణులు తమ అపారధనాన్ని, నవనిధులనూ దాచుకున్న పర్వత పంక్తులను సమీపించింది. ఆ కొండలపైకి ఎక్కిచూస్తే ఒకవైపున భయంకరమైన నిర్జన, నిర్జల-ఎడారి ! మరోవైపు సస్యశ్యామల మయిన భూమాత ! పూర్తి విరుద్ధమైన రెండుదృశ్యాలు పర్వతశ్రేణికి అటూ ఇటూ కనిపిస్తూ దర్శకుల్ని ఆశ్చర్యాన్వితులను చేస్తున్నాయి. వరి కోశారు. యవలూ, గోధుమలూ ఇంకా కోతకురాలేదు. పంట పొలాల మధ్యగ్రామాలు కళకళ్ళాడుతూ కనుపిస్తున్నాయి. ఈ గ్రామాల్లో జనసంఖ్య వెనకటికంటే చాలా పెరిగిపోయింది. పణుల గ్రామాలను చూసినప్పుడు ఆర్యులకు మహదానందం కలుగుతూంటుంది. వెనక భుజ్యు సైన్యం ప్రవేశించిన గ్రామాల్లో వారిని గట్టిగా నిరోధించిన వారేలేరు. అనాయసంగా అపూర్వమైన నిధులు చేజిక్కించుకున్నారు. కనుక పణుల గ్రామాల్ని చూసినప్పుడు భుజ్యు సైన్యానికి వెనక అనాయాసంగా తాము సంపాదించిన అపూర్వ నిధులే స్ఫురణకు వస్తాయి : కానీ, పర్వత శ్రేణుల్లోని పణిగ్రామాల్లోకి ప్రవేశించాక భుజ్యు సైన్యం తన వెనకటి అభిప్రాయాన్ని విధిగా మార్చేసుకుంది. దూరప్రాంతాలనుండి వచ్చిన, యుద్ధ వీరులైన పణులు గ్రామాల్లోకి ప్రవేశించకుండా ఆర్యుల్ని అడ్డుకున్నారు.

పణులూ గొప్ప ధైర్య సాహసాలు కలవారే, ఐతే, వారికి ఆయుధ చాలనంలో అంతగా అభ్యాసంలేదు. ఆర్యుల్లోలా పరాక్రమశాలురైన సేనా నాయకులు పణుల్లో లేరనే చెప్పవచ్చు. కానీ, ఇప్పుడు పణుల్లోనూ సేనా నాయకులు తయారయ్యారు. పర్వతాల్లో బలమైన దుర్గాలేర్పడ్డాయి. భుజ్యు సైన్యానికి ఆ దుర్గాలను జయించడం చాలా కష్టమనిపిస్తోంది. ఈ పర్వత శ్రేణుల్ని సమీపించాక, ఈ ఒక్క వారంలోపల, లోగడ ఎన్నడూ

జరగనంతగా ఋజ్వా సైన్యం నశించింది. పర్వతశ్రేణుల్లోని పణుల్ని పూర్తిగా ఓడించి ప్రయోజనం లేదనిపించింది ఋజ్వాకు! పణులు ఓడి పోవచ్చుకానీ, ఆ పర్వత ప్రదేశాల్లో తమ అధికారాన్ని నిలుపుకోవడం ఆర్యులవల్ల ఎన్నటికీ కానిపని! ఆర్యగణాలు తమ ప్రజల్ని ఇక్కడ నివసింపచేయడానికి సమ్మతింపవు. అలాటి స్థితిలో ఆ దుర్గాలనూ, గ్రామాలనూ వశపరచుకున్నా, వదిలి వెనక్కి రావలసిందే! వదిలి వెనక్కి రావడంలో అర్థం అపజయాన్ని స్వీకరించడమే!

గ్రామాల్లో ప్రజలెవ్వరూ ఆర్యులకు దొరకలేదు. ధనధాన్యాలు, సంపదలు - అంతకంటే దొరకలేదు! పణులు తమతోపాటు సమస్తసంపదల్ని పర్వతాల్లోని దుర్గంలోకి చేర్చేసుకున్నారు. పసిరికచే నిండిన పణుల చేలల్లోకి ఆర్యులు తమ గుర్రాలనూ, ఆవులనూ తోలారు. ఆహారంకొరకూ ఇతర అవసరాల నిమిత్తమూ సర్వకాలాల్లోనూ ఆర్యులు తమ పశువుల్ని వెంట తీసుకుపోతూంటారు. పణులు యుద్ధసామగ్రినీ, ఖాద్యపదార్థాలను బహుళంగా తమ పర్వతదుర్గంలో ప్రోగుచేసుకున్నారు. దుర్గాన్ని వశపరుచుకునేవరకూ పణులు లొంగిరారు. అయితే పర్వతదుర్గాన్ని జయించడం అంత తేలికైన పనికాదు. శత్రువుయొక్క 'సైనికబలం' మొదలుగాగల రహస్యాలను ముందుగా తెలుసుకోవాలి. అందుకు కావాల్సిన సాధనలు మృగ్యం! ఆర్యుడెవడూ పణుల దుర్గంలోకి ప్రవేశించడం సంభవం కాదు. ఆర్యుల పణుల శరీరపు రంగులోని వ్యత్యాసం ఇట్టే పట్టించేస్తుంది. కాగా, ఆర్యపురుషులకూ. పణిస్త్రీలకూ కలిగిన వర్ణసంకరులు చాలామంది వున్నారు. వారిలో కొందరి శరీరచ్ఛాయ పణులను పోలివుంది. అయినా వారిని ఆర్యులు అంతగా విశ్వసించరు. బాధ్యత కలిగిన పనులను వప్పగించరు. ఆర్యులు తమపట్ల చెడ్డగా వ్యవహరిస్తూండడంవలన ఈ వర్ణసంకరపు పణులుకూడా మనస్ఫూర్తిగా తమ యజమానులతో సహకరించరు. ఆర్య అశ్వారోహులు రెండుమూడు సార్లు పర్వతదుర్గాల క్రిందికి వెళ్ళి చూసికూడా వచ్చారు. ఒకమాటు అశ్వారోహులు, తమ అశ్వాలను క్రింద వదలి. పర్వతదుర్గాన్ని అధిరోహించడానికి ప్రయత్నించారు. పర్వతం నిట్టనిలువుగా ఎక్కవలసి రావడంవలన, కొంతదూరం వెళ్ళాక క్రిందికి దొర్లిపోయారు. మరి ఒకటి రెండుసార్లు ప్రయత్నించారు. కానీ,

రాళ్ళు రువ్వి, పైన బండలు దొర్లించి కిందికి దిగిపోయేట్టు చేశారు దుర్గంలోని పణులు. దుర్గంలోనివారికి తెలియకుండా రాత్రిపూట ఎక్కడానికి ప్రయత్నించారు. అదీ నిష్ఫలమైంది.

ఆర్యరాజకుమారుల సభలో భుజ్యుడు ఒకమాటు సంకర(వర్ణసంకర) శంబూ మాటల్ని పరీక్షించి చూదాం! ఎడారిగుండా వెళ్ళి దుర్గాన్ని చేరవచ్చునంటాడతడు!" అని అన్నాడు. (పర్వతశ్రేణికి రెండవవైపున ఎడారి వుంది. ఇటువైపున సస్యశ్యామలమైన భూమి, గ్రామాలూ వున్నాయి. ఇటువైపునుండి సంభవం కానప్పుడు చుట్టుతిరిగి, ఎడారిలో ప్రవేశించి, దుర్గానికి వెనుకవైపునుండి లోపలికి ప్రవేసించవచ్చునని భావం!)

ఆర్య రాజకుమారు డొకడు అభ్యంతరాన్ని చెప్పాడు. "కానీ, శంబూ సంకరజాతికి చెందినవాడు. వాడు సగం ఆర్యుడూ, సగం పణీ. అలాటివాణ్ణి విశ్వసించడం ఏం బుద్ధిమంతుతనం?" అన్నాడు.

"నిజమే, ఎడారిమార్గం మనకు పూర్తి అపరిచితం. అక్కడ ఎలాటి ఆపత్తు సంభవిస్తుందో తెలియదు. అలాటి సున్నితమైన పరిస్థితిలో అర్ధపణీమీద ఆధారపడడం, అవివేకమే అవుతుంది! కానీ, అతడిమీద ఆధారపడడంకంటే మరోమార్గం మాత్రం ఏముంది?

శంబూ చెప్పిన మార్గాన్ననుసరిస్తే, ఎడారి గుండా ఒకరోజు ప్రయాణం చేసి, దుర్గాన్ని చేరవలసి వుంటుంది. ఎడారిలో ఎక్కడా కాలి బాటలుగానీ, కనీస పద చిహ్నాలుగానీ వుండవు. శంబూ మీద విశ్వాసముంచి, అతణ్ణనుసరించి వెళ్ళవలసిందే! పొంచి వుండి శత్రువు ఎక్కడ మీదపడతాడో అనే భయంలేదు. మహా ఎడారిలో దిక్కుతప్పితే అన్నపానాలు లేకుండా చచ్చిపోతామే, అన్న భయం మాత్రం పూర్తిగా వుంది భుజ్యుకు!

భుజ్యు మహా సాహసంతో ఎడారిలో ప్రయాణం చేయడానికి నిశ్చయించుకున్నాడు. వంటె నొకదా న్నెక్కాడు. మార్గదర్శకుడు శంబూను ముందు కూర్చోపెట్టుకు బయల్దేరాడు. అతడి వెనుక కొంతమంది ఆర్య రాజ కుమారులూ, సైనికులూ బయల్దేరారు. మహా ప్రమాదకరమైన ప్రయాణ మిది. ఒకటి రెండు ఘడియల ప్రయాణానంతరం ఎడారిని చేరారు. అంతవరకూ భుజ్యు ఎన్నడూ ఎడారిని చూడలేదు. ఎడారిని

గురించి విని, ఇంతవరకూ మనస్సులో కల్పించుకుంటూ వస్తూన్న ఎడారిని గురించిన కల్పన, ఎదురుగా కనిపిస్తూన్న వాస్తవిక దృశ్యంకంటే, కొన్ని వందల రెట్లు సుఖకరంగా వుంది! పగటిపూట ఎడారిలో ప్రయాణం చేయటం ప్రమాద భరితమని మార్గదర్శకుడు చెప్పాడు. ప్రక్కనే వున్న వనంలో గుర్రాల్ని కట్టివేశారు. ప్రయాణంలో అవుసరమయ్యే సమస్త సామగ్రినీ ఇక్కడ నుండే తీసుకు వెళ్ళవలసి వుంటుంది. తోలుసంచులలో నీటిని కూడా ఇక్కడి నుండే తీసుకుపోవలసివుంటుంది. రహస్యం వెల్లడి కాకుండా వుండడానికి, అన్యజాతీయుల నెవరినీ వెంటతీసుకురాలేదు. పగలంతా చెట్లచాటునా, బండలచాటునా దాక్కొని గడిపేశారు. సాయంత్రమై ఎండ తగ్గగానే ఉష్ట్రాల నధిరోహించి ప్రయాణాన్ని సాగించారు. బహు దూరాలవరకూ మానవ సంచలనంగానీ, వనస్పతిగానీలేదు. నూతనులెవరైనా కలుస్తారేమోనన్నభయంలేదు. నిర్భయంగా నిశ్చింతగా కదలి వెళ్ళిపోతోంది వంటెబారు. ఒక్కొక్కవంటెమీదా ఇద్దరేసి ప్రయాణం చేస్తున్నారు. ఒక గంట ప్రయాణం చేశాక వంటెలబారు పూర్తిగా ఎడారిలోకి వచ్చేసింది. ప్రాణి. జల, వనస్పతి విహీనమైన కేవలం ఎడారి మాత్రం కనుపిస్తోంది. పైన నీలి ఆకాశం, క్రింద సువిస్తృతమైన ఇసుకరాశి: ఎటు చూసినా, సన్నని, తీక్ష్ణమైన, అనంత దూరాలవరకూ వ్యాపించిన, బంగారు రంగు ఇసుక! పెద్ద పెద్ద జలాశయాల్లో నీటి అలలు లేచినట్లుగానే, ఈ ఎడారిలో ఇసుక అలలు లేస్తున్నాయి! మరి ఒకటి రెండు ఘడియలు గడిచి, సూర్యాస్తమయం కాబో తూన్నదనగా భుజ్యుకూ. అతడి సహచరులకూ దిశాజ్ఞానం నశించింది: తాము దుర్గంవైపు వెళుతున్నారో, లేక ఎడారిలోకి చొచ్చుకు పోతూన్నారో తెలియ లేదు. మరికొద్దిక్షణాల్లో భుజ్యు ధైర్యం సన్నగిల్లింది. శంబుతో "మనం దిశ తప్పలేదుగా? సరీగానే వెళ్తూన్నాముగా?" అన్నాడు.

"సరీగానే వెళ్తూన్నాము. నే నీదారిన చాలాసార్లు ప్రయాణం చేశాను. పైగా, మనమెక్కిన వంటె ఎన్నటికీ దిశతప్పదు:" అన్నాడు శంబు.

భుజ్యు ఆలోచించ సాగాడు "వంటె నాకంటే ఎక్కువ జ్ఞానం కలదా, చక్షుర్జ్ఞానేంద్రియాల సత్వం దానికి నాకంటే ఎక్కువా? మను ష్యుడికంటే పరిచయజ్ఞానం వంటెకు ఎక్కువా?" అనుకున్నాడు. కానీ, ఇప్పుడు ఆలోచించి ప్రయోజనంలేదు. ఇప్పుడు తిరిగి వెనక్కి వెళ్ళాలన్నా

శంబును విశ్వసించి అతడి మార్గదర్శకత్వా న్నాశ్రయించ వల్సినదే! ఐతే శంబూకూడా ప్రాణాలమీది ప్రీతి అధికంగానే వుందని ఋజ్యాకు తెల్సు!

అర్ధరాత్రివరకూ అలాగే మౌనంగా ప్రయాణం చేశారు. ఎవ్వరూ ఏ ఒక్కమాటా మాట్లాడలేదు. ప్రాణి హీనమైన ఆ ఎడారిలోనుండి ఎలాటి శబ్దాలూ వినబడలేదు. అంతవరకూ ఒంటెల నడకవల్లకూడా ఏమాత్రం శబ్దం జనించడంలేదు. బలువైన ఒంటెల పాదాలు మృదువైన ఇసుకలోపడి, నిశ్శబ్దంగాసాగిపోతున్నాయి. అనంతమైన ఆ నిశ్శబ్దంభరింపశక్యంకాకుండా వుంది. శంబు ఆకాశంలోని తారకలవంకచూసి "ఇక ఇప్పటికి ప్రయాణాన్నాపి. విశ్రాంతి తీసుకుందా" మన్నాడు. ఆర్యుల హృదయాల మీదనుండి పెద్ద బరువును తీసివేసినట్టయింది. శంబు దుర్గానికి బాగా దగ్గరకు వచ్చేశామనీ. తెల్లవారడానికి రెండుగంటల ముందుగా బయల్దేరినా. సూర్యోదయానికి ముందే దుర్గాన్ని చేరవచ్చుననీ చెప్పాడు. అతడి సూచన ప్రకారం రెండు మూడు గంటలకాలం విశ్రాంతి తీసుకొనవచ్చు నక్కడ! చుట్టుపట్ల ఎక్కడా శత్రువుయొక్క అలికిడిలేదు. ఆర్యులు మూతలు పడిన తమ గళాలనువిప్పి పెద్దగా మాట్లాడుకుంటూ, నవ్వుకుంటూ వున్నారు. భోజన సామాగ్రిక్రింద దింపుకున్నారు. వెన్నెల రాత్రి. తెల్లని ఇసుకపైబడి వెన్నెల శోభాయమానంగా మెరుస్తోంది. అందరూ ఇంద్రుడి మహిమను పొగుడుతూ, భోజనాలకు ఉపక్రమించారు. ఉడకపెట్టిన మాంసాన్ని. పిండినీ కడుపులనిండా భోంచేశారు. అనంతరం సోమపానానికి సిద్ధమయ్యారు. ఒక్కొక్కరూ పెక్క చషకాలను నింపుకుని సోమరసాన్ని సేవించసాగారు. ఋజ్యా మొదటే సోమపానం 'అతి' కాకూడదని గట్టిగా శాసించాడు. కనుకనే సోమపానంలో ఎవరూ వళ్ళుమరువలేదు!

కొన్నిఘడియలు అందరూ వళ్ళుమరచి నిద్రపోయారు. ఋజ్యా మాత్రం జాగరూకుడై మేలుకునివున్నాడు. అందరూ నిద్రలేచిన తరువాత సాయుధులై తిరిగి ప్రయాణాన్ని సాగించారు. చీకట్లు విచ్చకముందే, వెళ్తూనే దుర్గంమీద ఆక్రమణ జరపాలని ఋజ్యా వుద్దేశ్యం! శంబు నక్షత్రాలను చూస్తూ వాటిద్వారా తాము వెళ్ళవలసిన దిశను తెల్సుకుంటున్నాడు. అందరూ పశ్చిమదిశగా పయనిస్తున్నారు. మార్గదర్శకుడైన శంబు తప్ప, మిగిలిన అందరూ, ఎటువెళుతున్నారో తెలియని అయోమయ స్థితిలోనే

వున్నారు ; మూడు ఘడియలకాలం నడిచాక పశ్చిమ దిశన కారుమబ్బుల్లాంటి నల్లని పర్వతశ్రేణులు కనుపించాయి. ఆర్యసైనికులకు పోయిన ప్రాణాలు వచ్చినట్లయింది. శంబూ ఎదుట అంతవరకూ ఎవరూ తమ సంశయాన్ని ప్రకటించకపోయినా అతడికి అంతా తెల్సు ! శంబు చాలా వుల్లాసంగా ఆకాశంలోని నల్లని రేఖను అందరికీ చూపాడు. పూర్వనిశ్చయానుసారం అనవసరమైన కొన్ని వస్తువులను ఒంటెలనూ అక్కడే వదలివేశారు. వాటి కావలాకు కొంతమంది అనుచరులనుకూడా అక్కడేవుంచి, కేవలం యుద్ధ యోధులు మాత్రం ఒంటెలనెక్కి ముందుకు వెళ్ళిపోయారు. దుర్గంవరకూ ఎడారివుంది. దగ్గరకువెళ్ళాక ఇసుకలోనుండే కొన్నిరాళ్లు మొలిచినట్టుగా కనుపించింది. దుర్గంయొక్క గోడలు స్పష్టంగా కనుపించసాగాయి. ఇటు పర్వతాలు బాగా వాలుగావున్నాయి. అందరూ ఒంటెలను దిగి ప్రాకారం వైపుగా పర్వతాన్నెక్కసాగారు. నిశ్శబ్దమైన రాత్రిలో పర్వతంమీద నడ నడంవలన కొంత శబ్దం తప్పక అవుతుంది. కానీ. ఈ దుర్గమమూ, అజ్ఞాతమూ అయిన మార్గంగుండా శత్రువు లొస్తారని ఎవ రూహించగలరు?

పణులయొక్క ఈ పర్వత దుర్గాన్ని వెనుక ఒకసూటు ఆర్యులు గెల్చారు. కానీ, అధీనంలో వుంచుకోలేకపోయారు. తరువాత పణు లా దుర్గాన్ని చాలా బలిష్టమైన దుర్గంగా రూపొందించుకున్నారు. ఐతే ఇటువైపునున్న దుర్గప్రాకారం ఏమంత ఎత్తయిందికాదు. భుజ్యూ అతడి సైనికులు - సునాయాసంగా ప్రాకారాన్ని దాటి దుర్గంలోకి ప్రవేశించారు. లోపల శత్రుసైనికులు అధిక సంఖ్యలో వున్నారు. ఆర్యులు ప్రాకారాన్ని దాటివచ్చారని తెలియగానే. పణి సైనికులు ధైర్యంగా ఎదిరించారు. కానీ, ప్రదేశం చాలా ఇరుకుగా వుంది. పణులు తమ సంఖ్యాబలాన్ని చక్కగా వుపయోగించుకోలేక పోయారు. తెల్లవారాక సూర్యుడి శుభ్రకాంతిలో ఆర్యులకు మరీ బలసమృద్ధులు లభించాయి. పణులుకూడా ప్రతి అంగుళ ప్రదేశాన్ని రక్షించుకోడానికి వీరోచితంగా పోరాడారు. బాణాలూ, బల్లేలూ, ఎనుకుని శత్రువుమీద విరుచుక పడ్డారు. అయినా ప్రయోజనం లేక పోయింది. సూర్యోదయమైన జాము ప్రొద్దెక్కేసరికి పణులు దుర్గాన్ని విడిచి పారిపోయారు. భుజ్యూకు పణి సేనానిపేరు తెల్సును. అతణ్ణి సప్రాణుడుగాగాని, అప్రాణుడుగాగాని పట్టుకోవాలని భుజ్యూ యోచన. కానీ,

పణి సేనాని తప్పించుకు పారిపోయాడు. అతడు తప్పించుకు పారిపోవడంతో ఆర్య సైనికులకు అలవిమాలిన కోపం వచ్చింది. మిగిలివున్న శత్రు సైనికులపై, అనేకరకాలైన అత్యాచారాలు చేసి, తమ క్రోధాన్ని చల్లార్చుకున్నారు.

పణిసేనాని స్వతంత్రుడుగా, అపరాజితుడుగా వున్నవరకూ, సింధు నదీతీరంలో అతడి సైన్యం తిరుగాడుతూన్న వరకూ, ఆర్యులు తమకు లభించిన ఈ సఫలతను విజయమని చెప్పుకోలేరు. అలాటి స్థితిలో పణి సేనానిని వెంబడించడం కంటే ఋజ్వకు వేరుమార్గం కనుపించలేదు. మరికొంతమంది ఆర్యసైనికులను పిలిపించుకునే సమయంకూడా లేదు. తక్షణం వెంబడిస్తేగాని పణిసేనాని దొరకడు. తీవ్రగాములైన అశ్వాల సాయంతో తమ ఈ సఫలతను గురించిన సమాచారాన్ని దివోదాసుకు అందజేశారు. పర్వత దుర్గంలో లభించిన ధనాన్ని దివోదాసువద్దకు పంపించి వేశాడు. తరువాత పణిసేనానిని వెంబడించడానికి బయలుదేరాడు.

పణి నాయకుడు నావ నెక్కి వెళ్ళిపోతున్నాడని తెలిసింది. సింధు నది అక్కడికి నాలుగురోజుల ప్రయాణములో వుంది. భూమికూడా మంచి గట్టిది. గుర్రాలను వుపయోగించుకోవచ్చును. ఒక్క క్షణమాత్రమైనా ఆలశ్యం చేయకుండా ఆర్యసైనికులు గుర్రాలను వేసుకుని పణిసేనానిని వెంబడించారు. పణులవద్దా గుర్రాలున్నాయి. అయితే అవేమంత వుత్తమ జాతికి చెందినవని కావు. పణి సైనికులకు అశ్వారోహణంలో ఆర్యసైనికుల కున్నంత నేర్పులేదు. గుర్రాల గిట్టల పదచిహ్నాలు శత్రువు ఎటుపోయింది తెల్పుతూనే వున్నాయి. పణిసేన సింధుతటాన్ని జేరేసరికి ఆర్యసేన వచ్చిపడింది. అయితే అప్పటికీ పణిసేనాని నావసాయంతో తీరాన్ని విడిచి వెళ్ళిపోయాడు. కొద్దిమంది పణిసైనికులు తీరంలో ఆర్యుల్ని అడ్డగించి కాలయాపనకు తోడ్పడ్డారు. పణులు వెళ్ళేప్పుడు తీరంలో ఎన్నో పెద్ద పెద్ద నావలను విడిచి వెళ్ళారు. వాటిని వెంట తీసుకుని వెళ్ళలేకపోయారు. పోనీ, ధ్వంసమూ చేయలేకపోయారు.

ఇప్పుడు పణులు విడిచివెళ్ళిన నావల సాయంతోనే, ఆర్యులు వాళ్ళను వెంటాడసాగారు: సింధుతీరంలో, రెండువైపులనుండి ఆర్యులు పణులను వెంబడిస్తున్నారు. కొన్ని గుర్రాలను కూడా తమవెంట ఒక

నావలో తీసుకుని వెళ్తున్నారు. ఋజ్యా కూడా ఓ పెద్ద నౌకలో వెంట వస్తున్నాడు. సింధునదియొక్క ఉభయ తీరాల్లోనూ, పణుల దుర్గాలు ఎన్నోవున్నాయి. వాటిని జయించిగానీ ముందుకు వెళ్ళడానికి వీలుపడదు. లేని పక్షంలో ఆపదల్ని తమకుతామై కొనితెచ్చుకున్నవారవుతారు. ఆ దుర్గాలను జయించడంలో విధిగా కొంతకాలవిలంబన జరిగింది. పణి సేనాని కూడా బరస్థ దుర్గాలలో అక్కడక్కడా ఆగి, ఆర్యసైన్యంతో తలపడుతూనే వున్నాడు. అయితే, ఇకఇప్పుడు, ఆర్యులవద్ద తమ భుజబలం ఏ మాత్రమూ పనిచేయదనీ, బుద్ధిబలాన్నుపయోగించి మాయోపాయంతో ఆర్యులను సర్వనాశనం చేయాలని నిశ్చయించుకున్నాడు.

చివరకు ఆర్యులు పశ్చిమ సముద్రతీరానవున్న ఓ పెద్ద పణినగరాన్ని చేరారు. అనేక శతాబ్దాలక్రితం ఓమాటు ఆర్యులు ఈ నగరంపై ధ్వజమెత్తారు. ఆ తరువాత చాలా కాలంవరకు పణులు ఆర్యులవద్దకు "బలి" పంపుతూ వచ్చారు. ఒకటి రెండు శతాబ్దాలనుంచి బలి పంపడం ఆగిపోయింది. ఈ నగరం ఆర్యులకు దివ్యలోకాల్లోని అద్భుత నగరాలను స్ఫురణకు తెస్తోంది. ఆ నగరంలోని అపారసంపదలను గురించి చెప్తే అతిశయోక్తే అని పిస్తుంది. పణులు (పణనం - వ్యాపారం - చేసేవారు గనుకనే పణులయ్యారు) వ్యాపారంలో బహు నేర్పరులు. వారు స్థల, నది, సముద్రవ్యాపారాలు చేస్తుంటారు. సముద్రయానంలో బవేరూ మొదలైన దేశాల్లోనూ వ్యాపారం చేస్తూ వుండేవారు. వాణిజ్యం వలన ద్వీపాంతరాల్లోని 'లక్ష్మి' కూడా మొదట ఈ నగరంలోనే కేంద్రీకృత మౌతుంది. సముద్ర వ్యాపారుల మహోన్నతమైన భవనాలు. మొత్తం తామ్రయుగంలోకే మహైశ్వర్య జనకాలు! నగరంలోని పణిసేనాని, ముఖాముఖి ఆర్యులతో యుద్ధం చేయడం అసంభవమని తెలుసుకున్నాడు. కాకపోతే, ఆర్యుల్ని నగరం వెలుపలే ఆపి, నగరంలోని ఆస్తి పాస్తులను, ప్రజలనూ సాధ్యమైనంత వరకూ, సముద్రంలోని తమ ఓడల్లోకి, నావల్లోకి చేర్చ ప్రయత్నిస్తున్నాడు. అక్కడికి వేలసంఖ్యలో ఓడలు, నావలూ సదావచ్చి పోతూంటాయి! అయినప్పటికీ నగరంలోని ప్రజలందరూ ఓడల్లో స్థానాన్ని పొందలేకపోయారు. ధనికులైన సార్థవాహులూ వారి కుటుంబాలు, పరివారాలు, అపారంగావున్న వారి సంపదలు మాత్రం

ఓడల్లో స్థానాన్ని పొందాయి. పణులు పీతకేశులనుండి ఎలాటి దయాభిక్షనూ ఆశించరు. వారికి ప్రతిక్షణమూ అమూల్యమైందే! క్షణ మాలసిస్తే నిర్లక్ష్యం చేస్తే అపార సంఖ్యలో పణులు ప్రాణాలు గోల్పోవలసిన ప్రమాదముంది.

ఆ రోజు సాయంత్రం వరకూ యుద్ధం తీవ్రంగా జరిగింది. రెండవ రోజున జరగనున్న ఘోర పణి సంహారానికి ఇది నాంది సూత్రమే అనుకున్నారందరూ. కాని, తెల్లవారి లేచిచూస్తే నగరంలో అసలు పోరాడడానికి ఎవడూ లేడు. నగరమంతా సునాయాసంగా ఆర్యులవశమైంది. రథ్య (రథాలు తిరిగే బజార్లు) లన్నీ శూన్యంగా వున్నాయి. అలాటి సువిశాలమైన రథ్యల్ని, ఉన్నతమైన భవనాలనూ ఆర్యు లంతవరకూ చూడలేదు. లోహయుగానికి సంబంధించిన గొప్ప నగరమది. ప్రధానమైన వీధి 22 బారలకంటేకూడా విశాలంగా వుంది గొందులు సందులుకూడా ఆరు, ఏడుబారల పొడవుకు తక్కువలేవు. ప్రతివీధి చివరనా సర్వజనోపయోగములైన బావులున్నాయి. ప్రతి ఇంటికీ స్వంతబావులున్నాయి. మురుగునీరు పోవడానికి, చిన్నచిన్న కాలువలూ, యామలూ ఉన్నాయి. భవనాల నిర్మాణంలో ఇటుకల్ని బాగా వుపయోగించారు. కొన్ని రెండు మూడంతస్థుల భవనాలుకూడా వున్నాయి. ప్రతి భవనంలోనూ స్నానాల గదులున్నాయి. భవన నిర్మాణంలో ఇటుకలపేర్పు ఓ గొప్ప స్థానాన్ని పొందింది. ఒక ఇటుకకూ మరో ఇటుకకూ మధ్య సూదిమూరే సందులేకుండా, మహా నేర్పుతో పేర్చుకు పోయారక్కడి వాస్తుశిల్పులు! ఇండ్లు చాలా సుఖకరంగానూ, స్వచ్ఛంగానూ వున్నాయి. చిన్నచిన్న ఇండ్లకూడా రెండేసి గదులున్నాయి. ఇంటిముందు ఇటుకలుపరచిన మెల్లా. గోడలకు కిటికీలున్నాయి. వీధుల్లో దీపస్తంభాలున్నాయి. సప్తసింధులోనూ పణుల నగరాలున్నాయి. అయితే వాటి సంపద సదా ప్రమాదంలో వుండేది. సంపన్నులైన పణులుకూడా, తమ విభవాన్ని ప్రదర్శించడానికి జంకుతూండేవారు సప్తసింధులో.

పెద్ద పెద్ద ప్రాసాదాలెన్నో ఖాళీ అయిపోయాయి. అక్కడక్కడా కొద్దిమంది పణులు, నిరాయుధులుగా, అసహాయులుగా మిగిలిపోయారు. అలాటివారిని చంపి ప్రయోజనం వుండదని వదిలివేశారు! మానవ రక్తాన్ని ప్రవహింపచేయడంలో వెనకవున్న ఉత్సాహం తగ్గిపోయిందిప్పుడు.

సంపదలను దోచుకోవడమే ముఖ్యమని భావించసాగారు ఆర్య రాజకుమారులు. ఖాళీ అయిన ప్రాసాదాల్లో విడిది దిగారు. పట్టణంలోని నవరత్నాలనూ, వివిధ సంపదలనూ ఆ ప్రాసాదాల్లోనే ప్రోగుచేస్తున్నారు. భుజ్యు దృష్టంతా పణిసేనానిమీదే వుంది. ఎలాగయినా అతడిని పట్టుకోవాలని భుజ్యు ఊహ. శ్యావపుత్రుడు (భుజ్యు) కొంచెం దూరాలోచన చేసినట్లయితే బాగుండేది. ఆర్యుల ప్రభుత స్థలప్రాంతంలోనే. జలప్రాంతాలకు (సముద్రాలకు) ప్రభువులు పణులు. ఆర్యుల గుర్రాలు జలగమనం చేయలేవుకదా!

నగర రక్షణభారాన్ని తన సైనికులకు వప్పగించి, విశాలమైన నావల్లో భుజ్యు సముద్రయానానికి బయల్దేరాడు. సప్తసింధులోని పెద్దపెద్ద నదుల్లో నావలను నడపడం ఆర్యులకు తెలుసు. అయితే ఇప్పుడు భుజ్యు ప్రయాణం చేసేది నది కాదు, మహాసముద్రం! నదులకు తీరాలంటూ ఉంటాయి. ఉభయతీరాల్లోనూ పరిచితమైన ప్రదేశాలుకూడా ఉంటాయి. సముద్రంలో దిగంతాలవరకూ వ్యాపించిన, జలరాశి మినహా మరేమీ కనుపించదు. పరిచిత ప్రదేశాలుగానీ, తీరం. ఒడ్డూ-గాని ఏమీ వుండవు! ఆర్యుల వశమైన సముద్రతీర మహానగరంలో, సముద్రయానంలో ప్రవేశ మున్నవారూ, అసుర, బవేరు దేశాలవరకూ యాత్ర చేసినవారూ అనేకులున్నారు. కాని, ఆర్యులు వారి నెలా విశ్వసించగలరు? వారికంటే అర్ధ - పణులు (పణి స్త్రీలకు ఆర్యపురుషులకు పుట్టినవారు) నయంకాదా? ఆర్యులు అర్ధపణుల్నీ హీనదృష్టితోనే చూస్తుంటారు కాని, పణుల్ని విశ్వసించడమా? అర్ధపణుల్ని విశ్వసించడమా అన్న ప్రశ్న వచ్చినప్పుడు, అర్ధ పణులనే విశ్వసిస్తారు! ఈ అర్ధపణులు ఆర్యులకు సేవచేయడానికి కొంత తత్పరతను కూడా కనబరుస్తూంటారు. కనుకనే పణులు, ఆర్యులను ఎలా శత్రువులుగా భావిస్తారో, అర్ధపణుల్నీ అలాగే శత్రువుల్లా భావిస్తారు!

భుజ్యువద్ద పెద్ద ఓడలు యాభైవరకూ వున్నాయి. గుర్రాలతో పనేమీలేదు. పిండి మొదలైన ఆహారపదార్థాలు వెండి బంగారాలకంటే విలువైనవి కావడంవలన, కావలసినవరకూ ఓడల్లో భద్రపరచుకున్నారు. సముద్రయానంలో అన్నిటికంటే ముఖ్యమైంది మంచినీరు. గొంతు ఎండి చావవల్సిందేగాని, సముద్రంలో మంచినీరు - దొరకదు!

పణిసేనాని సముద్రయానానికి కావల్సిన సర్వప్రయత్నాలనూ ముందే చేసుకుని సిద్ధంగావున్నాడు. భుజ్యు అప్పుడు అన్నింటినీ చూసుకోవలసి వచ్చింది. నావికుల్ని చూసుకోవడం, ఆహారపదార్థాలనూ, నీటినీ సిద్ధపరచుకోవడం - అన్ని ఏర్పాట్లనూ త్వరత్వరగా చేసుకున్నాడు: ఎంతమంది వద్దనిచెప్పినా వినలేదు. పణిసేనానిమీదనే భుజ్యు దృష్టంతాను. ఆర్యులు ఎక్కువకాలం ఆ నగరంలో వుండడం ఎటూ సంభవంకాదు. వీళ్ళు వెళ్ళగానే తిరిగి పణిసేనానివచ్చి నగరాన్ని వశపరచుకుంటాడు. కనుక ఎలాగయినా పణిసేనానిని బంధించడం కర్తవ్యం.

నావలు బయలుదేరాయి. తెరచావల్ని విప్పారు. ఒక్కో తెరచాప వద్ద ఇద్దరేసి సైనికులున్నారు. గాలి అనుకూలదిశకు వీస్తోంది. నావలు మహావేగంగా వెళ్ళిపోతూన్నాయి. కొద్దిక్షణాల్లోనే తీరం కంటిచూపుకు దూరమైంది. నలుదిశలా క్రిందా, ఎటుచూసినా నీరే: పైన నీలి ఆకాశం-ఎడారిలో భూమీ - ఆకాశం, రెండు భిన్నవర్ణాలుకల పదార్థాలు కనుపించేవి. కానీ, ఈ సముద్రంలో అంతా ఏకవర్ణమే: ఆకాశం నీలం, అర్ణవం నీలం. అంతా అభిన్నంగా, ఏకవర్ణంగా వుంది. కేవలం నావలోపల మాత్రం భిన్నత్వం గోచరిస్తుంది. ఒక పగలూ, ఒక రాత్రి గడిచాయి. రెండవ రోజు మధ్యాహ్నానికి, దూరంగా క్షితిజంలో పణుల నావలు కనుపించాయి. పణిసేనాని దొరికిపోయాడు. ఇక తప్పించుకొనలేడని భుజ్యు సంతోషించాడు. మరికొద్దిసేపటికి భుజ్యు నావలు దూరంగా కనపడిన నావలను సమీపించాయి. వాటిని పట్టేశాయి. అయితే ఆ నావలు పణిసేనానివి కావు. పణి సార్థవాహునివి: సేనాని తప్పించుకుని వెళ్ళిపోయాడు. ఓడలో అమూల్యమైన, బహుమూల్యమైన పదార్థాలున్నాయి. కానీ, భుజ్యుడు ఆ నడిసముద్రంలో వాటి అవసరమేముంది? పణి సార్థవాహుని ఓడలో ఉన్న మొత్తం ఆహారపదార్థాలనూ, మంచినీటినీ ఆయుధాలను తీసుకుని సార్థవాహుణ్ణి అతని అనుచరుల్ని విధికి వదిలివేసి వెళ్ళిపోయారు ఆర్య సైనికులు. అదే సమయాన వాయుదేవుడు ప్రతికూలుడయ్యాడు. సముద్రం క్షుభిత మవసాగింది. అలలు తాట్రివమాణాన లేవసాగాయి. ఒక్కో అల వచ్చినప్పుడు నావ ఆకాశానికి ఎగిరి పాతాళానికి పడుతూన్నది, వరుణదేవుణ్ణి స్తుతించారు. కానీ, వరుణదేవుడి ఆజ్ఞల్ని పాలించడానికి సము

ద్రుడు సిద్ధంగా లేడు. అదే సమయంలో అగ్నికి ఆజ్యం పోసినట్లు, దట్టమైన మేఘాలు పట్టి, తారకల్ని కనుమరుగు చేశాయి. ఓడ ఏ క్షణాన సముద్రగర్భంలో లీనమైపోతుందో తెలియడం లేదు. ఒకవేళ ఓడ సురక్షితంగానే వున్నా, తాము సరైన దిశకే వెళ్తున్నామనే నమ్మకం ఏమిటి? మార్గదర్శకులుకూడా కింకర్తవ్యవిమూఢు లయ్యారు!

ఆర్యులకు సముద్రయానం అనభ్యస్తం కావడంవలన, అందరూ కక్కుకుంటున్నారు. ప్రేగులు నోటిద్వారా క్రిందికి పడిపోతాయాన్నంత విపరీతంగా కక్కుకో సాగారు. సైనికులందరూ ఆహార పానీయములను విసర్జించారు. భుజ్యు మరి ఒకరిద్దరు అనుచరులకు మాత్రం ఈ కక్కుల వ్యాధి సంభవించలేదు. రెండవరోజు రాత్రి చాలా గడ్డుగా గడిచింది. మూడవరోజు ఉదయానికి సముద్రుడు శాంతించాడు. సైనికులు ఆహారాన్ని స్వీకరించారు. అందరూ నోళ్ళువిప్పి, భయాన్ని వీడి, వరుణదేవుణ్ణి స్తుతించారు.

"ఓ సహస్ర నేత్రాలుకల వరుణదేవుడా! నీవు మహా శక్తి సంపన్నుడివి. ఈ భూమినీ, ఆకాశాన్ని యథాస్థితిలో వుంచుతున్న మహానుభావుడివి. నీవు సముద్రపు లోతును కొలవగలవు. అంతటి నీవు మామీద కోపించటం తగదు. మేము నీ భక్తులం, ఏ పాపం ఎరుగం, ఎందుకిలా నిర్హేతుకంగా మమ్మల్ని చంపుతావు?

ఆర్య సైనికులు వరుణస్తుతిలో తామే పాపమూ ఎరుగమని చెప్పుకున్నారు. కానీ, నిజంగానే వారు పాపంచేశారు. ఘోరమైన అపరాధం చేశారు. సముద్రాలకు, నదులకు అధిపతియైన వరుణదేవుణ్ణి విస్మరించారు. అందరికంటే చివరిస్థానాన్నిచ్చారతనికి. ఆర్యులకు ఇంద్రుడే సర్వస్వం! వరుణదేవుణ్ణి స్తుతించీ ప్రయోజనం కనుపించక భోజ్యు అశ్వనీ కుమారులను ప్రార్థించాడు. అశ్వనీ కుమారులపై దివోదాసు క్కూడా గొప్ప శ్రద్ధ వుంది. మూడవరోజు పగలూ, రాత్రికూడా అలాగే గడిచాయి. నాలుగవ రోజు వాతవరణం అనుకూలంగా మారింది. నిరాశ నిస్పృహలు గతించాయి. ఆనాటి ఉదయం, ఉషాస్తుతి అనంతరం భుజ్యు నాలుగువైపులా దృష్టిని ప్రసరించాడు. ఉత్తరదిశన తీరం కనుపించింది.

అశ్వినీ కుమారులు దేవవాహకుడి ద్వారా మొదటే ఇలా చెప్పించారు "సముద్రంనుండి మేము నిన్ను బయటికి తెస్తాము భయపడవద్దు!"

మరి కొద్దిసేపటికి వారి శతారిత్రా (నూరుతెరచాపలుకల నావ) ఒడ్డు చేరింది. మిగిలిన ఓడలుకూడా సాయంకాలానికి ఒడ్డు చేరాయి. చిన్ని పడవ నొకదాన్నెక్కి భుజ్యు కొంతమంది సేనానాయకులతో కలసి ఒడ్డున దిగాడు. పృథ్వీమాతను వీడినప్పటినుంచి భుజ్యు తాను అత్యంత దీనుడయి నట్లు భావించసాగాడు. తిరిగి ఇప్పుడు, పృథ్వీమాతయొక్క వాత్సల్యపూరిత మైన స్పర్శసుఖం అతడిలో అద్భుతము. దైవికమూ అయిన శక్తుల్ని ప్రసారం చేసింది. దగ్గరలో ఒక గ్రామంకూడా కనుపించింది. తిరిగి వెనక్కి ఐదురోజులు ప్రయాణం చేస్తేగానీ తాము విడిచివచ్చిన మహానగరాన్ని చేర లేరనీ, ప్రస్తుతం తాము దిగినదేశం అమిత్ర దేశమనీ తెల్సుకున్నాడు! ఇప్పుడు భుజ్యు సైనికులవద్ద అశ్వాల్లేవు. ఆర్యులకు అశ్వాల్లేకపోవడం సగం బలం నశించినట్టు. ఐనా, భుజ్యుకు, అతడి సైనికులకు తను అసి, కరవాలం, డాలులపైన పూర్తి విశ్వాసముంది!

సముద్రతీర ప్రదేశాన్ని జయించాక, భుజ్యు సైన్యసమేతుడై, ఉత్తరదిశకు మరలాడు. భరతగణం, భరతగణపు మహారాజూ విజయుడై వస్తూన్న భుజ్యుడికీ, అతడి సైన్యానికి గొప్పగా స్వాగతాన్నిచ్చాడు.



# 8. అతిథి గృహం

"దివోదాసాదతిథిగ్వస్యరాథః"

(ఋక్కు. 6-47-22)

దివోదాసు తృస్తుగణపు మహారాజు. విపాశ, పరుష్ణీనదులకు మధ్యగల విశాలమైన ప్రదేశంలో తృస్తుగణం వుంటోంది. కాని, ఇటీవల మొత్తం సప్తసింధు తృస్తుగణం ఆధిపత్యంక్రిందకు వచ్చేసింది. ఋజ్యు సాధించిన విజయపరంపరల అనంతరం తృస్తుగణపు అధికారమూ, ఖ్యాతీ సముద్రాంతాల వరకూ వ్యాపించింది పణులు పూర్తిగా ఆర్యులకు వశం వదులయ్యారు. అయితే, కిరాతకులు ఇంతవరకూ ఆర్యులముందు తల వంచలేదు. కిరాతకులను పూర్తిగా జయించడం అసంభవమేమోనన్న సంశయం ఆర్యుల్లోనూ కలుగుతోంది. ఈ మధ్యకాలంలో, ఆర్యుల్లోనూ పరస్పర విద్వేషాలూ, మనస్పర్థలూ పెరిగిపోయాయి. ఆర్యులు తమ యొక్క రంగు, రూపులవలన ఇతర జాతుల్లో కలవక ప్రత్యేకంగా వుంటు న్నారు. నిషాదులు బొగ్గులాటి నల్లని శరీరాలను కలిగివుంటారు. వారు సహజంగానే ఆర్యులకు భక్తులు. ఆర్యులతో ఎన్నడూ కలహించరు. పణులు పూర్తిగా ఓడిపోయారు. ఇక ఎన్నటికీ సంఘర్షించలేరు. కాకపోతే వీరు ఇప్పటి గూర్ఖాజాతికి అత్యంత పూర్వులు. కిరాతకులు మాత్రం

సంఘర్షణను మానలేదు. కిరాతకులు తమ పర్వతాల్లోవుండి, గట్టిగా పోరాడుతున్నారు. ఆర్యులందరూ కలసి ఐక్యతతో పోరాడితేగాని కిరాతకులను జయించలేమన్న విషయాన్ని భరద్వాజమహాఋషి అర్థంచేసుకున్నాడు. ఆర్యుల్లో పురుగణం శక్తివంతమయినది. ఈ పురుగణపు ఉపశాఖలే తృస్తు - భరతగణాలు! (తృస్తు, భరతశాఖల్ని రెండింటినీ ఒకే శాఖగా భావించవచ్చు.) ఇటీవలికాలంలో తృస్తుగణం మొత్తం ఆర్యగణాల్లోకే శక్తివంతమైనదిగా తయారయింది. తృస్తు (భరత) గణపు ఖ్యాతినీ, బలసమృద్ధులనూ చూసి శతద్రునదికి దక్షిణమునగల యదు, తుర్వశ గణాలు ఈర్ష్యాగ్నిలో జ్వలించసాగాయి. సప్తసింధుప్రాంతంలోనూ దినదిన ప్రవర్ధమానంగా పెరిగిపోతూన్న తృస్తుగణపు ఖ్యాతికి విఘాతాన్ని కల్పింప చూస్తున్నాయి. సప్తసింధులోని సమస్త ఆర్యజనాలూ వర్ధ్యాశ్వుణ్ణీ, అతడి తరువాత దివోదాసునూ తమ మహారాజుగా అంగీకరించాయి. కాని యదు, తుర్వశవంశాలుమాత్రం అంగీకరించ నిరాకరించాయి. భరద్వాజమహాఋషి అవిశ్రాంతంగా శ్రమించి యదు, తుర్వశగణాల హృదయాల్లోని ద్వేషాగ్నిని చల్లార్చాడు.

* * *

దివోదాసు కేవలం తృస్తుభూమినే కాక, మొత్తం సప్తసింధునే స్వర్గసమానంగా మార్చేశాడు. దేశంలోని మార్గాలన్నింటా, రెండేసి యోజనాల కొకటి చొప్పున పాంధశాలల్ని ఏర్పరచాడు. ప్రతి పాంధశాలా ఆవులనూ, గొర్రెలనూ, మేకలనూ పెద్ద సంఖ్యలో కలిగియుంటుంది. పాంధశాలకు సంబంధించి కొంతమంది గోపాలకులుకూడా వుంటారు. గోవులతోటి, గోపాలురతోటి పరిసర అరణ్యాలు, సంచలించిపోయాయి. ఆర్యుడెవడూ పాంధశాలకు వచ్చి ఖాద్యపాద్యాదుల్ని స్వీకరించకుండా వెళ్ళడం జరగదు. పిండి, పాలూ, పెరుగూ పగటిభోజనానికి ముఖ్యం! రాత్రి భోజనానికి మాంసాన్ని అధికంగా వాడి రుచ్యంగావండిన సూపం వుంటుంది! రాత్రి ఆహారానంతరం సోమపానం అతి ముఖ్యం! అనుభవంవలన అతిథుల సంఖ్య తెలిసే వుంటుంది. ఎన్ని ఆవుల మాంసం అవసరమోకూడా తెలిసేవుంటుంది. ప్రతిరోజూ అప్పు

సరమైన ఆవుల్ని చంపి. చర్మాన్ని ఒక ప్రక్కకు ప్రోగుపెట్టి, పెద్దపెద్ద మాంస ఖండాల్ని రాగిపాత్రలలో వుడికించేవారు. ఇలా ముందే మాంసాన్ని సిద్ధపరచుకోవడం వలన, పాంథశాలల వంటవాళ్ళు, రాజఋషి అయిన రంతిదేవుడి వంటవాళ్ళలా "సూపం భూమిష్ఠం మశ్నీధ్వ నామ మాంసం యథా పూరా !" అని చెప్పుకోవల్సిన అవసరం వుండదు.

పాంథశాలల్ని సుందరమైన ప్రదేశాల్లో నిర్మిస్తూ వుంటారు. చుట్టూ పచ్చని చెట్లు ఫలపుష్పాలతో నిండివుంటాయి. ఆవులూ, అశ్వాలూ పరిసర ప్రాంతాల్లో పసిరిక మేస్తూ ప్రకృతి సౌందర్యాన్ని ఇనుమడింప చేస్తూంటాయి. నీటి కొరత ఏమాత్రమూ ఉండేదికాదు. ప్రతి పాంథ శాలకూ, బావో, జలాశయమో వుంటుంది. సాధారణంగా పాంథశాలల్లో పరిచారకులుగా నిషాదులే వుంటుంటారు. ఈ పరిచారకులకు సుందర మైన గృహాలు నిర్మించి ఇచ్చేవారు.

ఈ పాంథశాలలు సదా బాటసారుల్తో నిండి వుండేవి. వీటి ప్రధాన కర్మచారి విధిగా ఆర్యుడై వుంటాడు. అవునుమరి. ఆర్యుడికి కానీ, ఆర్యుల ఆచార వ్యవహారాలూ, రీతులూ, పద్ధతులూ తెలిసి వుండవు. ఆర్యులకు, ఆర్యుడే ఘనంగా స్వాగతాన్ని ఈయగలడు. ఆర్యగణాలూ, ఉపశాఖలూ, కులాలూ అత్యధికంగా గోవుల్ని కలిగివుండి భరద్వాజ గోత్రమూ, వశిష్ఠ గోత్రమనే పేర్లతో ప్రసిద్ధికెక్కాయి. ప్రతి పాంథశాలకూ వేల సంఖ్యలో గోవు లుంటాయి. కనుక పాంథశాల (ఆవసథ్) గోత్రం వుండడమూ సహజమే : కానీ, ఈ పాంథశాల గోత్రాన్ని (ఆవసథ్ గోత్రం) దివోదాసు వ్యతిరేకించినప్పటికీ, భరద్వాజ మహర్షి అంగీకరించి, వీటికీ మాన్యతను కల్పించాడు.

దివోదాసు సాధించిన ప్రతి విజయంలోనూ అపారంగా సంపదలు చేజిక్కాయి. వాటిలో ఉచితమైన భాగాలను యదు, తుర్వశ గణాలకుకూడా పంచారు. దివోదాసును వ్యతిరేకించడంవలన అయాచితంగా లభించే గొప్ప నిధులను వదులుకోవడమే అవుతుందని పై వంశాల పెద్దలూ భావించారు. పైగా పరస్పర విద్వేషం గోత్ర వధకు కారణమౌతుందేగాని, మహా ప్రయోజనం వుండదనీ తెల్సుకున్నారు. భరద్వాజ మహర్షికూడా ఆర్య జనాలన్నింటిలోనూ తిరిగి ఐక్యతకు గొప్పగా కృషి చేశాడు.

అనేక సంవత్సరాల అవిరళకృషి జరిగాక, సప్తసింధులోని ఆర్యులందరూ ఒకటయ్యారు. సప్తసింధులోని ఆర్యగణాలకు సుఖశాంతులు వొనగూడాయి.

ఉభయ సంధ్యల్లోనూ ప్రతిఇంటా అగ్నిహోత్రం ప్రజ్వరిల్లేది. సంధ్యావందనపు సుస్వరాలు పరిసరాల్లో మారుమ్రోగేవి. హోమ గుండంలో నుండి దిగంతాలకు సువాసిత ధూమం వ్యాపించేది. ప్రతి ఇంటినుండి వెడలే హోమధూమంవల్ల ప్రకృతి దృశ్యాలుకూడా మసకబారుతూండేవి. ప్రతి కుటుంబమూ ధనధాన్యసంపన్నమయింది. ఏ ఇంటినుండి కూడా అతిథి అభ్యాగతులు నిరాశచెంది వెనక్కి పోవడం జరిగేదికాదు. నిజంగా ఆ రోజుల్లో సప్తసింధు ధనధాన్యాదులతో తులతూగుతూ, పాడిపంటల్తో పొంగిపొర్లుతూ వుండేది. అవి ఎక్కువభాగం ఆర్యులవరకే పరిమితమై వుండేవి. అయినప్పటికీ, ఆర్యులుకాని అన్యజాతీయులకు కూడా గృహస్థులు సుహృద్భావంతో ఆతిథ్యాన్నిచ్చేవారు అన్యజాతీయులైన కారణంగా ఏ పాంథశాలలోనూ, ఎవరికీ ఆశ్రయాన్నీ ఖాద్యాదుల్నీ ఇవ్వకుండా వుండడం జరిగేది కాదు.

ఒకనాటి సాయంసమయాన ఆర్యస్త్రీపురుషు లిద్దరు, మార్గమధ్యంలో ఒక మామిడిచెట్టుక్రింద విశ్రాంతి తీసుకోవడానికి స్థలాన్ని బాగుచేసుకుంటున్నారు. స్త్రీపురుషు లిద్దరూ తరుణవయస్కులైన దంపతులు. పురుషుడి పేరు ఉగ్ర, స్త్రీపేరు రోహిణి! స్థలాన్ని పరిశుభ్రపరచుకుంటుండగానే, గంతవ్య దిశనుండి మరో యాత్రికుడొచ్చి కలిశాడు వీరిని! నూతను డిలా అన్నాడు "ఇక్కడ విశ్రాంతి తీసుకోవడం ఎందుకు? పాంథశాల చాలా దగ్గరలో వుందిగా ఆర్యా!"

"మేము చాలా అలసిపోయాము. మాకీపూటకు ఆహారంకూడ అవసరం లేదన్నాడు" ఉగ్ర.

ఆహారం అవసరంలేకపోవచ్చు. కాని వేసవికాలందాహం అనివార్యం కదా? పాంథశాలలో మధుమిశ్రిత సోమరసం దొరుకుతుంది. ఒక్క చషకం పుచ్చుకున్నారంటే అలసట తీరుతుంది. ఇక మజ్జిగ ఏ సమయంలోనైనా దొరుకుతుంది. తమ ఇష్టం, ఎన్ని చషకాలైనా స్వీకరించవచ్చు!"

ఒంటరిగా మార్గ మధ్యంలో, రాత్రి గడపటం ఆర్యదంపతులకు

ఏమాత్రమూ భయపడవలసిన విషయంగాలేదు. భార్యా, భర్త లిద్దరూ మంచి యవ్వనంలో వున్నారు. యుద్ధవిద్యలో నేర్పరులుకూడాను. పైగా ఆర్య శత్రువులైన కిరాతకుల భూమికి చాలా దూరంలో వున్నారు. అయినా, మూడవ యాత్రికుని మాటను కాదనలేకపోయారు. దగ్గరలో వున్న పాంథశాలకు వెళ్ళారు. పాంథశాలకు వెళ్ళగానే ఇద్దరూ తమ చర్మ కంచుకాలను విప్పి గోడకు తగిలించారు. శరీరం గౌరవర్ణం, ఎరుపూ కల్సిన రంగులో తళతళ మెరుస్తోంది. పొడవైన బంగారు తలవెంట్రుకలు వారి తారుణ్యానికి మెరుగుల్ని దిద్దుతున్నాయి. పాంథశాల ప్రధాన కర్మచారి ఆర్య దంపతులకు సుస్వాగతాన్నిచ్చాడు. సేదతీరడానికి దుగ్ధ - మధు సమ్మి శ్రిత సోమరసాన్ని ఓ పెద్ద చషకంనిండా నింపి ఇచ్చాడు. ఆ క్షణాన ఆర్య దంపతులకు అంతకంటె ప్రియమైన పానీయం మరోటి వుండ దేమో ! చషకాన్ని పైకి ఎత్తి ఒక్క క్షణంలో, గట గట త్రాగేశాడు ఋగ్ర. పూర్తిగా త్రాగేశాకగాని 'ఇంద్రాయ అయం' అనుకోవడం జ్ఞప్తికి రాలేదు అతడికి.

కర్మచారి అడిగాడు "ఆర్యా చాలాదూరంనుండి వచ్చినట్టున్నారు?"

"లేదు ఆర్యా. ఏమంత ఎక్కువ దూరాన్నుండి రాలేదు. ఇక్కడికి నాలుగైదు రోజుల ప్రయాణ దూరముంటుంది. సృజయుల (సంజయుల) దేశంనుండి వచ్చాము!" అన్నాడు ఋగ్ర.

"అయినా, గ్రీష్మం కదా!"

"గ్రీష్మంలో ప్రయాణం కష్టమన్నమాట యథార్థమే: చలి కాలంలోనూ, వర్షాకాలంలోనూ ప్రయాణం ఇంతకంటే సుఖకరంగా ఏమీ వుండదు. భరద్వాజ మహర్షి మహత్తువలన ప్రతి యోజనానికీ ఒక పాంథ శాల ఏర్పడ్డది. కనుకనే ప్రయాణానికి గ్రీష్మాన్నే ఎన్నుకున్నాము !"

"ఏదో అవుసరమైన పని కలిగివుంటుంది ?"

"వేరే అవుసరమైన పని ఏముంటుంది ? మహారాజు దివోదాసు, మహర్షి భరద్వాజు లూ, ప్రతి ఆర్యుడికీ నిత్యకర్తవ్యంగా నిర్ణయించిన, అందరికీ తెలిసిన పనే !"

పాంథశాలలోని అర్ధ ఆర్యుడొకడు (నిషాదస్త్రీకి, ఆర్యపురుషుడికీ

కలిగినవాడు) అందుకున్నాడు: "గుర్రాలపై రావచ్చునుగా? ఇంత శ్రమ పడ్డారేం?"

"మా శరీరపాటవాన్ని ఈ విధంగా పరీక్షించ దలచాము. అన్ని పరీక్షలకు ధైర్యంగా నిలబడగల యువతీయువకులే మహారాజుకు ప్రియ పాత్రులవుతారని మాకు తెలుసు!"

"అవును. దివోదాసు మహారాజు పరిశ్రమించే స్వభావం కలవారు. కష్టపడి భవిష్యత్తును సాధించగల యువతీయువకులే వారికి నచ్చుతారు. పన్నెండేండ్ల వయస్సులోనే అశ్వోత్సవంలో అద్భుతమైన విజయాన్ని చేకొని తమకు గుర్రపు స్వారీలో కల నేర్పును నిరూపించారు!"

"మహారాజులు ఒకసారి ఇలా అన్నారు: "మనకు ముఖ్యమైన శత్రువులు కిరాతకులు. వాళ్ళు చాలా భయంకరులు. వాళ్ళ భూమి మన భూమిలా సమతలమైంది కాదు. ఆ కొండల్లో, మిట్టల్లో, రాళ్ళల్లో మన గుర్రాలు నిరుపయోగమే అవుతాయి. కనుక ఆర్య యువతీయువకులు కూడా కిరాతకుల్లాగానే పర్వతాల్లో వేగంగా పరుగెత్తడానికి రాళ్ళనూ, గుట్టలనూ ఎక్కడానికి దిగడానికి. అవసరమైతే యుద్ధానికి అభ్యస్తులు కావాలి!'

"దివోదాసు, మీ ఇద్దరినీ చూసి చాలా ఆనందిస్తారు!" అన్నాడు ప్రధాన కర్మచారి.

వీరి సంభాషణలను విని, మహారాజూ, మహర్షి ఆర్య యువతీ యువకులను ఎంతటి కష్టసహిష్ణులుగా, పారిశ్రామికులుగా తయారు చేశారో తెల్సుకొనవచ్చును!

* * *

సరస్వతీ తీరాన్నుండి శతద్రుతటం వరకూ వ్యాపించివున్న సమస్త ఆర్యగణాల్లోనూ రెండు విషయాలు ప్రధానంగా మన దృష్టి నాకర్షిస్తాయి. ఒకటి ధనధాన్య సంపన్నత. రెండవది సమస్త ఆర్యగణాలూ, మహర్షి మహారాజులవారి సంకల్పాలనే తమ సంకల్పాలుగా భావించి, ఐక్యతతో పరిశ్రమించడం! ఈ రెండు విషయాల్లోనూ ఆర్యగణాలన్నీ సమానతను సాధించాయి.

బలిష్ఠులూ, ఆరోగ్యవంతులూ, సౌందర్యవంతులూ అయిన తలి దండ్రులకు తదనుగుణమైన సంతానమే కలుగుతుందన్న విషయం అందరికీ తెలిసినదే. ఈ మహాసత్యాన్ని ఆధారం చేసుకుని మొదటగా ఆర్యులు తమ గణాల్లోని గుర్రపుజాతుల్ని పునః వ్యవస్థీకరించుకున్నారు. శ్రేష్ఠమైన కాంభోజ (ఆఫ్ఘనిస్తాన్ – అశ్వస్థాన్‌కు అపభ్రంశం) గుర్రాల్ను తెచ్చి, అలాటి గుర్రాలనే తమతమ గణాల్లోనూ ఉత్పన్నం చేసుకున్నారు. గుర్రాలకు కాంభోజం ఎలా ప్రసిద్ధమో, అలాగే సరస్వతీ తీరం గోవులకూ, వృషభాలకూ ప్రసిద్ధి చెందింది. సరస్వతీ తీరపు గోవులు కడవలకు కడవలు పాలిస్తాయి. అలాటి ప్రాచీకల గణాల్లో తుగ్ర దంపతుల్లాంటి బలిష్ఠులైన యువతీ యువకులు పుంతకం ఆశ్చర్య కరమైన విషయం కాదు. ఇలాటి యువతీ యువకుల్ని దివోదాసు గొప్పగా సన్మానిస్తూంటాడు. దివోదాసు ప్రతి సంవత్సరమూ కిరాతకులతో యుద్ధం చేయవలసిన వాడయ్యాడు. ఈమధ్య కిరాతకులు కూడా సంఘర్షణలకు అభ్యస్తులయ్యారు వారి తాత్కాలిక నివాసాలు, (చలా సుమానపురాలు) శరదృతువు అంతమయ్యేవరకు పర్వతపాదభూముల్లో వుండడంలేదు. ఒక్కొక్కమాటయితే పర్వతపాదభూముల్లోకి రాకుండా కొద్ది ఎత్తులో, పర్వతాల క్రింది వరుసల్లో చలికాలాలను గడిపేస్తున్నారు. విస్తారంగా మంచుకురిసి, పశువుల మేతకూడా దుర్లభమౌతుందన్న భయంవలనగానీ, లేకపోతే కిరాతకులసలు పర్వతాల పై వరుసల్ని దిగి క్రిందికి రారు.

తుగ్రదంపతులు త్వరలోనే దివోదాసు శిబిరాన్ని చేరుకున్నారు. అదొక పర్ణకుటీరం. చుట్టూ ఇంకా అనేకమైన పర్ణకుటీరా లున్నాయి. అశ్వాలకు, గోవులకు, మనుష్యులకు – ప్రత్యేకంగా కుటీరా లున్నాయి. మొత్తం కుటీరాలసంఖ్య పదివేలవరకూ వుంటుంది. వాటిలో అతిథిగృహం ప్రత్యేకమైన సౌకర్యాలుకలిగి ఆకర్షణీయంగా వుంది. తుగ్ర దంపతులు ఈ అతిథి గృహంలోనే దిగారు. వీరి రాక తెలియగానే, దివోదాసు స్వయంగా అతిథిగృహానికి వచ్చి ఆగంతకులైన దంపతుల్ని కలుసుకున్నాడు. వారి శిరస్సుల్ని ఆఘ్రాణించి, హర్షపులకితుడై "వత్సలారా! మీ వదనాలను చూస్తేనే మీ రీ ఎండల్లో ఎంతో మార్గాయాసాన్ని సహించి వచ్చారని తెలుస్తోంది!" అన్నాడు దివోదాసు.

"లేదు మహారాజా! మాకు ఇక్కడ మహర్షి, మహారాజుల దర్శన భాగ్యం లభించింది. ఈ మహద్భాగ్యంముందు మా మార్గాయాసం అతి తుచ్ఛమైనది!"

మాటల సందర్భంలో ఉగ్రదంపతులు సృంజయుల ఉత్తర సరిహద్దు నుండి వచ్చారని కూడా తెల్సుకున్నాడు దివోదాసు.

"మా సంజయదేశం పణులభూమికి సరిహద్దులో వుంది. వెనక మా పూర్వులు ప్రతి సంవత్సరం పణుల్తో పోరాడుతుండేవారట. అప్పట్లో మా ప్రాణాలకు పణులు మహాభయంకరులుగా తయారయ్యారు. కాని ఇప్పుడు వాళ్ళ పీడ శాశ్వతంగా విరగడయింది!" అన్నాడు.

"మనువు మొదలైన మన పితరుల ప్రయాసవల్ల పణులు పూర్తిగా తలవంచారు. ఇక వారినుండి ఎలాటి భయమూ లేదు. కాని, ఈనాడు కిరాతకులు ఆర్యులకు అతి భయంకరమైన శత్రువులు. కిరాతకులను అణచివేసేవరకూ ఆర్యుల జీవితాలకు ప్రశాంతత అంటూ లభించదు!"

"ఆర్యా, కిరాతకుల నణచడానికి తమరు చేసే ప్రయత్నం సప్తసింధు అంతట్లోనూ సువిదితం. మీ ఈ మహాప్రయత్నంలో పాలు పంచుకోడానికే నేనూ వచ్చాను. నేను రావడాన్ని చూసి, నా భార్య రోహిణికూడా వచ్చేసింది!"

"వత్సలారా! ఆర్య యువతీ యువకుల్లోని ఈ ఉత్సాహమే, పట్టుదలే, నన్ను ఇంద్రుడి ఆజ్ఞను విశ్వసించేట్టు చేస్తున్నది. కిరాతకులు అజేయులు కారని ఇంద్రుడెన్నోమార్లు చెప్పాడు!"

"ఇంద్రుడికి శత్రువైనవాడెవడూ అజేయుడు కాలేడు!"

"వత్సా! హిమాచ్ఛాదిత బృహత్పర్వతం కిరాతకుల అధీనంలో వుంది. అక్కడ మహాస్వాదిష్టములైన సోమలతలు పుట్టిపెరుగుతాయి. ఆ పర్వతాలను జయించడానికే ఇంద్రుడు మీలాటి సంతానాన్ని ఆర్యజనాలకు ప్రసాదించాడు!"

"మహర్షి వాక్కు, ఇంద్రుడి సంకల్పం తప్పకుండా సఫలమౌతాయి. ఈ మహా యజ్ఞంలో మేమూ నిమిత్తులమౌదామని వచ్చాము."

"వత్సా! నీకివే మా సుస్వాగతాలు. నీలాగనే వచ్చి, అన్యసేనా

వాహినిలో చేరిపోయిన గాంధార, కాంభోజ దేశాల ఆర్యయువకులుకూడా వున్నారిక్కడ."

* * * *

తృస్తు భూమిలోని ప్రతిఒక్కడూ ఆర్యభటుడయ్యాడు. మొత్తం సప్తసింధులనే నూతనమైన జాగృతి వెల్లివారుతోంది. ఆర్య గణాల్లో పరస్పర మనస్పర్థలు నశించాయి. పరుష్ణీ, విపాశ, శతద్రు నదుల తీరాల్లో చాలా దూరాలవరకూ నర, గో, అశ్వబృందాలకు నివాసస్థానా లేర్పడ్డాయి. వర్షాకాలంలో సైనిక శాలలు నదీతీరానికి కొంచెందూరంలో వుంటాయి. గ్రీష్మ ఋతుల్లో నీరు తగ్గి ప్రవాహవేగం తీస్తుంది. కనుక నదీ తీరాన బహు సమీపం వరకూ పర్ణకుటీరాలు వెలుస్తాయి. సప్తసింధు మొత్తంలో సైనిక స్థావరా లేర్పడ్డాయి. నిత్యం ఆ స్థావరాల్లో సైనిక వ్యాయామాలు జరుగుతూ వున్నాయి. తృస్తు భూమి ఆర్యయువకులు పరస్పరం కలుసుకునే కేంద్ర స్థానంగా మారిపోయింది. దివోదాసు స్వయంగా యువకులకు గదాయుద్ధంలోనూ ధనుర్విద్యలోనూ అభ్యాసాన్నిస్తూండేవాడు. సన్నని అల్పకాయుడైన భరద్వాజ ఋషి గంభీరమైన 'వాణి'లో ఆర్యయువకులకు ఆదర్శాలను ప్రభోదిస్తూండేవాడు. వారి 'వాణి' మృతులకు జీవం పోసేటంత ప్రభావోత్పాదకంగా వుండేది. భరద్వాజ ఋషి తన ప్రభోదాల్లో ఇంద్రుడి సంకల్పాన్ని నెరవేర్చమని ఇంద్రశత్రువుల్ని నాశనం చేయమనీ చెప్తూండేవాడు.

ఋషి ఇలా అనేవాడు:"ఒక పర్ణశాలను, ఎంత బలమైన చెయ్యైనాగానీ ఒక్కటీ పైకెత్తలేదు. అదే నూరుచేతులు కలిస్తే ఎంతపెద్ద పర్ణశాలనయినా గడ్డిపోచలా సునాయాసంగా పైకి ఎత్తేస్తాయి. కనుక ఆర్యులందరూ ఏకకుటుంబీకులుగా వుండాలి అప్పుడు ఇంద్రుడుకూడా మనకు సాయం చేస్తాడు సప్తసింధులో ఏ ఆర్యుడూగాని నిర్ధనుడుగా ఎందుకు వుండాలి? ధనికులైన ఆర్యులు వందమంది కలిసి, పదిమంది నిర్ధనులైన ఆర్యులను తమతో సమానులుగా చేసుకోలేరా? ఒక్కొక్క ఆర్యుడూ పది పది పశువుల్ని నిర్ధనులకిస్తే, వాళ్ళు ధనికులౌతారు. ఇంద్రుడు మన ఖాద్య పాద్యాదుల్లో ఆర్యులందరికీ సమానమైనహక్కు వుందని చెప్పాడు.

ఇంద్రుడి మాటల్ని తిరస్కరించడం, కేవలం తమ స్వార్థాన్నే దృష్టిలో వుంచుకోవడం మహాపాపం. 'కేవలాదీ, కేవలాఘ్యా' అన్న ఆర్యోక్తిని మరువవద్దు !"

భరద్వాజ ఋషియొక్క ప్రబోధాలు, ఉపదేశాలూ ఆర్యుల్ని కార్యోన్ముఖుల్ని చేశాయి. కొంతవరకూ స్వార్థాన్ని తగ్గించుకున్నారు. కొత్తగా అభ్యస్తులైన సైనికులు ప్రతి సంవత్సరమూ ఉత్తరదిశన వున్న బృహత్పర్వతాలవద్దకు వెళ్ళి ప్రత్యక్షంగా యుద్ధంలో పాల్గొనసాగారు. వీర సైనికులకు సంబంధించిన వీరగాథలెన్నో ప్రచారంలోకి రాసాగాయి.

బాణం, తూణీరం, ధనుష, ప్రత్యంచా, కవచం, పరశు. శూలం, కత్తి, గదా అష్టా (రంపం) మరియు ఆయుధాలకు పదునుపెట్టే క్షౌత్రం - సాన - మొదలైనవన్నీ రాగితో తయారయ్యేవి. వేల సంఖ్యలో కర్మచారులు వీటిని తయారు చేస్తుండేవారు. పై ఆయుధాల ప్రయోగాన్ని అభ్యసించేవారూ అసంఖ్యాకంగా వుండేవారు.

రాగి ఆయుధాలు ఎక్కువగా ఉపయోగింపబడుతున్నాయి. రాగిని కరిగించడం దానినుండి తీక్షమైన ఆయుధాల్ని తయారు చేయడం సులభమైంది ఆర్యులకు. రాతి ఆయుధాలుకూడా కొంతవరకూ ప్రచారంలో వున్నాయనే చెప్పవచ్చు. రాతి ఆయుధాల్లో గద (వజ్రం) బహుళ ప్రచారంలో వుంది. బలశాలులైన యోధులు తమ రాతి గదాఘాతంతో శత్రువు శిరస్సును ముక్కలు ముక్కలు చేసేవారు. ప్రాణాల్ని హరించడంలో వజ్రం (రాతిగద) అసి (కత్తి)కి ఏమాత్రమూ తీసిపోదు.

సప్తసింధు సర్వసంపదలతోటీ తులతూగుతోంది. అక్కడి యువకులు యుద్ధంలో దృఢ సంకల్పులు. ప్రతి శరత్తూ ఆర్యయువకుల యుద్ధ నైపుణికి గీటురాయి. ప్రతి సంవత్సరమూ కిరాతకులు ఆర్యుల సంఘర్షణలను ఎదుర్కొనవలసినవారయ్యారు. కిరాతకుల్లో పశుపాలన అంతగా ప్రచారంలోకి రాలేదు. ఆర్యుల్ని చూసి ఇప్పుడిప్పుడే కిరాతకులుకూడా పశువుల్ని పెంచసాగారు. అయితే కిరాతకులు పెంపుడు పశువుల పాడి, మాంసంకంటె, వేటాడిన పశువులమాంసాన్నే ఎక్కువ ఇష్టంగా భుజి

స్తుంటారు. అరణ్యాల్లో లభించే పండ్లను కూడా తింటారు. పండ్లను ఎండ బెట్టుకుని వరుగు చేసుకోవడం కూడా తెల్సును వారికి! ఆహార పదార్థాల సముపార్జనలోనూ, యుద్ధరంగలోనూ సమానంగా సహకరిస్తుంటారు స్త్రీలు పురుషులు! కిరాతస్త్రీలు యుద్ధంలో పాల్గొనడం స్వాభావికమైన విషయం!



# 9. అబలా సేన

"స్త్రియో హి దాస ఆయుధాని చక్రే। కి మా కరన్నబలా అస్య సేనా"

(ఋక్కు 5-30-9)

ఆర్యుల ముఖ్యబలం అశ్వాలనే చెప్పవచ్చు. వారి ఘనమైన విజయాల్లోని సగపాలు అశ్వాలకే చెందుతుంది. ఆర్యులు అశ్వారూఢులై నాలుగు గంటల్లో అరవై యోజనాల (నూట ఇరవై మైళ్ళ) దూరం ప్రయాణం చేసేవారు. మొదట కిరాతకులకు గుర్రాల పరిచయమే లేదు. ఇప్పుడు గుర్రాలను గురించి, వాటి ప్రయోజనాలను గురించి తెల్సుకున్నా, తమ కొండల్లో ప్రయాణం చేయడానికి వీలైన పొట్టి గుర్రాలను సంపాయించుకోలేకపోయారు. కొండల్లో మానవ నిర్మితమైన మార్గాలేవీ వుండవు. అన్నీ రాళ్ళూ రప్పలూ, గుట్టలూ మెట్టలు. గుర్రాన్నెక్కితే ఎక్కడ పడతామోవని భయపడవలసిందే. ప్రశాంతంగా ప్రయాణం చేయడానికి వీలుండదు. కిరాతకులు (దాసులు, దస్యులు, నిశాచరులుకూడా వీరే !) గుర్రాలు లేని తమ లోపాన్ని నిశాచరులై తప్పుకొనేవారు. నిశా సమయంలో నలభై యాభై మైళ్ళు కాలినడకన ప్రయాణం చేయడం వారికి అతి సహజమైన విషయం. నలభై యాభై మైళ్ళ దూరాన గల ఆర్య గ్రామాన్ని

రాత్రంతా ప్రయాణం చేసి తెల్లవారుఝాముకు చేరుకునేవారు. కాలినడక లోనూ, రాత్రిపూట ప్రయాణం చేయడంలోనూ ఆర్యులు వీరిముందు నిలువలేరు. కనుకనే ఆర్యులు నిశాచరులు కావడం ఘృణాస్పదమైన విషయమనేశారు. కిరాతకుల సైన్యాన్ని 'అబలాసేన' అని ఆర్యులు నిందిస్తూంటారు. ఆర్యులిలా అనేవారు "దాసులు స్త్రీలచేత ఆయుధధారణ చేయిస్తారు. వారిసేన 'అబలా (బలంలేని) సేన' ఇక నది మమ్మ ల్నేంచేయగలదు ?"

కానీ, ఆర్యులు 'అబలాసేన' అని నిందిస్తూన్న దాసుల సైన్యం నిజంగా 'అబలాసేన' (బలహీనమైన సేన)కాదు. దాసుల సైన్యములోని అబలలు అనేక యుద్ధాల్లో తాము సబలలమని నిరూపించుకున్నారు. ముఖ్యంగా శంబరుడి కూతురు శంభు విషయం చెప్పుకోవాలి : శంభుకూడా తన తండ్రి అయిన శంబరుడి లాగానే అనేక యుద్ధాల్లో ఆర్యుల్ని హడల గొట్టింది. ఒకసారి, రాత్రంతా నడిచి శంభుసైన్యం అల్లవారుఝామున ఒక ఆర్యగ్రామాన్ని చేరింది. అప్పటి కింకా సూర్యోదయం కాలేదు. దట్టమైన చీకట్లో ఆర్యగ్రామం మునిగివుంది. ఆర్యులందరూ నిద్రావస్థలో వుండగానే ముట్టడి జరపాలని శంభు యోచన. కాని, గ్రామాన్ని సమీపించేసరికి కుక్కలు అరిచి ఆర్యుల్ని మేల్కొలిపాయి. ఆర్యులకంటె ముందు కుక్కలే యుద్ధానికి తారసిల్లాయి. అయితే, ఒకటి రెండు రాతిగదల దెబ్బలు తగిలేసరికి కుక్కలు తోకముడిచాయి. అప్పటికి ఆర్యపురుషులు ఆయుధాలు ధరించి వచ్చిపడ్డారు. ఆర్యులకు కిరాతకులకు ఒకరి భాష ఒకరికి తెలియదు. అయినా, క్రోధం, హర్షం మొదలైన భావాలను అర్థం చేసు కోవడానికి బాష తెలియవలసిన పనేముంది ? శంభు పెద్దగా అరుస్తూ శత్రువుల మీదకు ఆడపులిలా దూకుతున్నది. ఆమె స్వరాన్ని విని, దాసస్త్రీ మాట్లాడుతోందని ఆర్యులు అర్థం చేసుకున్నారు. ఆమె స్వరమూ, మాటయూ చాలా గంభీరంగా వున్నాయి. అంతకంటే బలంగా, ఘాటుగా వున్నాయి గదాఘాతాలు. శంభు చేతిలో ఓ పెద్ద రాతిగద వుంది. ఆ గదను చూసే ఆమె శరీరబలాన్ని ఊహించవచ్చు. శంభు తన గదాఘాతాల్తో ఒక్కొక్కరిగా అందరినీ నేల కూల్చేసింది. ఆ యుద్ధంతో ఆర్యులకు 'అబలా సేన' లోని అబలత్వం యెంతో పూర్తిగా అర్థమైంది.

సైన్యంలోని అబలల తలవెంట్రుకలు నల్లగా వీపులమీద వాల్తున్నాయి. నడుముక్రింద స్వల్పమాత్రంగా చర్మవసనా లున్నాయి. మిగిలిన శరీర మంతా నగ్నంగానేవుంది. వాళ్ళ శరీరాలు పసుపుపచ్చని-రంగులో పోతపోసి నట్టుగా వున్నాయి. అతి సుందరమైన అవయవనిర్మాణం!

సూర్యోదయంతో యుద్ధం సమాప్తమయింది. 'అబలాసేన', 'సబలాసేన' అని ఋజువయింది. ఆర్యగ్రామంలోని అనేకమంది స్త్రీ పురుషులు నిహతులయ్యారు. ఎక్కడయినా ఒకరూ ఇద్దరూ ప్రాణాలతో వున్నా, క్షతగాత్రులుగా మాత్రమె వున్నారు. కిరాతస్త్రీలు ఆర్యుల ఇండ్ల నన్నింటినీ గాలించారు. యుద్ధం చేయగలస్థితిలో ఒక్కరూ కనుపించ లేదు. ఒక యింటిలో శంభుకు నాలుగయిదు సంవత్సరాల బాలు డొకడు కనిపించాడు. అతడు ప్రాణభీతో కుంచించుకు కూర్చునివున్నాడు. శంభు గదను తీసుకుని తన దిశకు రావడాన్ని చూచి, బాలుడు అతి కరుణాభరితమైన దృక్కుల్ని బరపుతూ "అంబ, పాహి!" అన్నాడు.

శంభు ఆర్యభాష కొద్దిగా తెలిసిన పణిస్త్రీ నొకామెను "ఏమిటి అంటాడు?" అనడిగింది.

"అమ్మా. నను రక్షించు! అంటున్నాడు!" అని చెప్పింది పణిస్త్రీ.

ఆర్యులమీద అపారమైన ద్వేషం వున్నప్పటికీ, ఆ సమయంలో శంభు హృదయంలో చిత్రమైన భావన - మాతృభావన - ఉదయించింది. ఆమె తన చేతిలోని గదను ప్రక్కన పెట్టి, కుర్రవాడి రెండు చేతులనూ పుచ్చుకుని పైకి మెత్తి ముఖాన్ని ముద్దుపెట్టుకున్నది, వీపు నిమిరంది. తరు వాత కుర్రవాడిని అక్కడ విడిచి వెళ్ళబోయింది కానీ, కుర్రవాడు తిరిగీ దయనీయ స్వరంలో "అంబ పాహి!" అన్నాడు. శంభు స్థితిని అర్థం చేసుకుంది. ఇప్పుడు తను కుర్రవాడిని విడిచి వెళ్ళినట్లయితే, మరో నిశాచరి ఎవలె అయినా అక్కడికి రావచ్చును. ఆ నిశాచరి తల్లిలా ఆ కుర్రవాడిని తనతో తీసుకుని వెళ్ళిపోయింది.

ఆ కుర్రవాడు శంభువెంట బృహత్పర్వతాల్లోకి వెళ్ళిపోయాడు. తరువాత ఆర్యు లీ కుర్రవాడికి 'దేవక్ మాన్యమానుడ' ని పేరు పెట్టారు. ఈ మాన్యమానుడు ఆర్యులకు ఆగర్భశత్రువు. కిరాతకులకు గొప్ప

సహకారిగా ప్రసిద్ధి నొందాడు. ఇతడి పేరు వింటే చాలుఆర్యులు హడలి పోయేవారు. ఇతడు మంచి దృఢకాయుడు. యుద్ధవిద్యలో నైపుణ్యం కలవాడు. కిరాతకుల శరీరవర్ణం పసుపుపచ్చగానూ, తల వెంట్రుకలు నల్లగానూ వుంటాయి. గడ్డాలూ, మీసాలూ వుండవు. దేవ మాన్య డలాకాదు. దీర్ఘకాయుడు. బంగారురంగు తలవెంట్రుకలు. అలాటివే గడ్డం మీసాలూ. నీలికండ్లు కలవాడు. ఆర్యుల రూపురేఖా విలాసాలను పుణికి పుచ్చుకున్నాడు. ఇవి శతాబ్దాలుగా కిరాతకుల్లో క్రోధానలాన్ని ప్రజ్వలింపచేసున్నాయి. ఇలాటి రూపురేఖలను చూచినప్పుడు, దస్యులు సహజంగానే రక్తపిపాసులౌతారు. అకలిగొన్న బెబ్బులిలా మిదకు లంఘిస్తారు. అలాటి కిరాతకుల్లో దేవకుడు తన శరీరపు రంగుమీదా, పసుపు పచ్చని తలవెంట్రుకలమీదా, నీలికండ్లమీదా గొప్ప ఆత్మీయతను స్థాపించాడు. చిన్నతనంలోనే కిరాతకుల్లో కలిసిపోవడంవలన దేవకుడికి కిరాతక భాషే మాతృభాష అయింది. కొద్ది సంవత్సరాల్లోనే ఆర్యభాషను పూర్తిగా మర్చిపోయాడు. తాను దాసజాతికి చెందినవాడిగానే భావించేవాడు. శరీరపు రంగులోని వ్యత్యాసం కిరాతకుల దేవత పెట్టిన శాపఫల మనుకునేవాడు! కిరాతకులకు తమవాడని చెప్పుకోదగిన ఆప్యుడౌకడు లభించాడు!

శంభు దేవకుడిని విడిచి ఒక్క క్షణమైనా వుండగలిగేదికాదు. మొదట కొన్ని సంవత్సరాలపాటు ఆర్య శిశువనే భావంతో ఎవడైనా చంపుతాడేమో నని, తనదగ్గరే వుంచుకుంది. తరువాత ఆమె అతడిని తన పుత్రుడిగానే స్వీకరించింది. పుత్ర వాత్సల్యం కారణంగా అతడిని ఒక్క క్షణంకూడా విడిచివుండేది కాదు. దేవకుడు పెద్దవాడయ్యాక శంబరుడి హృదయంలోనూ అతడిమీద శత్రుభావన నశించి ఆ స్థానంలో మనుమడిమీద కలిగే మమత నెలకొన్నది. అప్పుడప్పుడు, కిరాతకులకు భిన్నంగావున్న తన పసుపు పచ్చని తలవెంట్రుకలమీదా, నీలికండ్లమీదా అలివిమాలిన ద్వేషం కలిగేది దేవకుడికి. కాని నల్లని తలవెంట్రుకలుకల దాసులు తనపై చూపుతున్న స్నేహ, ఆత్మీయ భావం కారణంగా కిరాతజాతికి భిన్నమైన తనలోని లక్షణాలను త్వరలోనే మర్చిపోయేవాడు. బృహత్పర్వతాలలో గాఢమైన పరిచయంకల పీతకేశుడు - ఆర్యుడు - దేవకుడొక్కడేనని చెప్పవచ్చును. ఆర్యులు ఆ పర్వతాల్లో రెండుమూడు యోజనాలు ప్రయాణం చేసేసరికే

ప్రాణావశిష్టులవుతారు. అసలది కిరాతకులభూమి. ఇప్పుడిక దేవకుడికి కూడా మాత్రం భూమికిందే లెక్క.

దేవకుడు బృహత్పర్వతాల్లో చాలాదూరంవరకు పర్యటించాడు. ఆ పర్వతాలు అతనికి కొట్టినపిండి అయ్యాయి. ఓసారి దేవకుడు ఆ పర్వతాన్ని గురించి ఇలా చెప్పాడు: "ఈ బృహత్పర్వతాల్లో చాలా దూరంలోనూ, చాలా ఎత్తుగానూ వున్న పర్వతం ఏదో తెల్సునా? ఆ కనపడుతున్నదే? తెల్లగా మేఘశకలాన్ని పోలి, అది. ఇక అక్కడినుండి ముందుకు పోయినకొలది పైకే పోతాంటాము. అక్కడ ప్రయాణంచేయడం చాలా కష్టం! దారీ తెన్నూ యేమీ వుండదు. ఐతే కిరాతకులకుమాత్రం దారి గుర్తే! చెట్లమీదా, రామల మీదా గుర్తుల్ని పెట్టుకుంటారు కిరాతకులు. ఆ గుర్తుల ననుసరించే ప్రయాణాలు చేస్తుంటారు. సాధారణంగా కిరాతకులు తమ ప్రయాణాలను నదీతీరాలగుండా సాగిస్తుంటారు. బృహత్పర్వతాల్లోని పెద్దనది విపాశ! పైకి పోయినకొలది, ఈ నదియొక్క వైశాల్యం కుంచించుకుపోతూ వుంటుంది. అక్కడక్కడ సమతలభూమిలో మాత్రం నదీప్రవాహం వైశాల్యాన్నీ, గాంభీర్యాన్నీ తాలుస్తూవుంటుంది. ఆ పర్వతాల్లో ముందుకు వెళ్ళినకొలదీ, పైకే వెళ్ళిపోతాంటాము. పైకి పోయినకొలది చలి మిక్కుటమౌతూవుంటుంది. మండువేసంగుల్లో కూడా, ఆ పర్వతాల్లో నీరు గడ్డకట్టుకుపోయేంత చలి పెడుతూవుంటుంది. అదిగో ఆ తెల్లని పర్వత శిఖరాలు కనుపిస్తున్నాయే? అవన్నీ మంచుతో కప్పబడినవే! ఆ శిఖరాల వద్ద చలి చెప్పనలవి కానంతగా వుంటుంది. కిరాతకులు తోడేలు చర్మాన్నీ, మంచుఎలుగు చర్మాన్నీ కప్పుకుంటూవుంటారు. అయినా, చలి ఆగదు. వణికిపోతూ వుంటారు."

శ్రోతల్లోనుండి ఒక డిలా అడిగాడు: "ఎలుగుచర్మాన్నికూడా కప్పుకుంటారా?"

"అవును. ఎలుగు చర్మాన్నికూడా కప్పుకుంటూ వుంటారు. మరో విషయం, ఇక్కడ మనం చూస్తూన్న నల్లనిఎలుగులు కాదక్కడ వుండేవి. అక్కడి ఎలుగులు తెలుపూ, ఎరుపూ కలసిన బూడిదవర్ణంలో వుంటాయి."

"బూడిదరంగులోనా ?"

"అవును. బూడిదరంగులో ! కొంచెం ఎరుపు కలిసి వుంటుంది మరో విశేష మేమిటో తెలుసా ? అవి చలికాలం ఆరునెలలూ నిద్రిస్తూనే వుంటాయి !"

"చలికాలం ఆరునెలలూ నిద్రిస్తూంటాయా ?"

"చలికాలం ప్రారంభమై పై పర్వతాల్లో మంచు విస్తారంగా కురవ సాగినప్పుడు పశువులూ జంతువులూ, అన్నీ ఎక్కువ వేడిమినిచ్చే క్రింది పర్వతాల్లోకి దిగుతాయి. పశువులను, జంతువులను అనుసరించి కిరాతకులు కూడ క్రింది పర్వతాల్లోకి దిగుతారు. మంచు ఎలుగులు చలి ఎక్కువై నప్పుడు మిగిలిన జంతువుల్లా క్రిందికి దిగక, ఆ పర్వతాల్లోనే, చీకటి గుహ ల్లోకి పోయి, తూగడం ప్రారంభిస్తాయి. వాటికి మూర్ఛలాటి నిద్ర వస్తుం దప్పుడు. అలాగే తూగుతూ ఆరు నెల్లు గడిపేస్తాయి !"

"మరి ఆహారమో ? ఆహారం లేకుండా ఆరునెల్లూ ఎలా బ్రతక గలవు ?"

"ఆరు నెల్లు నిద్రపోవడం వలన వాటికి ఆహారం తీసుకోవలసిన అవసరం లేకుండాపోతుంది. ఆ నిద్రావస్థలో నేను వాటిని చూశాను. చంపానుకూడా ! మూర్ఛాగతుడైన మానవుడు, గదతో కొట్టడంవలన ఎలాగైతే మౌనంగా ప్రాణాల్ని విడిచేస్తాడో, అలాగే ఇవీ ప్రాణాల్ని విడిచేస్తాయి. నేనీ ఎలుగును వసంతాగమనసమయంలో వేటాడాను. పరిసరాల్లో ఉష్ణ ప్రసారం అధికమైనకొలది తిరిగి ఈ ఎలుగుల శరీరాల్లోనూ క్రమేణా జాగృతి కలుగుతుంది. పూర్తిగా జాగృతిని పొందిన తరువాత ఆహారాన్ని సంపాదించుకోవడానికి బయల్దేరుతాయి. బృహత్పర్వ తాల్లోని చెట్లూ, వనస్పతికూడా చాలా వ్యత్యాసంగా వుంటాయి. -అక్కడ ఆకురాలుకాలం వసంత ఋతువుకు ముందుకాక శరదృతువుకు ముందు వస్తుంది. శరదృతువు పూర్తి అయ్యేసరికి చెట్లన్నీ ఆకుల్ని రాల్చేసి మోళ్ళయిపోతాయి. పసిరిక ఎండిపోయితుంది. మరచాను, ఆ పర్వతాల్లో ఒకరకం చెట్టుంది. ఆ చెట్టుఆకులు ఎప్పుడూ పచ్చగానే వుంటాయి. ఆ చెట్టుకి అసలు ఆకురాలు కాలమంటూ వుండదు. ఆశ్చర్యంగా లేదూ ?"

"అవును. అయితే ఈ విషయాన్ని విశ్వసించలేకుండావున్నాము!"

"నేను నా కండ్లతో చూశా నా చెట్టును. మనలోనూ చాలా మంది చూసినవాళ్ళుంటారు. దానికి దేవదారు (దేవతల దారు-వృక్షం) అని పేరుకూడా పెట్టారు!"

"దేవదారు అన్న పేరును మేమూ విన్నాము. దేవదారు అంటే దేవలోకపు వృక్షమని మా భావన!"

"అయితే ఆ తెల్లని మంచుకొండల్నే దేవలోకమనుకుంటే సరిపోతుంది! మరికొంతదూరం, (ఎత్తుకు) పోయాక ఈ దేవదారు వృక్షాలు కూడా సమాప్తమౌతాయి. తెల్లని బెరడుగల మరో క్రొత్తరకం వృక్షాలొస్తాయి (భూర్జ వృక్షాలు). ఈ వృక్షాలు ఎంత హిమపాతంలోనైనా దెబ్బతినకుండా బ్రతికివుంటాయి. అక్కడ, క్రిందివారు ఎన్నడూ చూడని విచిత్రమైన పశుపక్ష్యాదులు, చెట్లూ, వనస్పతి కనుపిస్తాయి. అయితే, వాటిని చూడనివాళ్ళు విశ్వసించడం కొంచెం కష్టం! చూడకుండానే మంచు ఎలుగుయొక్క ఆరునెల్ల నిద్రను విశ్వసించగలమా? అక్కడ ఓ రకం ఉడత ఉంటుంది. అది రెక్కలున్న మామూలు పిట్టల్లా ఒక కొమ్మ మీదనుంచి మరో కొమ్మమీదకు ఎగురుతుంది! అలాటి ఎగిరే ఉడుత వుంటుందని చెబితే నమ్మగలమా చూడకుండా? మనం కలలో కూడా విశ్వసించలేని, అనేక విచిత్రాలను అక్కడ చూడవచ్చును!"

దేవకుడు ఆర్యులతో సంఘర్షిస్తూ, దెబ్బతిని ప్రాణావశిష్టుడై ఖైదు చేయబడ్డాడు. ఆర్యుల ఖైదులోవుండి తన ముప్ఫై సంవత్సరాల జీవితానుభవాన్నీ పై విధంగా వర్ణించాడు. కాళ్ళూ చేతులూ విరిగి పోయాయి. కొన్ని ప్రాణాంతకమైన దెబ్బలుకూడా తగిలాయి. క్రిందపడ్డవాడు ఇకలేవలేదు. నరకయాతన ననుభవించి, అక్కడే, ఆర్యుల ఖైదులోనే చనిపోయాడు. కానీ, చిట్టచివరి క్షణం వరకూ, తన పెంపుడుతల్లి అయిన శంభు జ్ఞప్తికి వస్తే, పసిపిల్లవాడిలా 'అమ్మా శంభు!' అమ్మా శంభూ!' అని దారుణంగా విలపించేవాడు.

ఎవడైనా "ఏమ్, దేవకా, దేవకా, నీ చేతులూ కాళ్ళూ నయమై నీవు బ్రతికితే. వీళ్ళఖైదునుంచి తప్పించుకో గలిగితే, అప్పుడేం చేస్తావు?" అనడిగితే —

"ఆర్యులందరినీ ఒక్కొక్కరినీ సంహరించేస్తాను. శంభుమాతను చంపిన ఈ ఆర్యులు పృథ్విపై జీవించడానికే వీలులేదు" అనేవాడు.

నీళ్ళలో అతడికి తన ముఖాన్ని చూపించి "నీ ముఖాన్నీ, ముక్కూ, కండ్లు, మీసాలూ, గడ్డం-ఇవన్నీ చూసుకో! నీవు కిరాత జాతికి చెందిన వాడివి కావని, ఆర్యజాతికి చెందినవాడివనీ తెల్సుకోడానికి ఇంతకంటే సాక్ష్యం ఇంకేం కావాలి. నీవు నిజంగా ఆర్యమాత సంతానానివి. ఆర్యుడి వని ఇప్పటికైనా ఒప్పుకుంటావా ?" అనడిగారు.

దేవకుడు తన తలను విసురుగా లాగేసుకుని "నేను ఆర్యమాత పుత్రుణ్ణి కాగోరడంలేదు. ఊహ తెలిసినప్పటినుంచి శంభుమాతనే నా మాత అనుకున్నాను. శంభుమాత హత్యకు ప్రతీకారాన్ని చేయడమే నా ప్రథమ కర్తవ్యం !" అన్నాడు.

"ప్రతీకారాన్ని చేయడమా ? కాళ్ళూ చేతులూ లేకండా భూమ్మీద పడి దొర్లుతున్న నువ్వేమి ప్రతీకారాన్ని చేస్తావు ? నీ ముక్కూ ముఖమూ, శరీరపురంగునూ చూశాకనయినా ఆర్యుడివన్న విశ్వాసం కలుగుతోందా, లేదా ?"

"ఈ ప్రశ్నకు సమాధానం చెప్పవల్సిన అవుసరం నాకులేదు. ఈ హృదయం శంభుమాత ప్రసాదం ! అంతవరకే నాకు తెల్సు !"

ఆ తరువాత కొద్ది రోజులకే మాన్యమాలుడు చనిపోయాడు. ఎన్ని వైద్యాలు చేసినా విరిగిన కాళ్ళూ చేతులూ బాగుపడలేదు. చివరి రోజుల్లో తను ఆర్యుడనన్న విషయాన్ని విశ్వసించాడు కూడాను. తనను ఆర్యస్త్రీ కన్నదనీ, శంభు పెంచిందనీ తెల్సుకున్నాడు !



# 10. పూర్వ ఋషులు

"అత్రా దాసస్య నముచేః శిరో యదవర్తయో, మనవే గాతు మిచ్ఛన్"

(ఋక్కు 5-30-7)

విపాశ తీరానికి ఎగువకు సమిధలనిమిత్తమై వందలసంఖ్యలో ఆర్య బాలబాలికలు వెళ్తుంటారు. కొందరు జువ్వికొమ్మలను ప్రోగుచేసుకుంటూనూ, కొందరు దర్భలను ఏరుకుంటూనూ, మరికొందరు ఆసనంకొరకు కుశతృణాన్ని కట్టలు కట్టుకుంటూనూ వుంటారు. సాధారణంగా బాలబాలిక లందరూ 14, 15 ఏండ్లలోపు వయస్సువారై యుంటారు.

సోమశ్రవుడనే బాలుడొక డిలా అన్నాడు: "మన మహర్షిని చూసి, వారికి 70 ఏండ్లు దాటాయని ఎవరూ అనుకోలేరు. తమ వయస్సు కంటే చాలా చిన్నవారుగా కనపడతారు."

"అవును వారి గడ్డమూ, మీసాలూ నెరిసి వారి వయస్సును బయట పెడుతున్నాయి గానీ, లేకపోతే వార్ని యువకు డనుకోవలసినదే! ఇవ్వాళ మన పూర్వఋషుల్నిగురించి ఎంత ఉత్సాహంగా ఉపన్యసించారో చూశావా? సప్తసింధులోని ఆర్యులందర్నీ సంబోధిస్తూ ఎంతటి ఉద్రేకంతో భాషణ నిచ్చారో! అసురవీరుడు నముచి శిరాన్ని మనువు ఎగరగొట్టాడని ఎంతటి

అభిమానంతో చెప్పుకున్నారో ! ఆ సందర్భంలో మనువుకు ఇంద్రుడు సహాయకారి అయ్యాడుట !" మరి ఇంద్రుడు ఇప్పుడేం చేస్తున్నాడు ?" అన్నాడు మరొక బాలుడు.

"ఈ విషయాల్ని చెప్పేప్పుడు మహర్షి ఎలా కంపించి పోయారో. చూశావా ? వారు మాట్లాడినట్లుగా లేదు. స్వయంగా ఇంద్రుడు వచ్చి. మహర్షిముఖతా తన అభిప్రాయాన్ని వెల్లడిచేసినట్టుగా వుంది :"

"అసుర వీరుడు నముచిని, అతడి బలగాన్ని సంహరించడానికి ఆర్యులు ఏకమయ్యారు. అసలు ఇంద్రుడే చెప్పాడుట "మీరందరూ ఐక్యతతో పోరాడితే, గొప్పపురాలుగానీ, నగరాలుగానీ నముచి నేమాత్రమూ రక్షించలేవు :" అని. ఇంద్రుడు చెప్పినట్లే జరిగింది. దధీచి, అంగిరా, ప్రియమేధ, కణ్వ అత్రి – వీరంతా మన పూర్వఋషులు. వీరే పణుల భూమయిన సప్తసింధును జయించి ఆర్యభూమిని చేశారు. ఇప్పుడు, తుర్వశ. యదు, సృంజయ పురు మొదలైన ఆర్యజనాలు పరస్పరం కొట్లాటల్లో మునిగివున్నాయి. వీరి కొట్లాటలను చూసి ఇంద్రుడేమన్నాడో తెలుసా? "మీరు పరస్పర ద్వేషాలను మరచి, ఐక్యతతో వుంటారా వుండండి, లేదా బృహత్పర్వతాల్లోని దాసులు, ఒక్కొక్కడూ ఒక్కొక్క మహా వజ్ర(గద)మై మీ మీద పడతారు, జాగ్రత్త :"

ఆనాటి మహర్షి భరద్వాజులవారి ఉపన్యాస సారాంశాన్ని ఇలా అభివ్యక్తీకరించాడు సోమశ్రవుడు : "నముచి, అతడి అనుచరులూ – వాళ్ళతరహా వేరు. ఈ శంబరుడు, వీడి అనుచరులు – వీళ్ళతరహా వేరు. శంబరాసురుడు అతడి అనుచరులూ శలభాల్లాంటివారు. వీరు యుద్ధంలో చావగలరు, శత్రువుని చంపగలరు. కానీ, హతాశులవడం, నిరాశులవడం వీరికి తెలియదు. యుద్ధంలో ఆర్యులవలన హతులౌతున్నప్పటికీ శంబరాసురుడి అనుచరులు ముందుకే వస్తూంటారు. ఏ కారణం వల్లనైనా ఆర్యులపై ఇంద్రుడికి కోపం వచ్చిందా, ఇక ఈ కిరాతకుల బలం పదిరెట్లు పెరిగిందన్నమాటే :"

భరద్వాజఋషి గంభీర ప్రభావోత్పాదకమైన స్వరంలో ఉపన్యసించాడు. వారి భాషణ శ్రోతలమీద గొప్ప ప్రభావాన్నేసింది. శంబరుణ్ణి ఓడించడానికి ఆర్యులందరూ ఐక్యతతో పోరాడవల్సిన అవసరం ఎంతయినా వుందని అర్థం చేసుకున్నారు.

ఋషి ఇంకా ఇలా అన్నాడు : "కిరాతులు నిజంగా శుష్కోల్లాసులైన వారు. వారి పొట్టిశరీరాలు....పసుపురంగు... అర్ధనగ్నశరీరాలు...ఉదగ్గులు కిరాతకులు కలిసికూడా ఒక ఆర్య యువకుడికి సరి రాలేరు. కిరాతకులను నాశనం చేయాలని గట్టిగా నిర్ణయించుకుంటే. వారెంత అధిక సంఖ్యలో వుండినప్పటికీ తప్పక నాశనం చేయగలం! అసురవీరుడు నముచి, నగర వాసి, భోగవిలాసాలను అనుభవిస్తూ సుఖకరమైన జీవితాన్ని గడుపుతున్న వాడు. అతడిని జయించడంవలన అతడి నగరాలు, భోగవిలాసాలూ మన వశమయ్యాయి కానీ, ఈ శంబరాసురుడు నగరవాసికాదు. గ్రామ వాసికూడాకాదు. కృషిమీద ఆధారపడేవాడు కాదు. కనుక ఓడిపోవడం వలన ఇతడికి పోయేదేమీ వుండదు! తనకు కల రాగి, రాతి ఆయుధాలను తీసుకుని మరోచోటుకి వెళతారు. అక్కడినుండి మళ్ళీ యుద్ధాన్ని ప్రారంభిస్తారు!" అని సోమశ్రవుడు చెప్పాడు.

"అంతేకాకుండా. అసురుల్ని రక్షించడానికి బృహత్పర్వతం సదా సిద్ధంగా వుంటుంది. బృహత్పర్వతాన్ని గురించి మనం కర్ణాకర్ణిగా వినడంతప్ప స్వానుభవంవలన తెలుసుకున్నది హాస్యమనే చెప్పాలి. మన విపాశనది అక్కడనుండే వస్తుందిట.... అయితే మంచుకరిగి, ఆ నీరే ఈ విపాశలోకి ప్రవహిస్తుందిట! అక్కడ ఎంత మంచో, ఎంత చలో తెలుసునా? మనం అక్కడికి వెడితే గడ్డకట్టుకు పోతామట! అక్కడే దేవదారు లుంటాయిట, వాటి ఆకులు ఎప్పుడూ ఎండవట! రాలవుట! విపాశనది పుట్టిన ప్రదేశం దేవదారుల ప్రదేశానికి చాలాపైన!" అన్నాడు **మరొకడు.**

"అక్కడ ఇంకో విచిత్రం, ఆరునెల్లు నిద్రపోయే ఎలుగుబంట్లు వుంటాయిట!"

"అవి మన మామూలు ఎలుగుబంట్లలా నల్లగాకాక, ఎరుపు తెలుపూ కలిసిన రంగులో వుంటాయిట!"

"అయితే. బృహత్పర్వతాలు అసురులకు గొప్పరక్షణ అనవచ్చును! అవసరమైతే అసురులు బృహత్పర్వతాల్లోకి వెళ్ళి దాగుకోనవచ్చును. ఆర్యులెటూ ఆ పర్వతాల్లోకి వెళ్ళలేరుకదా!"

"మహర్షి స్పష్టంగా చెప్పారు. 'పరుష్ణీ, విపాశ, నదీతీర ప్రదేశాల్లో. కిరాతకుల్ని ఆపడమే గనుక సంభవం కాకపోతే ఒకేఒక ఆక్రమణతో. మొత్తం సప్తసింధునే హస్తగతం చేసుకుంటారు. ఆటు తరువాత సప్తసింధులో ఆర్యులకు స్థానమే వుండదు !' అన్నారు."

"ఇంత ప్రమాదం వుండడం వల్లనే యదు తుర్వశ గణాలు తమ మనస్సుల్ని మార్చుకున్నాయి. యదు తుర్వశ యువకులు మహర్షివద్దకు వచ్చి ఇలా అన్నారు "మా వృద్ధులు కలసిరానీ, రాకపోనీ, మేము మాత్రం వారి మాటలువిని, ఆర్యుల వినాశానికి సహకరించము! తమమాట మాకు శిరోధార్యం... అదే మా కర్తవ్యం !"

"నామాట అనకండి ఇంద్రుడిమాట మీరూ. నాహ అందరికీ శిరోధార్యమైనది! వర్ధ్యశ్వపుత్రుడు దివోదాసును సేనాధిపతిగా చేసుకుని, సప్తసింధుయొక్క ఉత్తర సరిహద్దుల్లోకల కిరాతకుల్తో పోరాడమనీ, చిట్టచివరి శత్రువు నేలకొరిగే వరకూ యుద్ధాన్ని ఆపవద్దనీ ఇంద్రుడి ఆజ్ఞ !" అన్నాడు భరద్వాజ ఋషి.

యదు, తుర్వశ గణాల యువకులు ఇంద్రుడి ఆజ్ఞను నెరవేర్చడానికి ప్రవేనబూనారు. ఆ రోజు భరద్వాజ మహర్షి గోత్రము (గోశాల) నూతనులయిన అనేకమంది రాజకుమారుల్తో నిండిపోయింది. రాజకుమారులందరూ పరస్పరం గొప్ప సుహృద్భావాన్ని ప్రకటించుకున్నారు. రాజకుమారుల్లోని ఈ నూతనోల్లాసాన్ని, ఆత్మీయతను చూసి భరద్వాజ మహర్షి తృప్తిగా విశ్వసించాడు. ఇలా అన్నాడు "ఇకనిప్పుడు, మనం. శంబరాసురుణ్ణి, నిస్సంశయంగా ఓడించ గలం !"

* * *

ఆర్యుల్లో పరస్పరం ద్వేషాలనం ప్రజ్వరిల్లడానికి ప్రధాన కారకులు యదు: తుర్వశ గణాలు. అందువలననే భరద్వాజ మహర్షి మొదటగా యదు, తుర్వశ గణాలను మార్చడానికి ప్రయత్నించాడు. వారి భూముల్లో పర్యటిస్తూ ఇలా ఉద్ఘోషించాడు. "నా సంకల్పం, స్వయంగా నా సంకల్పంకాదు. ఇంద్రుడి సంకల్పం. నేను నా సహోదరులైన, యదు. తుర్వశగణాల పెద్దలనూ యువకులనూ భ్రాతృప్రేమతో జయించి నాలో కలుపుకోడానికి

వచ్చాను. నా హృదయగతమైన భ్రాతృప్రేమను యదు, తుర్వశ గణాల ప్రజలు తెలుసుకోనలేక పోయారు. అయినా వారికి తెలియ చెప్పడం నా బాధ్యత. కనుకనే నా భ్రాతల వద్దకు వచ్చాను! ఐక్యతతో పోరాడ గలిగారు కనుకనే మన పూర్వులు గొప్ప గొప్ప విజయాలను సాధించారు. గతంలో మనువునూ, దధీచినీ తనకు ప్రతినిధులుగా పంపుతూ ఇంద్రుడిలా అన్నాడు "వీరి ఆజ్ఞల్ని పాటిస్తూ పోరాడండి.... మీకు నేను అండగా నిలుస్తాను;"

"ఇంద్రుడి సంకల్పం ఆర్యసోదరు లందరికీ తెలుసు. ఆ సంకల్పా నికి ఒకరూపం ఈయ వలసిందని భ్రాతలను అడుగుతున్నాను. నే నిలా చెప్తున్నందుకు సోదరులకు కోపం రావచ్చు! వారొకవేళ తమకోపాన్ని ఆపుకోలేక నన్ను తెగటార్చినా, తెగటార్చవచ్చు: అందుకు నే నేవిధం గానూ విచారించను. ఇంద్రుని ఆశయాన్ని నెరవేర్చడంలో చని పోతున్నందుకు సంతోషిస్తాను. ఈ ప్రయత్నంలో నేను గతించినా. ఇంద్రుడి సంకల్పం నెరవేరకపోదు. ఈ కార్యాన్ని నిర్వహించడానికి ఇంద్రుడే మరొకరిని నియోగిస్తాడు!"

భరద్వాజఋషి ప్రబోధాలు చాలా భాగం ఫలించాయి. ఆర్యుల్లో పరస్పర విద్వేషాలు అంతరించాయి. మొత్తం సప్తసింధు అంతా అంజలి బద్ధమై మహర్షి ముందునిలబడింది. అపూర్వమైన ఐక్యత ఆర్యుల్లో కను పించింది. ఈసారితో అసురులు – శాశ్వతంగా పరాజయాన్ని పొందుతారని ప్రతి ఆర్యుడూ దృఢవిశ్వాసాన్ని కలిగివున్నాడు.

పురు, త్రుత్సు గణాల మధ్యనున్న మనస్పర్ధలుకూడా అంతరించాయి. పురుకుత్సుడు తన మేనల్లుడైన దివోదాసు సంకల్పానికి పూర్తిగా తోడ్ప డ్డాడు. త్రసదస్యుడు 'ఋల్లివావ'కు కుడిచేయిగా సహకరించాడు. భరద్వాజ ఋషి కుమారుడు గర్గుడు సహకరించాడు. కుత్స అర్యనేయుడు యుద్ధానికి సిద్ధమయ్యాడు. అయితే ఆ సంవత్సరం పెద్ద సంఘర్షణలేమి జరగలేదు. బెదురుగా అక్కడక్కడా చిన్న చిన్న సంఘర్షణలు జరిగాయి.

# 11. 'సారథి కుత్స ఆర్యునేక్'

"మహో ద్రుహో...వజ్రస్య యత్పతనే శుష్ణః ।
ఉరుష ఏక సరథం సారథయే కుత్సాయ ఉగ్రో పురోహితః"

(ఋక్కు- 10-150)

ఆర్యులకు పురుకుత్సుడు, దివోదాసు, ఋజ్యా లాంటి మహారథు లున్నారు. అయితే శంబరుని సేనానాయకులూ వీరికి ఏవిధంగానూ తీసి పోయేవారు కాదు. శుష్ణ, అర్శసు, కువయ - వీరు గొప్ప అసుర సేనాధి పతులు. ఈ అసురవీరులను జయించడం ఆర్యులకు చాలా కష్టసాధ్యమైన విషయం. అసురుల శరత్పురాలు చలికాలపు నాలుగునెల్లుమాత్రమే పర్వత లోయల్లో వుంటాయి. నాలుగునెలల నివాసరంకోసరం ఆర్యుల్లో ఇంత పెద్ద ఎత్తున సంఘర్షించడం అనవసరమన్న భావనా కొంతమందిలో వుంది. కానీ, శరత్పురాలను నిర్లక్ష్యం చేస్తే ఆ తరువాత పర్వతాలపైన మాత్రం ఆర్యులు తమను వుండనిస్తారన్న నమ్మకం ఏమిటి ? పర్వతాలపైన సంవత్సరంలో ఎనిమిదినెలలూ నిరపాయంగా గడపదలుచుకుంటే, పర్వతాల క్రింది తాత్కాలిక నివాసాలయిన శరత్పురాలను రక్షించుకోవడం అతి ముఖ్యం. శరత్పురాలను రక్షించుకోవడంలో మొత్తం అసురజాతే నాశన మైపోయినా లెఖ్ఖచేయకూడదు.

ఆ సంవత్సరం యుద్ధానికి పూర్తిగా సంసిద్ధుడై విపుల సైన్యసమేతుడై క్రిందికి దిగాడు అసురవీరుడు శుష్ణ. అసుర కువయ, పిప్రు, వంగృహ, కరంజ, పర్ణయ, వర్చి మొదలుగాగల అసురవీరులు పూర్తి ఏర్పాట్లతో, బృహత్పర్వత పాదభూముల్లో శరత్పురాలను ఏర్పరచుకుని, ఆర్యుల్తో పెద్ద ఎత్తున సంఘర్షించడానికి సంసిద్ధులై వున్నారు.

యుద్ధాల్లో ఆర్యులకు అశ్వాలు గొప్ప బలమైతే, అశ్వాలు లేని లోటును కిరాతకులు నిశాచరులై పూర్తి చేసుకుంటున్నారు. కిరాతకుల శరత్పురాలకు యాభై, అరవై యోజనాల దూరానికి లోపునగల ఆర్య గ్రామాల్లోని ఆర్యులకు, రాత్రిపూట బహుకష్టంమీదగాని నిద్రరావడంలేదు. ఏ క్షణాన అసుర బలగాలు వచ్చి పడతాయో, ఎవరికి తెలుసు? సాధారణంగా ఆర్యులు కిరాతకుల శరత్పురాలకు అరవై యోజనాల దూరానికి అవతలే తమ గ్రామాలను నిర్మించుకుంటూ వుంటారు. అంటే, ఒక్క రాత్రిలో, అసురులు తమమీద వచ్చిపడలేనంత దూరంలో ఆర్యులు తమ గ్రామాలను నిర్మించుకుంటారు. ఆ గ్రామాలయినా చిన్న చిన్న గుడిశల సమూహాలు. ఏ క్షణాన్నయినా, ఆ గుడిశలను ఒక చోటినుంచి మరోచోటికి సునాయాసంగా మార్చుకొనవచ్చును! శుష్ణ, శంబరుడికి కుడిచేయని కుత్సుడు తెల్సుకున్నాడు. అతడిని నిహతుణ్ణి చేస్తేనేగాని, శంబరుడి బలం కృంగదనుకున్నాడు. అయితే, అనేకంగా వున్న కిరాతకుల శరత్పురాల్లో శుష్ణ ఏ పురానికి అధినాథుడో తెల్సుకోవడం కష్టం. అక్కడికీ కుత్సుడు తనగుప్తచరులను పంపించాడు. గుప్తచరులుమాత్రం కిరాతకుల పురాల్లోకి ఎలా వెళ్ళగలగడం? పీతకేశులు అసలు అసురపురాలను సమీపించడమే దుర్లభం. ఆర్య అసుర ఉభయుల నివాసాల్లోకి సర్వసాధారణంగా వెళ్ళగలవారు పణులు మాత్రమే! మంచి రాగిఆయుధాలను పణులే తయారు చేస్తుంటారు; ఇతర అనేకమైన వస్తువులను, పదార్థాలనూ అమ్ముతూ వుంటారు. తమ పణనం (వ్యాపారం) కొరకు అనేకమైన ప్రమాదాలను ఎదుర్కొని అయినా, ఆర్యుల నివాసాలకు వెళ్తుంటారు. కుత్సుడు పణులనే గుప్తచరులుగా కిరాతకుల పురాల్లోకి పంపించాడు. ఒకరోజున ఒక పణి వ్యాపారి ఒకడు కుత్సుడి వద్దకు వచ్చి ఒక శరత్పురాన్ని గూర్చి చెప్పాడు. ఆ పురంలో గుర్రాలూ, ఆవులూ, గొర్రెలూ, మేకలూ పది

వేలవరకూ వున్నాయి. ఆ పురికి నాయకుడు శుష్ణ అని పణి వ్యాపారి చెప్పాడు. తన అభిప్రాయాన్ని కుత్సఆర్యనేయుడికి వివరించాడు. శంబరుడి తరువాత గొప్ప వైభవోపేతమైన పురాన్ని కలిగినవాడు శుష్ణ ఒక్కడే. పణి వ్యాపారికి అసురభాషకూడా వచ్చు. పైపురంలో ఒకటి రెండు మార్లు శుష్ణ పేరునుకూడా విన్నాడు వ్యాపారి. అదే శుష్ణపురమని, ఆ పురి నాయకుడే శుష్ణఅని కుత్సు నిశ్చయించుకున్నాడు.

శుష్ణపురంమీద ఆక్రమణ జరపడానికి ఆలోచించసాగారు. దివోదాసు, మంకొందరు ఆర్యరాజకుమారులూ మాట్లాడుకుంటున్నారు. ఒక రాజకుమారు డిలా అన్నాడు. యుద్ధంలో అసురులు మంత్ర తంత్రాలను మాయలను ఎక్కువగా ఉపయోగిస్తారు. ముఖాముఖి పోరాటంలో బహూ కొద్దిగాగాని పాల్గొనరు. మనం ఆక్రమణ చేయబోతున్న విషయం వారికి తెలియకూడదు. మన సైనిక సంఖ్యను గురించిన విషయాలుకూడా వారికి తెలియరాదు !"

"అవును మనం వస్తున్నామని తెలిస్తే, వాళ్లు అక్కడినుంచి తమ పురాలను మార్చేస్తారు. శుష్ణ మన చేతికి అందకుండా పారిపోతాడు !" అన్నాడు దివోదాసు.

కుత్సుడు అందుకున్నాడు : "ఏవిధంగానయినాసరే శుష్ణను పట్టేసెయ్యాలి. శుష్ణను సైన్యంతోసహా విధ్వంసం చేశామా, ఇక శంబరుడికి కుడిచేయి విరిగినట్లే !" అన్నాడు.

"కనుక మనం సైన్యాల్ని ఎలానడపాలంటే, వెళ్ళి మీదపడేవరకూ వాళ్ళకు ఏమాత్రమూ మన ఆక్రమణను గురించిన ఆచూకీ తెలియరాదు !" దివోదాసు అన్నాడు.

* * *

యుద్ధప్రస్థానం రాత్రికే నిశ్చయమైంది. ఘోరారణ్యంగుండా ప్రయాణం చేయాలి. క్రూరజంతువులు బహుళంగావున్నాయి ఆఅరణ్యంలో. చెట్లు ఒకదానికొకటి పెనవేసుకున్నట్టు వున్నాయి. ఆ చెట్లలోనుండి మార్గం చేసుకుని వెళ్ళటం బహు దుస్తరం. ఆ అరణ్యంలో సింహాలూ, పులులూ, ఏనుగుల సమూహాలూ వున్నాయి ; వేలసంఖ్యలోవున్న ఆర్యుల సైనికులను

గుఱ్ఱాలను చూసి వన్య జంతువులు బెదిరి పరుగెత్తడం ప్రారంభించాయా, మొత్తం అరణ్యంలోనే ఓ గొప్ప కోలాహలం రేగుతుంది. ఆర్యులు వస్తున్నారని కిరాతకులకు తెలుస్తుంది. మార్గాన్ని తెల్పగల అనుభవజ్ఞుల కొరకు వెతికారు. నిషాదులు అరణ్యవాసులే కాని, బృహత్పర్వత ప్రాంతాల్లోని అరణ్యాలు వారికి తెలియవు! నిషాదులు బృహత్పర్వతానికి సుమారంగా, దక్షిణానకల అరణ్యాల్లో నివసిస్తూ వుంటారు. అయినప్పటికీ అరణ్యవాసులు కావడంవలన అరణ్యాల్ని గురించి, అరణ్యాల్లో నివసించే జంతువుల్ని గురించి కొన్ని సాధారణమైన విషయాలు తప్పని సరిగా తెలిసివుంటాయి. అనుభవంకల ఒక నిషాదు డిలా అన్నాడు: "అరణ్యాల్లో మన యిష్టమ్మొచ్చినట్లు ప్రయాణం చేయకూడదు. ఎండిపోయిన చిన్ననదుల ననుసరించి ప్రయాణముచేయుట మంచిది. విపాశ చిన్న నది కాదు, చాలా పెద్దనది. అలాటి నది ననుసరించి వెళ్ళినట్లయితే, నదిలో నీరు త్రాగడానికి వచ్చేజంతువులు మనల్ని చూసి పరుగెత్తుతాయి. అరణ్యంలో సంచలనం కలుగుతుంది. రహస్యం బయటపడుతుంది. చిన్న నది, చాలా చిన్ననది ఉపయుక్తం అనిచెప్పాడు."

ఎండి పోయిన ఒక పెద్ద కాలువను అనుసరించి ప్రయాణంచేయుటకు నిశ్చయమైంది. ఆ కాలువ ఋష్ణుపురంవద్దనుంచే వస్తుంది.

ప్రస్థానం చేయడానికి ముందు ఇంద్రుణ్ణి స్తుతించారు.

ఆ రోజు శ్వేతాశ్వాలతో పనిలేదు. రాత్రిపూట శత్రువుకు రహస్యం వెల్లడికాకుండా వుండడానికి, ఎర్రని, నల్లని అశ్వాలను ఎన్నుకున్నారు. వేల సంఖ్యలో ఆర్య అశ్వారోహులు ఉత్తరాభిముఖులై బయలుదేరారు. దివోదాసు కుత్స ఆర్యనేరుణ్ణి ఆలింగనం చేసుకున్నాడు. మూర్ధాన్ని ఆఘ్రాణించి వీడ్కోలు ఇచ్చాడు. ఆర్య సైనికులకు మార్గాన్నిస్తూ నక్కలూ,కుందేళ్ళు - మొదలైన చిన్నరకం జంతువులు ఎటువటు పారిపోయాయి. అంతకు మించి పెద్దజంతువు లేవీ ఆర్య సైనికులకు తగల్లేదు. ఏనుగులకు వెదుళ్లూ, పచ్చనిచెట్లూ వుండాలి అలాటి వేమీ ఈ కాలవపొడున లేవు. లేళ్ళకూ,దుప్పులకూ పచ్చిగడ్డి, నీరూ కావాలి. అవీ లేవిక్కడ! లేళ్ళూ,దుప్పులూ లేనప్పుడు వాటికొరకు పొంచునివుండే సింహాలూ, పులులూ లాటి పెద్దజంతువులు వుండడానికే వీలులేదు. ఈ విధంగా ఎండిన కాలువ సైనిక ప్రయాణానికి

చాలా ఉపయోగకరమన్న మాట రుజువయింది. కాలువవడ్డున పెద్దపెద్ద రాళ్ళుగానీ, బంతలుగానీ లేవు. ప్రయాణం ప్రశాంతంగా సాగింది.

ఆర్య వాహిని తీవ్రవేగంతో వెళ్ళిపోతోంది. ఆర్యనేరుడు తెల్లవారే లోపే కుష్ఠపురం మీదకు వెళ్ళిపడాలని సంకల్పించుకున్నాడు.

అప్పటివరకూ నిర్విఘ్నంగా ఏ అవాంతరం లేకండా ప్రయాణం సాగింది. ఆ నిశీథంలో, ప్రశాంత వాతావరణంలో గుర్రపు గిట్టలశబ్దంతప్ప, మరో శబ్దం ఏదీ వినిపించటం లేదు. వేలసంఖ్యలోవున్న గుర్రాల గిట్టల శబ్దం ప్రకృతిలోని నిశ్శబ్దాన్నిభేదిస్తోంది. ఆర్యసైనికుల హృదయస్పందనల్లో, గుర్రపుగిట్టల శబ్దాలే వినిపిస్తున్నాయి! ఇంతలో, ముందువరుసలో వెళ్తున్న గుర్రాలు చెవులు రిక్కించి, నిలిచిపోయాయి! అశ్వారోహులు పరిస్థితిని అర్థం చేసుకోవడానికి ప్రయత్నించారు. కొద్దిదూరంలో, ఓ మర్రిచెట్టుక్రింద, ఏనుగుల సమూహమొకటి, మర్రి ఆకుల్ని కొమ్మలను విరుచుకుతింటోంది. గుర్రాల గిట్టల శబ్దాలు విని, ఏనుగులన్నీ, కొమ్మల్ని విరవడం మాని శబ్దం వస్తూన్నవైపు తిరిగాయి. ఓ గజరాజు సమూహాన్నుండి రెండడుగులు ముందుకువచ్చి, తీక్షణంగా చూడసాగింది. ఆర్యవీరులు త్వరగా ఏదో ఒక నిశ్చయానికి వచ్చేయాలి? ఏనుగుల్ని ఎదుర్కోవడమా? వెనక్కి తిరిగి పారిపోవడమా? క్షణంలో ఆర్యవీరులందరూ తమ బల్లేలను ముందుకు చాచారు. ముందుకు వెళ్ళిపోవడానికే నిశ్చయించుకున్నారు. అయితే తమకంటే ఆకారంలో అత్యల్పులైన మానవుల పౌరుషాన్ని గుర్తించాయి ఏనుగులు! ఆర్య సైనికులు బల్లేలను ఎక్కుపెట్టి ముందుకు రావడాన్ని చూసి, ఏనుగులు పరుగుతీశాయి. గజ సమూహం, తమ రాజుతో సహా దక్షిణ దిశకు వెళ్ళిపోయింది.

కొద్దిలో తప్పిపోయింది ఏనుగులూ, ఆర్య సైనికులూ కలియబడి నట్లయితే, తప్పకుండా గజ సమూహం చెల్లాచెదరయ్యేది. ఎన్నో ఏనుగులు గాయపడవి. అయితే, ఆర్య సైనికులూ ఎంతోమంది చనిపోయేవారు! గజ సమూహం ఈ విధంగా మార్గాన్ని విడిచి వెళ్ళిపోయాక ఆర్యులందరూ ఇంద్రుణ్ణి స్తుతించారు. అసలు తాము వెళ్ళేది ఇంద్రుడి ఆజ్ఞను పరిపాలించ డానికేకదా! మరిలాంటప్పుడు ఇంద్రుడెందుకు సహకరించడు తమకు? ఇప్ప టిక ఆర్య సైనికులందరూ "ఉషా గమనంలో స్వల్ప విలంబనం జరిగితే

ఎంత బాగుందు " అనుకుంటున్నారు. పూర్వున కాంతిరేఖలు విచ్చక ముందే, అసురపురిని ముట్టడించాలని ఆర్యుల సంకల్పం! అశ్వారోహులు ఏ మాత్రం శబ్దంచేయడంలేదు. గుర్రాల సకిలింపులు, కాలిగిట్టల శబ్దాలూ, కొంత సంచలనాన్ని కలిగిస్తున్నాయి. అయినప్పటికీ అనంతమైన ఆ విస్తబ్ధ నిశీధి ఆర్య సైనికుల ఆశయానికి సహకరిస్తూనేవుంది!

ఇంతలో 'కూ' అని దీర్ఘంగా కూసిన శబ్దమొకటి వచ్చింది. మార్గ దర్శకుడైన నిషాదుడు చెవియొగ్గి విన్నాడు. మరోమారు అలాగే 'కూ' అన్న కూత వినిపించింది.

కుత్స ఆర్యనేపుడు "ఏమిటా అరిచేది?" అన్నాడు.

"వానరస్వరాన్ని కిరాతకులు అనుకరిస్తున్నారు!"

"ఎందుకు?"

"మనరాకనుగురించి శుష్ణపురాని కీవిధంగా సందేశాన్ని పంపు తున్నారు!" పురం ఇంకొక యోజనం దూరంలోవుంటుంది. ఈ యోజనం దూరంలోనూ అక్కడక్కడా చెట్లపైనా శత్రు ఆగమన సూచనచేయడానికి మనుష్యులను కాపుపెట్టివుంటారు. ఇతడన్న 'కూ' శబ్దాన్ని మరొకడు అందుకుంటాడు. అదుగో దూరంనుండి మరో 'కూ' శబ్దం వినవస్తోంది. విన్నారా? ఇలాగే ఈ 'కూ' శబ్దం శుష్ణవరకు వెళ్ళిపోతుంది. ఇక శుష్ణ మనతో పోరాడడానికి సర్వవిధాలా సిద్ధమైవుంటాడు. అతడికి పీతకేశులు వస్తున్నారని తెల్సిపోయినట్లే!"

కుత్స ఆర్యనేపుడు చాలా స్థిమితంగా "శుష్ణ మనతో యుద్ధానికి సిద్ధమైవుండడమే మంచిది. యుద్ధం సంభవమైనప్పుడు అతడి ఓటమి, మరణము నిశ్చితమే! శుష్ణ నిహతుడైతేగానీ. మన మనోవాంఛితం నెరవేరదు!" అన్నాడు.

పూర్వుదిశన చీకట్లు విడిపోయాయి. ఉషచ్ఛాయలు గోచరించాయి. నిశాచరులతో పగటిపూట పోరాడే భాగ్యం లభిస్తున్నందుకు ఆర్య అశ్వారోహులు ఆనందభరితులౌతున్నారు.

మరికొంతదూరం వెళ్ళాక, అరణ్యం సన్నగిల్లింది. చెట్లను కొట్టి ఆ కట్టెల్తో పెద్దపెద్ద దొడ్లు నిర్మించారు. వీటిలోనే కిరాతకుల పశుపు

లున్నాయి. రాత్రిపూట క్రూరజంతువుల నుండి రక్షణకొరకు పశువుల్ని ఈ దొడ్లల్లోకి తోస్తూ వుంటారు. ఇలాగే తమను మానవ శత్రువులనుండి రక్షించుకోడానికి, చెక్క ప్రాకారాల్ని, చెక్క దుర్గాలను కూడా కిరాతకులు నిర్మించుకోవడం కద్దు! అవకాశాన్నిబట్టి చెక్కకుమారుగా రాళ్ళను కూడా వాడుతూంటారు. ఈ దుర్గాలనే పురాలంటారు. ఈ దుర్గాలు అనేక పంక్తులుగా నిర్మించుకుంటారు. శత్రువు ప్రతి పంక్తి వద్దా పోరాడవలసి వుంటుంది.

ఆర్య సైనికులు కిరాతకుల పురాన్ని సమీపించేసరికి, రెండువైపుల నుండి శరపరంపరలు ప్రారంభమయ్యాయి. షుష్ణ, కుత్స ఆర్యనేయుడి సైన్యాన్ని ఎదుర్కోవడానికి పూర్తిగా సన్నద్ధుడై యున్నాడు. పీతకేశులూ, బాణాలు విడువసాగారు. విలువిద్యలో అసురులకంటే పీతకేశులే నేర్పరులు. పీతకేశుల బాణఫలకాలు రాగివి! కానీ కిరాతకులు తమ బాణాలకు, రాతి ఫలకాల్ని వాడుతూంటారు. ఆర్యుల రాగిబాణాలంతగా అసురుల రాతి బాణాలు గాయపరచలేవు. కానీ అసురులు తమ బాణాల ఫలకాలకు విషం పూస్తారు. ఏమాత్రం దెబ్బతగిలినా, మానవులు కానీ, గుర్రాలు కానీ బ్రతకడం అసంభవమే అవుతుంది. అయితే ఆర్యులు రాగి శిరస్త్రాణాలనూ, రాగి చర్మ కవచాలనూ ఉపయోగించి అసురుల బాణాల దెబ్బలు తమకు తగలకుండా కాపాడుకుంటూ వుంటారు.

ఉభయసైన్యాలూ బాగా దగ్గిరపడ్డాయి. కత్తియుద్ధం, గదాయుద్ధం, బల్లెల్తోయుద్ధం ప్రారంభమైంది. ఆర్యులందరివద్ద తీక్ష్ణమైన బల్లెలున్నాయి. అసురుల గదలు రాతివి. ఆర్యుల గదలు రాగివి. పైగా రంపపుపళ్ళలాటి పళ్ళూ పదునూ కలిగి ఉంటాయీగదలు. అసురుల గదలు కేవలం శిరస్సును పగులగొట్టగలవు. కానీ ఆర్యుల గదలు కోయనూ, పగుల గొట్టనూ రెండింటికీ పనికివస్తాయి. ఆర్యుల అసి కూడా చాలా పదునైనదే: ఆయుధాలదృష్ట్యా అసురులకంటే ఆర్యులే బలవంతులని చెప్పవచ్చు. శత్రువుకు బాగా దగ్గరకు వెళ్ళక ఆర్యులు గుర్రాలను వదలి ద్వంద్వ యుద్ధానికి తలపడ్డారు. కుత్సుడి పరాక్రమం, యుద్ధనైపుణ్యం అపూర్వం: ఒకే ఒక కత్తిదెబ్బకు శత్రువు తల ఎగిరిపోతోంది. దుర్గద్వారాన్ని సమీపించాక ఒక రొకరు కలియబడ్డారు. అప్పటికి వెలుగు పూర్తిగా నిండార

లేదు. ఒకరి నొకరు గుర్తించడం కొంత కష్టమే అయినా, శరీరపాటవాన్నీ, దీర్ఘకాయాన్నీ బట్టి ఆర్యుల్ని అసురులు పోల్చుకొనవచ్చు. అసురులు ఆర్యులకంటె పొట్టివారూ, బలహీనులే అయినా, సాహసంలో ఆర్యుల కేమాత్రమూ తీసిపోరు. శరీరం క్షతవిక్షతమైనప్పటికీ లెక్కచేయకుండా శత్రువుతో తలపడి పోరాడుతూనేవుంటారు. పూర్తిగా దెబ్బతిని నిలబడ లేక స్పృహతప్పి పడిపోయినప్పుడు మాత్రమే కిరాతకుడు యుద్ధాన్ని విరమిస్తాడు. అసురుల దుర్గాలు శ్రేణీబద్ధమై యుంటాయి. ఒక శ్రేణిని జయించడానికి ఎంతసమయం తీసుకుంటో, అంతే సమయం రెండవశ్రేణిని జయించడానికీ తీసుకుంటోంది. ఉభయదళాల్లోని సైనికులూ భీకరంగా అరుస్తూ, కేకలువేస్తూ ఒకరిమిదకు మరొకరు దూకుతున్నారు. తమ తమ దేవతలకూ దేవుళ్ళకూ జయకారాల్ని పలుకుతున్నారు. అప్పటివరకూ పీత కేశులు శుష్ణ అనుచరులతోనే పోరాడుతున్నారు. శుష్ణ ఇంకా యుద్ధంలోకి దిగలేదు. అయితే అన్నివిధాలా సంసిద్ధుడై యున్నాడు. ఆర్య సేనాపతితో తలపడడానికి నిరీక్షిస్తున్నారు.

సూర్యోదయమైంది. ఉభయ సైన్యాల సేనానాయకులూ ఒకరిని ఒకరు సమీపించడానికి అవకాశం లభించింది. ఇతర కిరాతకుల్లాగా శుష్ణ కూడా పొట్టివాడే. అయితే మహాబలశాలి! అతడి చేతిలో పెద్దగద ఒక టుంది. ఆ గదాఘాతం తిన్న శత్రువు తల వ్రక్కలవుతుందనడంలో సందేహం లేదు. సేనానాయకులిద్దరూ ద్వంద్వయుద్ధానికి తలపడ్డారు. సారథి (సేనాధిపతి) కుత్సఆర్యనేత పరిస్థితి ఒక రకంగా ప్రమాదంలోనే పడ్డదన వచ్చు. శుష్ణ చేతిలోని గదతో ఒక్కదెబ్బ తిన్నాడా ఇక బ్రతకడం కల్ల. వాస్తవానికి శుష్ణ గొప్ప యోధుడు. కుత్స ఆర్యనేతుడు, శుష్ణ - ఇద్దరూ తెగబడి ఒకరిమిదకు ఒకరు గదల్ని విసురుకుంటున్నారు. గదాచాలనంలో శుష్ణువుయొక్క హస్తలాఘవాన్ని చూచిన అసురులు, తమ నాయకుడు బ్రతికి వస్తాడన్న ఆశనే వదులుకున్నారు. కుత్సుడు పొడవుగా సన్నగా వున్నాడు. గదాచాలనంలో అతడూ శుష్ణుకు ఏ మాత్రమూ తీసిపోవడంలేదు. మహా శౌర్యంతో పోరాడుతున్నాడు.

అదను కనిపెట్టి శుష్ణ ఒకమాటు గదను విసిరాడు. అత్యంత లాఘవంతో ఎగిరి మరోచోటుకు దూకి దెబ్బను తప్పుకున్నాడు కుత్సుడు.

ఆర్యనేయుడు శుష్ణు విసరే దెబ్బలన్నింటినీ అతి నేర్పుతో తప్పించు కుంటున్నాడు. చివరకు తన రాగిగదతో శుష్ణును గాయపరచాడు కూడా. ఆర్యనేయుడి రాగిగదతో దెబ్బ తిన్నాక, శుష్ణుడిలోని ఆవేశం పౌర్ణమినాటి సముద్రంలా పొంగింది. మహోద్రేకంతో పోరాడసాగాడు. శుష్ణుడు పసుపు పచ్చని శరీరం కలవాడు. బలమైన అంగాలు కలవాడు. వజ్రశరీరుడు. వజ్రాయుధుడు కూడాను. అతడినుండి ఇక ఆర్య నేయుణ్ణి రక్షించడం ఎవరివశమూ కాదేమో అనిపించింది. రక్షిస్తే ఇంద్రుడే రక్షించాలి. ఆర్యులు ఇంద్రుణ్ణి స్తుతించసాగారు. సువర్ణవర్ణుడైన పురుషు డొకడు ఆర్యనేయుడి వద్దకువచ్చి నిలబడి శుష్ణుడియొక్క గదాఘాతాల్ని విఫలం చేయసాగాడు. కొద్దిక్షణాల తరువాత శుష్ణుడియొక్క గద విరిగి పోయింది. సువర్ణవర్ణుడు అదనుకనిపెట్టి, తన రాగి ఆయుధంతో శుష్ణుడిని మోదాడు. శుష్ణుడు మొదలు నరికిన వృక్షంలా నేలకొరిగాడు. ఆర్యసైన్యం హర్షధ్వానం చేసింది. కాని, శత్రువు పూర్తిగా పరాజితుడు కాలేదు. ఇది హర్షోన్మత్తతకు సమయం కాదు.

శుష్ణుడు నేలకు ఒరగడంతో ఆర్యనేయుడిలో నూతనోత్సాహం నిండింది. అమితోత్సాహంతో శత్రుసంహారం చేయసాగాడు. శుష్ణుడి తరు వాత అతడి స్థానాన్ని అసురుడు స్వీకరించాడు. కువయుడుకూడా అసుర వీరుల్లో ప్రసిద్ధుడే! ఋజిశ్వుడు, ఇతర ఆర్యరాజకుమారులు ఆర్యనేయుడి సాయానికి వచ్చినిలబడ్డారు.

అపరాహ్ణానికి ముందే శత్రుసేన ఛిన్నాభిన్నమైంది. యుద్ధక్షేత్ర మంతా ఆర్య, అసుర వీరుల శవాలతో నిండిపోయింది. అసుర వీరులు అపఖ్యాతంగా మరణించారు. ఇంద్రుడు తమపట్ల వరదహస్తుడై యున్న ప్పటికీ, ఆర్యులూ పెద్దసంఖ్యలో నశించారు. అసురులు తమ పురాన్ని వదలి బృహత్పర్వతాల్లోకి పరుగెత్తారు. ఆర్యులు కొంతదూరం వారిని వెంబడించి, వెనక్కి తిరిగి వచ్చారు. అసురపురంలో లభించిన సర్వ సంపదలనూ ఆర్యులు ప్రోగుచేసుకున్నారు. కొంతమంది ఆర్యులు క్షత గాత్రులయిన తమ సైనికులకు సేవ చేస్తున్నారు. మరికొందరు అలి సటను తీర్చుకోవడానికి విశ్రమించారు. క్షతగాత్రులయిన అసురుల గోడు వినిపించుకునేవాడె లేడు.

ఋష్మపురంలో ఆర్యులకు పశుధనం అపారంగా లభించింది. కిరాత కులు ఈ పశువుల నిమిత్తమే పర్వతాల్ని దిగి సమతల ప్రదేశాల్లో శర దృతువును గడుపుతుంటారు. అప్పటి కింకా పశువుల్ని దొడ్లలోనుండి విడువలేదు. పురుషులందరూ యుద్ధంలో నిమగ్నులయ్యారు. స్త్రీలు పురుషు లకు సాయం చేస్తున్నారు. ఘోరంగా పోరు జరుగుతున్నప్పుడు పశువుల్ని విడవాలన్న ఊహే పిల్లలకు కలగలేదు. ఇంతలోనే ఆర్యులు నగారాను మ్రోగించారు. అంటే తమ విజయాన్ని ప్రకటించారన్న మాట.

తాత్కాలికంగా విజయం లభించినప్పటికీ ఇదే తుది విజయమని ఆర్యులు భావించలేదు. భావించడంలేదు కూడాను. కులీతరుడి పుత్రుడు శంబరు డింకా బ్రతికేఉన్నాడు. అతడు బ్రతికి వున్నంతకాలం అసురులు అజయులే! ఎలాగైనా శంబరుణ్ణి పరిమార్చడానికి ఆర్యులు సంసిద్ధు లయ్యారు.



# 12. ఋజిశ్వుడి యుద్ధం

"దివే దివే సదృశీరన్యమర్ధ అసేధదప సద్మనో జాః
అహ న్దాసా వృషభోవ వస్నయంతోదబ్రజే వర్చినా శంబరంచ"

(ఋక్కు. 6-31.4)

చలికాలంలో, పర్వత సానువంతట్లోనూ అసురుల శరత్పురాలు నెలకొంటూ వుంటాయి ఈ పురాలను విధ్వంసం చేయడం, సమాప్తంచేయడం ఆర్యుల అతి ప్రధానమైన కర్తవ్యాల్లో ఒకటి. యుద్ధం విరమించుకుని అప్పటికి లభించిన అల్ప విజయంతోనే సంతృప్తిపడి వూరుకునేట్లయితే. అది ఒక రకంగా శత్రువుకు తలవంచినట్లే అవుతుంది. కనుకనే ఆర్య రాజకుమారులందరూ విభిన్నదళాలుగా ఏర్పడి అసుర పురాలను పోచసాగారు. దివోదాసు అసురులతో మొదటగా యుద్ధాన్ని ప్రారంభించినప్పుడు ఇరవై, ఇరవైరెండు సంవత్సరాల యువకుడు. కాని, శంబరాసురుణ్ణి సంహరించి పూర్తిగా విజయాన్ని పొందడానికి నలభై సంవత్సరాలు పట్టాయి అంటే దివోదాసు అరవై, అరవైరెండు సంవత్సరాల వాడయ్యాడు! దాదాపు శంబరుడుకూడా ఇదే వయస్సుకు వచ్చాడు. శంబర సంహారమే దివోదాసుయొక్క జీవితలక్ష్యం.

మరుసటి శరత్తులో ఋజిశ్వుడు తన క్రౌర్యాన్నీ, పరాక్రమాన్నీ ప్రదర్శించి, పిప్రు, వంగృద కరంజ పరణ్య, మృగయు - మొదలుగాగల అసుర మహావీరుల్ని సంహరించాడు. ఈ అసురవీరుల ననుసరించి ఆర్యుల్తో సమరం సాగించడానికి యాభై వేల వరకూ అసురసేన వచ్చింది. ఆర్యవీరులు ఈ మొత్తం అసురసేననూ వధించారు. అసురుల పురాలన్నింటినీ ధ్వంసం చేశారు. మొత్తం అసుర పురాలు 99 వరకూ వున్నాయి. ఈ మొత్తం పురాలకూ శంబరుడే అధినాధుడయినా, ప్రతి పురానికీ ఒక్కొక్క పురనాయకుడుంటాడు. శుష్ణుడు మరణించాక మిగిలిన పుర నాయకులు నిరుత్సాహపడలేదు. సరికదా, ద్విగుణీకృతోత్సాహంతో ఆర్యుల్తో పోరాడడానికి సిద్ధపడ్డారు. తమ ఓటమికి ప్రతీకారాన్ని అక్షరాలా చేయసాగారు. బృహత్పర్వతానికి క్రింద క్షుద్రపర్వతాలూ అనేకంగా వున్నాయి. ఆ పర్వతాల్లోనే కోటల్ని (దుర్గాల్ని) నిర్మించుకుని పోరాడసాగారు. క్షుద్ర పర్వతాల్లో లభించే సాధారణమైన రాయితోనే, శత్రువుకు అలివికాని ఎత్తయిన గోడల్ని కట్టుకునేవారు వాటినే దుర్గాలుగా (ఇవే పురాలు, కోటలు కూడాను) ఉపయోగించుకునేవారు.

అసురుల మస్తిష్క తంత్రువుల్ని ఒకేఒక ప్రశ్న మాటిమాటికి మెలిపెడుతూంది. చలికాలంలో. క్రింది వేడిప్రదేశాల్లోకి తామూ తమ పశువులూ వెళ్ళడానికి వీలుంటుందా ? వుండదా ? వీలు వుండకపోతే, బృహత్పర్వతాలపైనే చలికాలపు నాలుగునెలలూ గడపడం సంభవమా ? చలికాలంలో, బృహత్పర్వతాలపైన మంచు విస్తారంగా కురుస్తుంది. తామూ తమ పశువులూ జీవించడానికే వీలువుండదు. పశుగ్రాసం దుర్లభం ! తామూ, తమ పశువులూ చలికాలంలో, బృహత్పర్వతాలపైన, నిరాహారస్థితిలో మంచులో కప్పబడి దుర్మరణంపాలు కావడంకంటే. శరత్పురాలను రక్షించుకోవడంలో వీరమరణాన్ని పొందడం నయంకదా ? !

అసురు లందరూ కృతనిశ్చయులయ్యారు. తమ శరత్పురాల్లోని అంగుళాంగుళం ప్రదేశాన్ని రక్షించుకోవడానికి రక్తాన్ని ధారపోస్తున్నారు.

ఆర్యులే అసురుల ముఖ్య శత్రువులు. అసుర పురాలను దోచడానికి సదా పొంచుని వుండేది ఆర్యులే. కాని, పణి నిషాదజాతులు ఆర్యులకు సాయం చేస్తూంటాయి. ఈ కారణంవలన పణి. నిషాదుల్తోకూడా కిరాతకు

లకు ఏమంత ఉత్తమమైన సంబంధాలు లేవు. పణి నిషాదులు ఆర్యులకు ప్రేమపాత్రులు కాదు. వీరిని ఆర్యులు పశువుల్లా చూస్తూంటారు. అయితే, దోచిన ధనాన్ని పంచేప్పుడు వీరికి కొంత భాగాన్నిస్తుంటారు. కనకనే పణీ, నిషాదజాతి ప్రజలు ఆర్యుల వెనక తిరుగుతూంటారు. ఈ పణీ, నిషాదులవలన కిరాతకుల అవసరాలు కొన్ని పూరింపబడుతూ వుంటాయి. తీక్ష్ణమైన రాగిఆయుధాలు పణులనుండే లభిస్తుంటాయి కిరాతకులకు. నిషాదులూ, కిరాతకుల్లాగానే అరణ్యవాసులు. అయితే నిషాదుల స్వభావాల్లోనూ, కిరాతకుల స్వభావాల్లోనూ చాలా వ్యత్యాసంవుంది. కిరాతకులు ఆర్యులకంటే తాముఏవిధంగానూ హీనులమనిభావించరు. పైగా వారు పర్వతారణ్యాలకు అనాదిప్రభువులు! ఆ సంవత్సరపు శరత్తు కిరాతకుల అదృష్టాన్ని అటో ఇటో తేల్చేయనుంది. అప్పటికి యుద్ధం పిప్రు, మృగయు, అర్షు, కువయ - మొదలుగాగల అసుర వీరుల్తోనే జరుగుతోంది. అయితే ఇంతమంది అసురవీరుల దుర్గాల్లోనూ స్వయంగా శంబరుడే వుండి సైనికసంచాలనం చేస్తూన్నట్లుగా కనబడు తోంది. ఏ క్షణాన ఏ దుర్గం బలహీనపడ్డట్లు తెలిస్తే, ఆక్షణాన ఆ దుర్గానికి వెళ్ళి, శత్రువుల్తో పోరాడి స్వసైన్యాలకు ఉత్సాహాన్ని కల్పించసాగాడు శంబరుడు! అనేకమంది ఆర్యరాజులూ రాజకుమారులూ కూడా శంబరుడికి ఏమాత్రమూ తీసిపోని మహోత్సాహంతో పోరాడుతున్నారు. కుత్స ఆర్జునేయుడు, పురుకుత్సుడు (పురువంశపు కుత్సుడు) త్రసదస్యుడు, శ్వైత్ర్యుడు, తుర్వీతి, దభీతి, ధ్వసన్తి, పురుషంతి మొదలైన ఆర్యవీరులు శంబరుడితో సరితూగగల మహాపరాక్రమంతో పోరాడుతున్నారు. పై రాజకుమారులు అసురపురాల మీద స్వయంగా ముట్టడులను జరిపేవారు. దివోదాసు అదనపు సైన్యాలతో సిద్ధంగావుండి, ఏ రాజకుమారుడికి తన అవసరం కలిగితే అక్కడికల్లా, అత్యంత వేగగాములైన అశ్వాల సాయంతో వెళ్ళి చేరుతున్నాడు.

చాలా కష్టనష్టాలకోర్చి, సమతల అరణ్యప్రదేశాలనుండి కిరాతకుల్ని తరిమేశారు ఆర్యులా సంవత్సరం. ఇక నిప్పుడు కిరాతకులు పర్వత దుర్గాల నాశ్రయించారు. వాటిలోవుండి ఆర్యుల్తో యుద్ధం చేయ సాగారు. ఈ పర్వత దుర్గాలను జయించడం సమతల ప్రదేశాల్లోని పురాలను జయించినంత తేలికకాదు! అసురుల పర్వతదుర్గాలను

దుర్గమమైన పర్వతాలపైన నిర్మించుకుంటారు. ఆ పర్వతాలను ఎక్కడానికి ప్రయత్నించే శత్రువులపైన, పైనుండి పెద్దపెద్దరాళ్ళను దొర్లించి చంపుతారు. కనుకనే, అసురుల 99 దుర్గాలను జయించడానికి సుదీర్ఘమైన నలభై సంవత్సరాలు పట్టాయి.

*　　*　　*

నలభయ్యోవ సంవత్సరాన కిరాతకులకు ఆర్యులకు అంతిమ యుద్ధం జరిగింది. ఈ యుద్ధం శంబరుడికి, ఆర్యులకు ఉదవ్రజ (నీటికోట) లో జరిగింది. ఉదవ్రజ శత్రుదుర్భేధ్య మయింది. కనుకనే ఈ దుర్గాన్ని ఎన్నుకున్నాడు శంబరుడు. ఈ దుర్గం (వ్రజ) ఒక నదీజల (ఉద) సమీపంలో వుంది. బహుశ ఈ ప్రదేశం ప్రస్తుత 'కాంగడా' కావచ్చును. ఈ కాంగడా యొక్క దుర్గం పంథొమ్మిదవ శతాబ్దం వరకుకూడా అజేయంగానే వుంది. పంథొమ్మిదవ శతాబ్ద ప్రారంభంలో నేపాలీయులనుండి ఈ దుర్గాన్ని రణజీత్ సింగ్ చాలా కష్టంమీదట గెలుచుకున్నాడు. రణజిత్‌సింగ్ నుండి ఈ దుర్గాన్ని గెల్చుకోవడానికి ఇంగ్లీషువారూ బహుప్రయాస పడ్డారు. ఈ దుర్గంలో ఒకటి రెండు సంవత్సరాలవరకూ అవసరమైన నీటనీ, ఆహార పదార్థాలనూ భద్రపరచుకోనవచ్చును. మనుష్యులు, పశువులుకూడా అధిక సంఖ్యలో వుండడానికి అవకాశం వుంది ఈ దుర్గంలో. ఈదుర్గంపై ఆక్రమణ చేసేవారు ఒక దుర్గమమైన పర్వతాన్నెక్కవలసి వుంటుంది. శత్రువులలా పర్వతాన్నెక్కుతూంటే పైనుండి రాళ్ళు దొర్లించి తమను రక్షించుకోవడానికి ఈ దుర్గంలోనివారికి పూర్తి అవకాశాలున్నాయి. ఆ తరువాత వచ్చిన లోకోక్తుల ఆధారంగా ఈ ఉదవ్రజమే జలంధరుడి దుర్గమనికూడా స్పష్టమౌతున్నది. రాక్షసరాజు జలంధరుణ్ణి ఇంద్రుడు చంపాడు. అప్పుడే జలంధర ప్రదేశం దస్యునిర్ముక్తమైంది. జలంధరుడు మరెవరో కాదు. ఈ అసురవీరుడు శంబరుడే! ఈ మహావీరుణ్ణి జలంధరుడిగా మహా దైత్యుడిగా వికృతికల్పన చేశారు మనవాళ్ళు!

మహాసేనాపతి వర్చీకూడా శంబరుడికి కుడిచేయి లాటివాడు. ఈ ఉదవ్రజ అసురరాజు శంబరుడి అంతిమదుర్గం! ఇక్కడ ఆర్యులకూ అసుర

లకు ఘోరంగా పోరు జరిగింది. ఈ ఉద్రజలోనే మహాసేనానాయకుడు వర్చి నూరువేల మంది అసురయోధులతో ఆర్యుల్ని ఎదుర్కొన్నాడు !

* * *

మహా ప్రమాదస్థితిలోకూడా శంబరుడు మానసిక స్థయిర్యాన్ని గోల్పోడు. అయితే, స్థితియొక్క గంభీరతనుకూడా పూర్తిగా గమనించ గలవాడు ! అసురయోధులూ, సేనానాయకులూ వేల సంఖ్యలో నశించారు. క్షణానికోమారు వాళ్ళ ఆకారాలు శంబరుడి కండ్లముందు ఆడుతున్నాయి. ఒకప్పుడు శుష్ణ శౌర్యం జ్ఞాపకంవచ్చేది. మరోప్పుడు తనకు బాల్యస్నేహితుడైన కువయ స్ఫురణకు వచ్చేవాడు.

ఆ రోజు యుద్ధాన్నిగురించి వర్చితో సమాలోచన జరుపుతూ ఇలా అన్నాడు శంబరుడు "మన ప్రతి వీరుడూ గొప్ప పౌరుషాన్ని ప్రదర్శించాడు. ప్రతిసారీ విజయం మనదరిదాపుకువచ్చి, చేయిజారిపోతూవచ్చింది. నిజం ఆలోచిస్తే విజయానికీ పరాజయానికీ పెద్ద వ్యత్యాసం ఏమీవుండదు. విజయాన్ని పొందినవాడు, పరాజయాన్ని పొందినవాడు ఇద్దరూ ఒకే మార్గంలో, ఒకే వేగంలో పరుగెడుతూంటారు. చిట్టచివరిస్థితిలో, కేవలం ఒక్క అంగుళం వ్యత్యాసంలో, విజయ పరాజయాలు నిర్ణయింపబడుతాయి. ఒకడికి విజయం, మరొకడికి పరాజయం ! ఇప్పుడూ విజయ - పరాజయాలను గురించి ఈ భావనే నాలోవుంది !"

"మీ భావనను నేను ఆమోదిస్తున్నాను. మనంచేసిన ప్రతి యుద్ధంలోనూ, విజయ పరాజయాలకు కేవలం ఒక్క అంగుళం మాత్రమే వ్యత్యాసం కనబడుతోంది ! పీతకేశులు తమ విజయాలకు కారకుడు, తమ దేవుడైన శక్రుడని (ఇంద్రుడు) చెప్తారుకదా ?"

"శక్రుడు, వక్రుడు. అదంతావట్టిది ! మన అసురసైనికులు యుద్ధంలో ఆర్యులకు ఏమాత్రమూ తీసిపోలేదు ! శుష్ణుతో పోరాడిన ఆ ఆర్యవీరుడి పేరేమిటి ?"

"కుత్సుడు !"

"అవును, కుత్సుడే ! అతడిని సంహరించడం శుష్ణువుకు చిటికలు వేసిన మాత్రం ! శుష్ణ వజ్రం (గద) కుత్సుడి శిరస్సుమీద పడినట్లయితే, అతడక్కడే కుప్పకూలిపోయేవాడట !"

"అవును, కూలిపోయేవాడే. కాని, కుత్సుడు తెలికయిన మనిషి కావడంవలన, చప్పున ఎగిరి, స్థానంనుండి తప్పుకుని బ్రతికిపోయాడు !"

"అంతే, విజయ పరాజయాలకు ఇదే వ్యత్యాసం: ఆ రోజున కుత్సుడేగనక మరణించినట్లయితే, పీతకేశుల ధైర్యం సన్నగిల్లేది. ఇక అసురపురాలవంక కన్నెత్తయినా చూడడానికి సాహసించేవారు కారు !"

"నిజం" నా కదకూడా దివోదాసు తలమీద నాట్యమాడేరోజు, నా గదాఘాతంవలన అతడి తల సహస్ర వ్రక్కలయ్యేరోజు చాలా దగ్గరలో వుంది. ఇంద్రుడే దిగివచ్చినా, అనాడు, నా గదాఘాతంనుండి దివోదాసును రక్షింపలేడు !"

ఆర్యులు చాలా పురాలను ధ్వంసం చేశారు. వారి ధైర్యం పెరుగుతూనే వుంది. ఆర్యయోధుల్ని యుద్ధరంగానికి పంపే బాధ్యతను భరద్వాజ మహాఋషి తీసుకున్నాడు. ఋషి సప్తసింధు అంతట్లోనూ పర్యటించాడు. ఇంద్రుడి సందేశాన్ని ఆర్యులందరికీ ఈ విధంగా వినిపించాడు: "శంబరుడి చావు దగ్గరకు వచ్చింది. అసురుల పరాజయం, ఆర్యుల విజయం సునిశ్చితం! ప్రతి ఆర్యుడూ ఈ దేవాసుర సంగ్రామంలో పాల్గొనండి! మీ రక్తాన్ని, మీ పౌరుషాన్ని చిందించండి! ఇలాటి సదవకాశం అన్నప్పుడల్లా లభించదు !"

సప్తసింధులోని అన్ని ప్రాంతాలనుండి ఆర్యవీరులు వచ్చి యుద్ధంలో చేరుతున్నారు. వీరిని ఋషి అవుసరమున్న స్థానాలకు పంపుతూంటాడు. ఇప్పుడు అసురుల పురాలన్నీ ధ్వంసమయిపోయి కేవలము ఉదబ్రజవద్ద మాత్రమే సంఘర్షణ జరుగుతోంది. కనుక ఋషి ఆర్యయోధు లందర్నీ ఉదబ్రజకు పంపించివేస్తున్నాడు. అసురులుకూడా తమ సమస్త సైన్యాలనూ ఉదబ్రజవద్ద నిలిపారు.

వచ్చె నూరువేలమంది అసురవీరుల్తో ఉదబ్రజలో ప్రథమ పంక్తిలో ఆర్యుల్తో సంఘర్షిస్తున్నాడు. దివోదాసూ అక్కడికిచేరాడు. అసురసంహారం రోజూ జరుగుతోంది. ఆర్యుల ఆయుధాలు రాగివి. అసురుల ఆయుధాలు రాతివి. ఆర్యులకు, అసురులకు సంఘర్షణలు ప్రారంభమయ్యాక పణులు అసురులవద్దకు ఆర్యుల భయంవల్ల, ఆయుధాల్ని తీసుకుని వెళ్ళటంలేదు. అసురులుతమకు అవుసరమైన ఆయుధాల్ని రాతితో చేసుకుంటున్నారు.

శంబరు డిలా అన్నాడు: "చావనమో లేక జయించనమో! ఈ రెండే ఈనాడు మన ముందున్న మార్గాలు! పరాజయాన్ని చూడ్డానికి మనం బ్రతికి వుండకూడదు! మన బ్రతుకులూ, మన చావులుకూడా మన జాతి యొక్క పౌరుషానికి అనుగుణంగానే వుండాలి!"

రోజు రోజుకూ అసురుల మృత్యుసంఖ్య పెరిగిపోతోంది. అయినా శంబరుడు ఏ మాత్రమూ విచలితుడు కాలేదు. వజ్ర హృదయుడు. ఒక్క శంబరుడేగాదు, అసురు లందరూ దృఢసంకల్పులూ, దృఢహృదయులూ అయి యుద్ధం చేస్తున్నారు.

శంబరుడు చివరకు పర్వతాల్లోని సరోవరా లన్నింటిలో విషం కలిపించాడు. కొన్ని జలస్రోతస్సుల్ని ఎండపెట్టేశాడు. ఆ నీరు త్రాగగానే ఆర్యులు ప్రాణాలు విడుస్తూండేవారు. బ్రతికివున్న ఆర్యులు నీటిని త్రాగడానికి భయపడుతూ వుండేవారు. గొంతు ఎండినా గుక్కెడు నీరు త్రాగడానికి సాహసించేవారుకాదు. కొండలు ఎక్కడంవల్ల దాహం విపరీతంగా అవుతూ వుండేది. గొంతు ఎండిపోయేది. కొంతమంది, పర్వతాలను ఎక్కుతూనే, దాహానికి తాళలేక పడిపోయేవారు. ఇక ఎన్నటికీ లేచేవారుకారు. మాటిమాటికీ ఆర్యులకు ఇంద్ర, సోమ, వరుణులు పడుతూండేవారు. మానవ ముఖాలనుండి దేవాజ్ఞలు ప్రసారమౌతూండేవి "విజయం దగ్గర్లో వుంది. ముందుకు పదండి."

పై విధంగా ఆర్య వీరులు దేవతలద్వారా నడిపింప బడినవారై, ముందుకు వెళ్ళిపోతున్నారు. ప్రతి బండరాయినా, ప్రతి రాతిప్రక్కనా ధనుసూ, బాణము లేసుకుని, అసురులు దాగి కూర్చున్నారు. ప్రతి అడుక్కీ ఎవడో ఒక ఆర్యుడు అసురుల బాణానికి గురియై క్రిందికి దొర్లుతూనే వున్నాడు.

చివరకు ఆర్యసైనికులు ఒక సమతల ప్రదేశాన్ని చేరారు. దివోదాసుకూడా వెంట వున్నాడు. సంధ్యారాగం పశ్చిమాకాశంలో అలుముకుంది. త్వరలో అంధకారం వ్యాపించనుంది. రాత్రి పూట అసురుల బలం పెరుగుతుంది. ప్రొద్దు క్రుంగేలోపే శంబరాసురుణ్ణి సంహరించాలని దివోదాసు నిశ్చయించుకున్నాడు. తన సైన్యంతో సహా నాలుగడుగులు ముందుకు వేసేసరికి ఒక రాతిద్వారం కనుపించింది.

అసురులు పంక్తి బద్ధులై ఆ ద్వారాన్ని రక్షిస్తున్నారు. దివోదాసు సైన్య సమేతుడయి, ద్వారం వద్దకు పోయాడు. ఘోరయుద్ధం జరిగింది రాత్రి ద్వారం ఆర్యుల వశమైంది. ద్వారాన్ని దాటి కొంతదూరం పోయాక ఒక గుహ వచ్చింది. ఆ గుహలోనే శంబరుడున్నాడు. దివోదాసు ఇలా అరిచాడు : "కులతర పుత్రా ? శంబరా ! నీవు నిజంగా కాపురుషుడివి ! నేను నీ శత్రువును, దివోదాసును. గుహలోనుండి బయటకురా ! ఇద్దరం పోరాడదాం ! బ్రతికినవారు గెలిచినట్లు, చనిపోయినవారు ఓడినట్లు !"

మేఘగంభీర స్వరంలో దివోదాసు నోటినుండి వెలువడ్డ మాటల్లో ఒక్కటీ శంబరుడికి అర్థమైందని చెప్పలేము. కానీ, స్వరంలోని కాఠిన్యమూ, కర్కశత్వమూ శత్రువుయొక్క భావాన్ని వ్యక్తపరుస్తున్నాయి.

శంబరుడు పెద్ద గద నొకదాన్ని చేతపుచ్చుకుని, ఏమిటో అరుస్తూ దివోదాసు మీదకు లంఘించాడు. గదాయుద్ధం ప్రారంభమైంది. గురిచూసి అరక్షితంగా ఉన్న శరీరాంగాల మీద గదల్ని విసురుకుంటున్నారు. అయితే ఇద్దరూ నేర్పుగా దెబ్బల్ని తప్పుకుంటున్నారు. అప్పటికింకా పూర్తిగా అంధకారం వ్యాపించలేదు. శత్రువులు ఒకరినొకరు చూసుకోడానికి చాలినంత వెలుగువుంది. దివోదాసు శరీరం గౌరవర్ణంలో వుంది. తల వెంట్రుకలు పసుపు పచ్చగా వున్నాయి. చేతిలో రాగి గద, పౌరుషానికి తగినట్టుగానే విశాలమైన శరీరం ! కిరాత - రాజు కొంచెం పొట్టివాడు. అతడి ముఖం దీప్తివంతంగా వుంది. అతడి ముఖంలో మృత్యుఛాయలు కనుపించడంలేదు. విజయోల్లాసం తొణికిసలాడుతోంది :

ఆర్యవీరులూ, కిరాతయోధులూ వీరిద్దరి చుట్టూ ప్రోగుపడి చూస్తూన్నారు. కానీ, ఎవరూ ఎవరికీ సహాయం చేయడంలేదు. అలా సహాయం చేయరాదని వారి నాయకుల ఆజ్ఞ !

దివోదాసు ఇలాటి మహావీరుడైన శత్రువు దొరకడం గొప్ప అదృష్టమనే చెప్పాలి !" అన్నాడు.

దివోదాసు, శంబరుడూ ద్వంద్వయుద్ధం చేస్తూన్నారు. ఇంద్రుడి సంకల్పం అగ్ని పరీక్షలో వుంది.

అందరి చూపులూ ఇద్దరి వీరులమీదా కేంద్రీకృతమై వున్నాయి. తన తలమీదకు విసరబడుతున్న గదా ఘాతాల్ని అతి నేర్పుగా వ్యర్థపుచ్చు

తున్నాడు దివోదాసు. శంబరుడూ అంతే! కానీ, చివరకు ఒక్క దెబ్బను, గురి చూసి శంబరుడి గుండెలకు తగిలేట్టు కొట్టాడు దివోదాసు. శంబరుడు మారుమాట్లాడకుండా క్రింద కూలిపోయాడు. అతడి హృదయానికి తగిలింది దెబ్బ! శంబరుడు నేలకు వరగడం చూసి ఆర్యులు హర్షధ్వానం చేశారు. కిరాతరాజు నిశ్చేష్టుడై నేలమీద పడివున్నాడు. కిరాతరాజు పడిపోగానే ఆర్యులు అసురులను చిత్రవధ చేయసాగారు. అదే సమయంలో వర్చి శంబర శత్రుడైన దివోదాసుమీదకు పరుగెత్తాడు. అతడిని మధ్య లోనే కుత్సుడు ఆపబోయాడు. కానీ, దివోదాసు ఇలా అన్నాడు: "ఆపవద్దు, అతణ్ణి రానివ్వు!"

దివోదాసు వర్చికి ఎక్కువకాలం పోరాడే అవకాశాన్నియలేదు. త్వరలోనే అతడూ తన స్వామి ననుసరించాడు.

* * *

ఈ విధంగా దివోదాసు శంబరుడి యుద్ధం సమాప్తమైంది. ఇంద్రుడికి జయకారాలు పలికారు. దొరికిన వరకూ అసురుల్ని చంపేశారు. ఆర్యులచేతుల్లోపడకుండా తప్పించుకున్న కిరాతకులు బృహత్పర్వతాల మీదకు పరుగెత్తారు. కొద్దిరోజుల్లోనే బృహత్పర్వత పాదభూమంతా అసుర నిర్ముక్తం అయింది. అప్పటినుండి అసురులు చలికాలంలోనూ బృహత్పర్వతాల్ని దిగడం మానుకున్నారు. మంచు ఎలుగుల చర్మాల సాయంతోనూ, నిప్పు సాయంతోనూ అక్కడి ఘోరమైన చలిని బాపుకునేవారు!

సమాప్తం

# మా నూతన ప్రచురణలు



| | |
|---|---|
| అతడు - ఆమె | వుప్పల లక్ష్మణరావు |
| 1+1=1 మొదలైన రేడియో నాటికలు | శ్రీ శ్రీ |
| మూడు యాభయిలు | శ్రీ శ్రీ |
| పేకముక్కలు | కిషన్ చందర్ |
| గంగు | వట్టికోట ఆళ్వారుస్వామి |
| రంగభూమి | ప్రేమ్ చంద్ |



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA103B142 |
| పుస్తకం పేరు | దివోదాసు |
| తారీఖు | 30 January 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 175 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | CI, BCF |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Sakshi |
| పేజీలు విడదీసినది | Sakshi |
| స్కాన్ చేసినది | Mounica |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |